అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము ౧.

ప్రథమగ్రంథము.

చలికాని లచ్చారావు.

సంపాదకుఁడు.

# జాహ్నవీమాహాత్మ్యము.

ఏనుఁగుల లక్ష్మణకవి.

అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.
ప్రథమగ్రంథము. ౧
చెలికాని లచ్చారావు.
సంపాదకుండు.

# జాహ్నవీమాహాత్మ్యము.

ఇది

ఏనుగు లక్ష్మణకవి ప్రణీతము.

మొదటికూర్పు.

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రితము.
పిఠాపురము.
1918.
వెల రు 0—10—0.

# పీఠిక.

ఈగ్రంథకర్తయగు "ఏనుఁగులక్ష్మణకవి" యొకసుప్రసిద్ధకవి. ఈతఁడు చేసినగ్రంథంబులు దైవభక్తిభూయిష్ఠంబులై యలరారుచుండును. కవిత్వము మృదుమధురపదగుంభితమై ద్రాక్షాపాకంబును బోలి యుండును. ఈతఁడు (1) రామేశ్వరమాహాత్మ్యము (భద్రిరాజుమల్లమంత్రికి* కృతి) (2) గంగామాహాత్మ్యము లేక జాహ్నవీమాహాత్మ్యము (నందూరిరామమంత్రికి*కృతి) (3) విశ్వామిత్రచరిత్రము లేక కౌశికచరిత్రము, (కృష్ణాంకితము) (4) సుభాషితరత్నావళి, (పెద్దాడసోమశంకరస్వామికి) (5) రామవిలాసము. (శ్రీవత్సవాయ గోపరాజునకుఁ గృతి) (6) గీర్వాణసూర్యశతకము (7) విశ్వేశ్వరోదాహరణము (8) నృసింహదండకము మొదలయినవి రచించెను. ఇందు మొదటి 5 గ్రంథంబులు బయటఁ బడినవి. తక్కినమూఁడుగ్రంథంబులు బయల్పడుభాగ్య మచిరకాలములోనే దేశంబునకు లభించుఁగాక! లక్ష్మణకవినామధారు లిరువురు కవులు గలరు. మొదటివాఁతఁడు పెదలక్ష్మణకవి. ఏనుఁగు గరకమంత్రి మనుమఁడు. గుర్వమంత్రికిఁ బేరమాంబకుఁ బుత్రుఁడు. శైవధర్మములు రచించినదిట్టకవి యనుపౌరుషనామము గల వెణుతురబల్లివిశ్వనాథకవికి మేనల్లుఁడు. వెణుతురుబల్లివేంకటాద్రిదౌహిత్రుఁడు. సంగీతసాహిత్యములందుఁ బ్రజ్ఞావంతుఁడు. దానశీలుఁడు. ఈతఁడు తులామాహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, ధ్రువచరిత్రము, రాజశేఖరచరిత్రమును రచించి కొన్నిక్షత్రియులకుఁ గృతి యిచ్చెను. ఇతఁడు 1619 మొదలు 1688 వఱకుఁ బెద్దాపురమును బాలించినతిమ్మనృపాలునకు సమకాలికుఁడు.

* వీరు కృతిపతులుగారు ప్రేరేపకులు.

ఈ పెదలక్ష్మణకవిపుత్రుఁడు తిమ్మకవి. ఈతనిభార్య పేరమాంబ. వీరిరువురకును సుప్రసిద్ధమై పావనంబగు శ్రీజాహ్నవీమాహాత్మ్యగ్రంథకర్త యగు "చినలక్ష్మణకవి" జనించెను. ఈతఁడు మాచిరాజు నరసింహామునిదౌహిత్రుఁడు. ఆరువేలనియోగి. ఆపస్తంబసూత్రుఁడు. వాధూలసగోత్రుఁడు. అన్న అనంతకవి, తమ్ముఁడు వీరభద్రుఁడు. మూలపురుషుఁడు సింగన్న. ఇంటిపేరు మొదట పైడిపాటివారు. సింగన్న వంశీకులలో జలపాలామాత్యుఁడు పెద్దాపురసంస్థానాధీశ్వరుఁడగు గజపతిరాజుచే నేనుఁగును బహుమతి గాంచినప్పటినుండియు నేనుఁగువారని యింటిపేరు మారినది. సీ.గీ|| "గజపతిక్షితిభర్త చేఁ గజముతోడ, నగ్రహారము లతఁడు పరిగ్రహించె, నలమి నేనుఁగువారన్న యింటిపేరు, గలిగె నతనికి గజలాభ గరిమవలన." (సుభాషితరత్నావళి) అకరపల్లికోదండరాముఁడనునాతఁడు కవిగురువైనట్లు కృత్యాదివలనఁ దెలియుచున్నది. ఈతనికిఁ గూచిమంచితిమ్మకవి సమకాలికుఁడయినట్లు కవులచరిత్రయందుండు చాటుపద్య మాధారమే గాక ఈగ్రంథమునందు "గీ. వర్తమానకవీశ్వరవరునిఁ గూచిమంచితిమ్మకవీంద్రుని మదిఁదలంతు." అనుపద్యమువలన నీకవు లిరువురు సమకాలికు లైనట్లు దేటపడుచున్నయది. ఈగ్రంథమువలన నేనుఁగు పెదలక్ష్మణకవి, వక్కలంక వీరభద్రకవి, వెలుతురుబలివిశ్వనాథకవి, ఏనుఁగు అనంతకవి, ఈదులపల్లి భవానీశంకరకవి, కూచిమంచితిమ్మకవి మొదలగుకవుల కాలనిర్ణయముతోఁ బోల్చి స్పష్టపఱచి చూచుకొనుటకు కవులచరిత్రకారులకు మిగుల మంచియాధారము కలుగుచున్నది. కృతిప్రేరేపకుం డగు నందూరికామమంత్రియు నతని పూర్వులును కాకినాడ, సెలపాక సీమల రాజమహేంద్రవరదుర్గాధిపులై కొంతకాల మేలినట్లును పెక్కుధర్మకార్యములు చేసినట్లును వివరింపఁ

బడియున్నది. బ్రాహ్మణపాలనమున నివి యెక్కువ యుండియున్నట్లు చరిత్రకారు లెవ్వరును జెప్పియుండలేదు. ఈవిషయము చరిత్రకు నూతనాంశము. పరిశీలనార్హము! గ్రంథవిషయప్రాశస్త్యము నుబట్టియుఁ గొప్ప చరిత్రాంశములు పెక్కులుండుటంబట్టియు నిది ప్రథమమున ప్రకటించితిమి. కవి క్రీ.శ. 13 వశతాబ్దమువాఁడనుట స్పష్టము.

## కవివంశవృక్షము.

- మైడిపాటి సింగన్న.
  - (ఏనుఁగు) జలపాలామాత్యుఁడు. (వత్సవాయివారివలన నేనుఁగును బహుమతిఁగొన్నవాఁడు.)
    - గంకిరాజు.
      - సర్వమంత్రి.
        - పెదలక్ష్మణకవి. (తుల్యామాహాత్మ్యకర్త)
          - తిమ్మకవి.
            - అనంతకవి.
              - గురవయ్య.
                - వీరేశ్వరుఁడు.
              - తిమ్మన.
            - చినలక్ష్మణకవి. ఈగ్రంథకర్త.
              - తిమ్మయ్య.
                - వీరభద్రుఁడు.
                - లక్ష్మణుఁడు.
              - పేరయ్య.
            - వీరభద్రుఁడు.

శ్రీ

ఈగ్రంథము బెండపూడిగ్రామములో వేమల వెంకయ్యగారి కడ "అల్లంరాజు సత్యనారాయణమూర్తి, ద్విభాషి బాపన్నగార్ల" వల్ల 'ఆంధ్రపరిశోధక మహామండలి' కొఱకు సంపాదింపఁబడినది. పాండిత్యప్రకర్షణంబు నొంది పారమార్థికబుద్ధితో భక్తిశ్రద్ధలు గలిగి కష్టపడి వ్రాసి, వరప్రసాది యనఁదగు నీకవీశ్వరుని యుద్గ్రంథమును గొందఱు మహాకవుల గ్రంథంబు లంతరింపఁజేసియు, జేయుచున్నట్టియు, లుబ్ధులవలె మూల ముక్కునఁబెట్టి పెంటలపాలు సేయుపాపమున కొడిగట్టు కాక నీమహాకవిసద్భావవిద్యాప్రబోధములను పరోపకారబుద్ధిచే లోకమునకు వెల్లడిసేయఁ బుణ్యము గట్టుకొని మాకొసంగిన సహృదయులగు నీవేమల వెంకయ్యగారి నామము కవినామమువలె శాశ్వతముగ వెలయుఁగాక! ఈగ్రంథము తాళపత్రగ్రంథంబునం దుండు వ్రాఁతలను మార్పక ముద్రించితిమి. కవిత్వమునందు మార్పులేదు. కేవలము పోయినచోట్ల "వేంకటపార్వతీశ్వరకవుల" చేఁ బూర్తిచేయఁబడి (కుండలీకరణము) లుంచఁబడెను. ఈగ్రంథప్రచురణమునకుఁ దోడ్పడినవారి కెల్లరకు మా కృతజ్ఞతావందనము లర్పించుచున్నారము.

ఈపీఠికకాధారములు :—(1) లక్ష్మణకవికృతగ్రంథములు, (2) శ్రీ వీరేశలింగము పంతులుగారి కవులచరిత్రము, (3) శ్రీదుగ్గిరాల సూర్యప్రకాశరావుగారివ్యాసము (కృష్ణాపత్రిక), (4) ఆంధ్రపరిశోధక మహామండలివారివ్యాసము (కృష్ణాపత్రిక) (5) శ్రీ పెండ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారివ్యాసము (గ్రంథాలయసర్వస్వము) నై యున్నవి. వారికిఁ గృతజ్ఞులము.

చిత్రాడ.
28-6-19.

ఇట్లు,
చె. లి. కా. ని. ల చ్చా రా వు.
సంపాదకుఁడు.
అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.

This book belongs to Ippaluri Venkateswara Rao

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# జాంబవీమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీపతిభారతీపతిశ ♦ చీపతిముఖ్యసురేంద్రవంద్యుఁడై
గోపతురంగుఁడై, బుధుల ♦ కోర్కు లొసంగెడికల్పభూజమై
వ్యాపకరూపుఁడై, సిరుల ♦ వర్తిలు వెంటురిసోమనాథుఁడా
ర్యాపతి, శంభుఁ డిచ్చు సక ♦ లాభ్యుదయంబులు భక్తకోటికిన్.

మ. సరసుల్ మెచ్చఁగ మీనమై, కమఠమై, ♦ సత్పోత్రియై, మర్త్యకే
సరియై, వామనుఁడై, త్రిరామతనుఁడై ♦ సర్వజ్ఞుఁడై, కల్కియై,
ధర జన్మించి భయంబు మాన్చి భువన ♦ త్రాణైకదీక్షాధురం
ధరుఁడై యొప్పెడుదైవతం బొసఁగు భ ♦ క్తశ్రేణికిన్ సౌఖ్యముల్. 2

మ. సురదైత్యాదివిచిత్రజంతువితతా ♦ స్తోకప్రపంచైకభా
సురనిర్మాణవిశారదుండు నిగమ ♦ స్తుత్యప్రభావుండు వా
క్తరుణీకేళిగృహాననాంబుజుఁ డసం ♦ తప్రాభవుం డవ్యయుం
డరవిందాసనుఁ డిచ్చు సాధులకు దీ ♦ ర్ఘాయుష్యసౌభాగ్యముల్. 3

శా. ప్రత్యూహప్రబలాంధకారదళన ♦ ప్రద్యోతనున్, భారతీ
పత్యాదిత్రిదశార్చనీయచరణున్ ♦ బాలేందురేఖాధరున్
ప్రఖ్యాపాకరసమానహస్తునిఁ గట ♦ ప్రస్యందిదానాంబునిన్
సత్యజ్ఞానఘనున్ గజానను నభీ ♦ ష్టప్రాప్తికిన్ గొల్చెదన్. 4

చ. అమృతపయోధిమధ్యలలి ♦ తామరభూరుహవాటికావృతా
ర్ఘ్యమణిమయాంతరీపరుచి ♦ రస్ఫుటనీపవనస్ఫురద్వదా
న్యమణిగృహాంతరస్థితశి ♦ వాకృతిమంచపదాశివాంకభా
గమున వసించుదేవి యను ♦ కల్పకవల్లి దనర్చు నామదిన్. 5

సీ. రమణునిదారాంత ♦ రము కేళిభవనంబు, కడలిఁ బ్రయాణిమీఁదు ♦ కన్నతండ్రి
కలువలచెలికాఁడు ♦ గాదిలిసైదోడు, మొసలిరెక్కముజోడు ♦ ముద్దుఁగోడలు
తెలిఁగంటిబోటులం ♦ దఱుఁ బరిచారికల్, శైలేంద్రకన్యక ♦ మేలుచెలియ
వెలిదమ్మికొలఁకులు ♦ విహరణస్థలములు, వరవేదసూక్తము ♦ ల్వందిగణము
గీ. గాంగవిలసత్ప్రణవకర్ణి ♦ కావిరాజ, దమలవర్ణమయాబ్జసిం ♦ హాసనమున
నమరఁ గొలువుండుఁ బుండరీ ♦ కాయతాక్షి, యిందిరాదేవి సంపద ♦ లిచ్చుఁగాత.

చ. పతిముఖకేళిసౌధములఁ ♦ జాయక నిల్చి మెఱుంగుఁబోఁడి, పం
డితరసనాగ్రసీమల న ♦ టించువధూటి, పటీరచంద్రికా
సితరుచిగల్గుసాధ్వి, సర ♦ సీరుహపీఠిక నుండుబోటి, వా
క్సతి కృతికల్పనాభినుత ♦ కౌశల మీవుత మాకు సత్కృపన్. 7

ఉ. ఫాలతటంబునందుఁ గర ♦ పంకజముల్ ఘటియించి మ్రొక్కెదన్
హేళికి, భాసుమాలికి, శ్రి ♦ తేడితసద్గుణపాలికిం, గృపా
శాలికి, నంధకారవన ♦ సంతతకీలికి, రోగశైలదం
భోళికి, భక్తిసమ్రమవిధి ♦ ముఖ్యసురాళికి, లోకపాలికిన్. 8

మ. స్తుతిశీలున్ శతకోటిసంఖ్యలలిత ♦ శ్లోకప్రబంధైకశో
భితరామాయణకావ్యకల్పకుని గం ♦ భీరప్రభావున్ దపో
వ్రితనిష్ఠావిమలాత్ము సేకవదన ♦ బ్రహ్మావతారుణ్ జగ
ద్ధితబుద్ధిన్ హృదయాబ్జసీమ నతిభ ♦ క్తిం గొల్తుఁ బ్రాచేతసున్. 9

క. భారతగంగాతటినీ, కారణహిమవంతు దురవ ♦ గాహశ్రుతిగం
భీరార్థతత్త్వనిర్ణయ, కారుం బ్రార్థింతు సద్వి ♦ కాసున్ వ్యాసున్. 10

క. మతిఁ దలఁతుఁ జారుసార, స్వతపూరుషమూర్తి భోజ ♦ వసుధాధిపపూ
జితుఁ గాళిదాసు బహుసం, స్కృతకృతినిర్మాణచణవి ♦ శేషమనీషున్. 11

మ. ఘనవాగర్థధురీణు బాణుని వచో ♦ గంభీరు శ్రీహీరు హ
ర్షునిఁ జోరు న్నిచుళు న్మయూరు శివభ ♦ ద్రున్ శంకరు న్మాఘు దం
డిని భాసు న్భవభూతి భారవిని భ ♦ ట్టి న్బిల్హణు న్మల్హణున్
వనజాతాసనతుల్యులన్ సుకవులన్ ♦ వర్ణింతు వాక్సిద్ధికిన్. 12

గీ. ఆంధ్రసూక్తులబాదరా ♦ యణమునిప్ర, ణీతభారతవేదంబు ♦ సేర్పెలర్పఁ
గృతిరొనర్చినవైభవో ♦ న్నతులనన్న, యార్యనాట్జనకవిఁ దిక్క ♦ యజ్వఁ గొలుతు

సీ. నిగ్రహానుగ్రహ ♦ నిస్తంద్రమహిమాబ్ధి, రాము వేములవాడ ♦ భీమకవిని
చింతామణీమంత్ర ♦ సిద్ధు నిద్ధగుణాఢ్యు, భావుని శ్రీనాథ ♦ భట్టమౌళి
జగదేకవిఖ్యాతు ♦ శబ్దపారావార, పారీణుఁ బింగళి ♦ సూరనార్యు
జానకీరమణప్ర ♦ సాదలబ్ధకవిత్వ, రాజ్యాభిషిక్తుని ♦ రామభద్రు

గీ. విమలకవితాసముద్రుని ♦ వీరభద్రు, ధవళసత్కీర్తిచంద్రికా ♦ ధాము సోము
మఱియు భాస్కరముఖ్యుల ♦ మహితమతుల, నాంధ్రభాషాకవీంద్రుల ♦ నభినుతింతు.

గీ. ఫణికులాధీశభాషిత ♦ భవ్యభాష్య, ఫక్కికాభావనిర్ణయ ♦ ప్రౌఢమతిని
ధన్యు వాకరపల్లికో ♦ దండరాము, మద్గురుస్వామి నతిశాంతు ♦ మది భజింతు. 15

సీ. రాజశేఖరచరి ♦ త్రము రసోచితముగా, నిర్మించె నేప్రౌఢ ♦ నేర్పు మెఱయ
మహిమఁ దుల్యానదీ ♦ మాహాత్మ్య మేపెద్ద, రచియించె నర్థిగా ♦ రవము గులుక
పటుచమత్కారగుం ♦ భన మొప్ప ద్రౌపదీ, పరిణయం బేజాణ ♦ ప్రాస్తిఁ గూర్చె
ధ్రువచరిత్రము మహా ♦ కవిపుంగవులు మెచ్చఁ గల్పించె నేకవి ♦ కౌశలమున

గీ. నతని నతులితకవితాక ♦ ళాభిషేకు, మత్పితామహు గురుపితా ♦ మహసమాన
మాననీయచర్యాళి ♦ మహితశీలి, లక్ష్మణామాత్యమౌళిఁ ద ♦ లంతు మదిని. 16

క. రవితేజుఁ బార్థివేశ్వర, శివలింగవరప్రసాద ♦ సిద్ధవిరాజ
త్కవితానిధి మజ్జనకుం, గవితామరసార్కుఁ దిమ్మ ♦ కవిని భజింతున్. 17

సీ. మత్పితామహు మేన ♦ మామ వెణ్ణుతుబల్లి, విశ్వనాథకవీంద్రు ♦ విపులయశుని
నతనితపఃఫలం ♦ బనఁగ జన్మించిన, విద్యావిశారదు ♦ వేంకటాద్రి
నతని మేనల్లుని ♦ కృతికర్త వక్కలం, కాన్వయవీరభ ♦ ద్రార్యవర్యుఁ
దత్సహాధ్యాయి నుత్తమశీలు నిందుల, పలిభవానీపతి ♦ ప్రాజ్ఞుఁ బతి

గీ. మఱియుఁ బ్రార్థింతు మఱియు న ♦ మస్కరింతు
భక్తి భజియింతు నెంతయుఁ ♦ బ్రస్తుతింతు
వర్తమానకవీశ్వర ♦ వరులఁ గూడి
మంచితిమ్మకవీంద్రుని ♦ మదిఁ దలంతు. 18

చ. సరసతయుం జమత్కృతియు, ♦ శబ్దపటుత్వము, సౌకుమార్యమున్
సురుచిరపాకమాధురియు, ♦ శోభిలఁ గబ్బముఁ గూర్చ నేర్చు వాఁ
డరయఁ గవీశ్వరుం డనుట ♦ కర్హుఁడు గాక కవిత్వచాతురీ
విరహితదుర్విదగ్ధు లగు ♦ వెంగళులుం గవులే తలంపఁగన్. 19

చ. సుకవిరసోల్లసన్మధుర ♦ సూక్తిచయంబు రసజ్ఞశేముషీ
వికసన మాచరించు నవి ♦ వేసుల కింపు ఘటింపఁజాల దిం
చుకయుఁ మహీజసంతతులు ♦ శోభిలుఁగాక వసంతసంగతిం
గోకిలికీవట్టిమాఱులఁ జి ♦ గుల్లు జనించునె యెంచి చూచినన్. 20

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును భువనప్రసిద్ధపురాతనాధునాతనసుకవిప్రశస్తంబును, గురువందనంబును, కుకవినిందయుం గావించి యేనొక్కప్రబంధంబు రచియింపం దలంచి సకలపురాణప్రసిద్ధపుణ్యకథావిశేషం బెయ్యదియకో యని వితర్కింపుచున్న సమయంబున. 21

సీ. తనమనఃపంకేజ ♦ ముఁగదు వెంటురిసోమ, నాథుండు మదమిళిం ♦ దంబుగాఁగ
తనసముజ్జ్వలసుప్ర ♦ తాపపావకునకుఁ, గంజమిత్రుఁడు స్ఫులిం ♦ గంబు గాఁగ
తనమహాకీర్తిన ♦ ర్తకికి భూవరసభాం, గణములు నృత్యరం ♦ గములు గాఁగ
తనకృపారసశర ♦ త్సమయంబునకు సాధు, జనబృందములు సరో ♦ జములు గాఁగఁ
గీ. బరగుజగనొబ్బగండస ♦ గరకిరీటి, రాయవేశ్యాభుజంగాది ♦ రమ్యబిరుద
శాలి నందూరికామయ ♦ సచివసుతుఁడు, ప్రకటగుణపాళి కీర్తికామ ♦ రాజమౌళి.

వ. మఱియుఁ బార్వతీపరమేశ్వరచరణకమలయుగళభజనానుభావవైభవమార్కండేయుండును, సాధుజనవిధేయుండును, వంగవంగకళింగబంగాళచోళనేపాళపాంచాలప్రముఖదేశాధీశ్వరసభాంతరపరిగణ్యగుణప్రభావుండు, నాజ్ఞాబలసుగ్రీవుండును నిరతాన్నదానసంతర్పితసేతుశీతాచలమధ్యమార్గయాతాయాతజగతీసుపర్వాశీర్వాదవర్ధమానమహైశ్వర్యుండును, కనకాచలతుల్యధైర్యుండును, నలకూబరజలజారిజయంతవసంతలతాంతబాణసమానసుందరాకారుఁడును, మహాగంభీరుండును, తరుతటాకవాపీకూపదేవాలయవిప్రప్రతిష్ఠాదిశాశ్వతధర్మసంస్థాపనాచార్యుండును, పోషితార్యుఁడును, పరిస్ఫుటభ్రూకుటినిటలనేత్రానలప్రతిభటపటుప్రతాపపావకపరిపతత్పరిపంథిశలభుండును, విద్వజ్జనసులభుండును, చింతామణిసంతానతరుసురభిశిబిశీతాంశుజీమూతరాధాసుమారక్షీరోదధిదధీచిఖేచరాదిపూర్వవదాన్యసదాన్యకారకారణమహావితరణుఁడును, శ్రీవత్సమహామునివంశాభరణుఁడును, తరుణారుణకిరణవిసరప్రసరవికసితశరత్సమయసహస్రపత్రసమసమాపాత్రస్తోత్రాగ్రవిశాలలోచనుఁడును, దుర్మతిప్రగర్వమోచనుండును, స్నానసంధ్యాజపహోమదానదేవద్విజపూజనాదినిఖిలనిగమోక్తకర్మానుష్ఠాననిష్ఠాగరిష్ఠుఁడును, దండనాథశ్రేష్ఠుండును, రాజమహేంద్రవరపట్టణదుర్గప్రత్యంతసప్తదశదేశప్రశస్తనిస్తులవిభవాకరకాకినాడశలపాకసీమాస్థలాధిపత్యనిత్యసామ్రాజ్యధురీణుఁడును, కార్యఖడ్గప్రవీణుఁడును, కార్తికమా

శరాకానిశాకాంత సాంద్ర చంద్రికా వికాస విలాస పరిహాస కేళీ ప్రౌఢ గాఢ నిర్మల నిజకీర్తి గంగాతరంగిణీ ప్రవాహుండును, సంతత సముచితోత్సాహుండును, మఘవ గురు లాఘవ సంపాదనామోఘ శ్లాఘనీయ నిరాఘాట చాటు వాక్పాటవ సమాకర్ణన సముదీర్ణ విస్మయ రసాయత్త చిత్త వశంవద సర్వసర్వంసహాధీశ్వరుండును, విద్యావాగీశ్వరుండును, స్వామిద్రోహరగండ జగనొబ్బగండ రాయవేశ్యాభుజంగ సంగరార్జున సాహస విక్రమార్క సాహితీ సార్వభౌమ సూచక గజాంకుశాది మహాబిరుదాంక విరాజమానుండును, రమణీదృక్చకోర సుధాభానుండును, శ్రీవెంటూరిసోమేశ్వర కరుణాకటాక్ష వరప్రసాదలబ్ధ శాశ్వత సంపత్సారస్వత సామ్రాజ్యుండును, రాజాధిరాజపూజ్యుండును, కామయామాత్యకుమారుండును, పుణ్యవిచారుండును, సాధుజన కైరవచంద్రుండు నగు శ్రీనందూరి కామరాజమంత్రీంద్రుండు సమంచితానందంబున నొకనాఁడు విద్వత్కవి పౌరాణిక పురోహిత గాయక విదూషక మంత్రి సామంత సుహృద్బాంధవ జ్ఞాతి భట భృత్య వారాంగనాది వివిధజనపరివృతుండై నిజసభాభవనంబున సింహాసనాసీనుండై సద్వసంతానప్రసంగగోష్ఠీవశంబున. 23

సీ. శోభితాపస్తంబ ♦ సూత్రవాధూలస, గోత్రు సమస్తస ♦ ద్గుణసమేతు
వేనుఁగులచ్చక ♦ వీరదుర్గిని పౌత్రుని, శ్రీమాచిరాజున్ను ♦ సింహమంత్రి
దౌహిత్రు భూవరా ♦ స్థానపూజితుఁడు తి, మ్మనమంత్రికిని పేర ♦ మకుఁ దనూజు
ధన్యు ననంతప్ర ♦ ధానుసోదరు వీర, మంత్రి కగ్రజు రాజ ♦ మాన్యచరితు

గీ. నన్ను మతిమంతు లచ్చయ ♦ నామధేయు, నమరఁ బిలిపించి యుచితాస ♦ నమున నుంచి
కలితసత్కార మొప్పఁగ ♦ గారవించి, పలికె గంభీరభాషణ ♦ ప్రౌఢి మెఱయ. 24

క. హితుఁడవు శంకరపూజా, రతుఁడవు చాటుప్రబంధ ♦ రచనాపటిమో
న్నతుఁడవు సువ్రతుఁడవు శా, శ్వతకీర్తివి నిన్నుఁ బొగడ ♦ వశమే మాకున్. 25

వ. అని కొనియాడి యిట్లనియె. 26

గీ. తరుతటాకసుతద్విజో ♦ ద్వాహదేవ,
భవననిక్షేపసంజ్ఞలఁ ♦ బరగునట్టి
సంతతులు మాకు నిన్ని యేడు ♦ సంభవించెఁ,
గృతియుఁ జెప్పింప నిపుడు పూ ♦ నితిని మదిని. 27

గీ. ఏమిధర్మంబుఁ జేసిన ♦ నేనభీష్ట
దైవతంబగు వెంటూరి ♦ ధాము సోమ
నాయకున కర్పితముగా నొ ♦ నర్తుఁ గానఁ
గృతి ఘటింపు సోమేశ్వరాం ♦ కితముగాఁగ. 28

వ. అదియును శంకరజటాజూటాలంకారంబును, త్రిలోకపావనియు, సకలపురుషార్థ
సంధాయినియు నగుజాహ్నవీమహాదేవిమాహాత్మ్యంబును, వివిధపురాణఫక్కికలు
వక్కాణించుము గావునఁ దత్కథావిశేషసంగ్రథనచమత్కృతిబంధురంబుగాఁ బ్ర
బంధంబు సంఘటింపుము. ఏతత్ప్రబంధసమర్పణంబున నంబుజాసనాదిబృందారక
సందోహసుందరకిరీటకోటిసంఘటితమణికిరణకందళసందీపితచరణారవిందుండును,
సకలప్రపంచసంరక్షణదీక్షాధురంధరకరుణాకటాక్షవీక్షణుండును, సర్వోపనిషదర్థ
ప్రతిపాద్యనిజప్రభావుండును నగుశ్రీవెంటూరిసోమేశ్వరదేవుండు సంతుష్టుండై మన
కు సమస్తశుభంబులుం బ్రసాదించు నని సముచితప్రకారంబున నానతిచ్చు సమ
యంబున శ్రీభద్రిరాజుభీమయామాత్యపుత్రుండు సప్తసంతానస్వతంత్రుండు నగు
మల్లనమంత్రీశ్వరుండు నన్ను విలోకించి. 29

గీ. కార్యకుశలుండు నండూరి ♦ కామమంత్రి, సకలగుణములపెద్ద పో ♦ షకుఁడు మనకు
నితనియాజ్ఞాక్రమంబునఁ ♦ గృతి రచింపు, ప్రకటచాతుర్య లక్ష్మణ ♦ సుకవివర్య. 30

క. దినవహింకులవర్ధనుఁ డ, య్యానమంత్రిసుతుండు సుంద ♦ రాకారుఁడు స
జ్జనుఁడు విరూపాక్షుఁడు మ, ల్లనవలెఁ గృతి సేయుమనుచు ♦ లలిఁ బలుకుటయున్

ఆ.వె. వినుతపిండిప్రోలు ♦ వేంకటరామమం, త్రీశ్వరుండు సుజన ♦ హితుఁడు నన్నుఁ
జూచి నేర్పువెలయ ♦ సోమేశ్వరునిపేరఁ, గృతి రచింపుమయ్య ♦ చతురతిలక. 32

వ. ఇవ్విధంబున బంధువులుం దానుం బ్రార్థించి నన్నుఁ బ్రసన్నునిం గావించి సబ
హుమానంబుగాఁ గర్పూరతాంబూలకనకాంబరరత్నభూషణగోభూహిరణ్యాదిమహా
ర్హవస్తువు లొసంగినం బరిగ్రహించి మత్కృతికన్యకారత్నంబునకుఁ జతుర్దశభువనా
ధీశ్వరుండు శ్రీవెంటూరిసోమేశ్వరుం డధిపతి యయ్యెనని యభినందించి సకలపురా
ణప్రసిద్ధం బగుశ్రీజాహ్నవీమాహాత్మ్యంబు త్రిలింగదేశభాషావిశేషంబునఁ బ్రబం
ధంబు రచియింపంబూని శుభకరంబుగాఁ గృతిముఖంబునం గృతీశ్వరుం డగుశ్రీ
సోమేశ్వరస్వామికిం బ్రియభక్తుం డయిననండూరికామరాజమంత్రీశ్వరునివంశావ
తారక్రమం బభివర్ణించెద. 33

ఉ. మత్సరదూరమానసుఁడు ♦ మాధవమాఘనభారతీకని
తోత్సవకృత్తపోబలస ♦ ముజ్జ్వలతేజుఁడు సర్వభూతస
ద్వత్సలుఁ డాగమోక్తవిధి ♦ ధక్రతుధర్మపరాయణుండు శ్రీ
వత్సుఁ డనంగ బ్రహ్మముని ♦ వర్యుఁడు పొల్చుఁ ద్రిలోకపూజ్యుఁడై. 34

క. ఆఋషినాథునికులమున, ధీరుఁడు సంతానతుహిన ♦ దీధితి ఘనచిం
తారత్నదానవిధి సువి ♦ చారుఁడు నండూరియక్క ♦ శౌరి జనించెన్. 35

ఉ. దిక్కరిదంతకాంతులను ♦ ధిక్కరణం బొనరించు మాటికిన్
వాక్కమలాక్షిఁ గేరు హిమ ♦ వన్నగమావృతభృత్కులేంద్రులన్
జక్కులరాయనిం దెగడు ♦ శోభితనందురివంశకర్తయా
యక్కనమంత్రికుంజరుప ♦ మంజుసుమంజులకీర్తిపుంజముల్. 36

క. శ్రీపదపద్మనతారి, క్ష్మాపాలకుఁ డయినయక్క ♦ మంత్రికి బుధర
క్షాపరుఁడు తిమ్మరాజమ, హాపాత్రుం డవతరించె ♦ హరిసన్నిభుఁడై. 37

సీ. గజరాజనృపదత్త ♦ గజవాజిచామర, ధ్వజభూషణాంబర ♦ వ్రజవిరాజి
డిండీరకుండలి ♦ కుండలాఖండల, తుండిపాండురయశో ♦ మండలుండు
దుష్టభంజనసర్వ ♦ శిష్టరంజనజనా, భీష్టపూరణమహో ♦ త్కృష్టబలుఁడు
రాధాకుమారధా ♦ రాధరేందుక్షీర, పాథోధిదానవి ♦ ద్యాధరుఁడు

గీ. వైరినరనాథమంత్రికో ♦ టీరఘటిత, భూరినవరత్నగణవిభా ♦ పూరదీప
చారునీరాజితాంఘ్రిపం ♦ కేరుహుండు, ధీనవందూరియక్కన ♦ తిమ్మవిభుఁడు. 38

ఉ. విలసితకీర్తియై, భువన ♦ విశ్రుతరాజమహేంద్రసుస్థిర
స్థలపతియై, కృపార్పితమ ♦ దన్వరదోత్కటసేవ్యమానుఁడై
జలధిగభీరుఁడై, సుకవి ♦ సస్యఘనాఘనుఁడై, గుణాఢ్యుఁడై,
నలినిభరూపుఁడై యమరు ♦ నందురితిమ్మయ మంత్రిమాత్రుఁడే. 39

ఉ. చెన్నగ రాయబారులు న ♦ జీరులు వీరులు సాహుకారులున్
మన్నెకుమారులున్ దొరలు ♦ మంత్రులునున్ సమయంబుఁ గాచి సం
పన్నత మీఱ నెవ్వనిస ♦ భానికటంబున నిల్తు రాతఁడు
దన్నయశాలి యెన్నఁదగు ♦ ధన్యుఁడు నందురితిమ్మఁ డెన్నిటన్. 40

గీ. అతనియర్ధాంగలక్ష్మి పే ♦ రమ్మ గనియె, సుతుల నామ్నాయమూర్తుల ♦ సుజనహితుల
ధీనిధులఁ గృష్ణయప్రభు తిమ్మరాజ, మంత్రిమార్కండజగ్గనా ♦ మాత్యమణుల. 41

సీ. ఇందుచందనకుంద ♦ హీరపారదగౌర, కీర్తివిస్తారుఁడు ♦ కృష్ణఘనుఁడు
భాషావధూనాథ ♦ శేషాహిసన్నిభ, ధీవాగ్విలాసుండు ♦ తిమ్మశౌరి
ఖండనోద్దండదో ♦ ర్దండారిఖండన, గాండీవధరుఁడు మా ♦ ర్కండమంత్రి
రాజశేఖరపాద ♦ పూజామహోత్సవ, భ్రాజమానుఁడు జగ్గ ♦ రాజమౌళి.

గీ. కార్యఖడ్గప్రవీణు లౌ ♦ దార్యనిధులు, సకలవిద్యావిశారదు ♦ లసదయహృదయు
లాశ్రితద్విజబంధుజ ♦ నానురక్తు, లిద్ధచరితులు వంశాభి ♦ వృద్ధికరులు. 42

వ. ఇట్లతిపవిత్రచరిత్రులై తిమ్మరాజమహాపాత్రునిపుత్రులు నలుగురు విలసిల్లి రందు.

గీ. సుకృతనిధియైనకృష్ణమం ♦ త్రికిని పేర, మాంబకును నల్గు రుదయించి ♦ రాత్మభవులు
నెమ్మి జగ్గనమంత్రియుఁ ♦ దమ్మిరాజుఁ, దిమ్మరాజును లచ్చయ ♦ ధీమణియును.

వ. అందు. 45

సీ. వీరుఁడై హేమాద్రి ♦ ధీరుఁడై వార్ధిగం, భీరుఁడై మన్మథా ♦ కారుఁ డగుచు
శీలియై కారుణ్య ♦ శాలియై సుప్రభా, హేళియై నృపమంత్రి ♦ మౌళి యగుచు
దాతయై విద్యావి ♦ ధాతయై సజ్జన, త్రాతయై లోకైక ♦ నేత యగుచు
ధన్యుఁడై నరపాల ♦ మాన్యుఁడై, జితశత్రుసైన్యుఁడై బహుధన ♦ ధాన్యుఁడగుచు

గీ. చతురకూపారవలయిత ♦ క్షితితలాద్రి, పతిసభామధ్యసత్కవి ♦ స్తుతనితాంత
వితరణక్షాత్రవైభవో ♦ న్నతుఁడు వెలయుఁ, గృష్ణయప్రభుతిమ్మమం ♦ త్రీశ్వరుఁడు.

గీ. దేవగురుసన్నిభుం డగు ♦ తిమ్మమంత్రి, బాపమాంబను లింగమాం ♦ బను వరించె
నిందిరను భూమిదేవిని ♦ నింపుగులుక, నంబుజనాభుఁ డుద్వాహ ♦ మైనకరణి. 47

చ. ఘనమతితిమ్మమంత్రికి జ ♦ గన్నుతశీలకు బాపమాంబకున్
దనయుఁడు కృష్ణమంత్రి విన ♦ తాసుతవిక్రముఁ డుద్భవించె నా
తని కనవద్యనిశ్చలిత ♦ దానకళాకుశలుండు కామినీ
జననవమీనకేతనుఁడు ♦ జగ్గనమంత్రి జనించె ధన్యుఁడై. 48

క. నందురితిమ్మామాత్యుని, రెండవయిల్లాలు సుంద ♦ రీజనవినుతా
ఖండలలితసౌభాగ్యా, ఖండలసతి లింగమాంబ ♦ కడు విలసిల్లెన్. 49

గీ. క్షితిని నుతికెక్కు మునుకోట ♦ సింగరాజు, కాంత సద్గుణనికురుంబ ♦ గంగమాంబ
యంతకన్నను బొగడొందె నన్నదాన, లీల నందూరితిమ్మయ ♦ లింగమాంబ. 50

శా. ఆతిమ్మప్రభుమౌళికి న్వినుతపు ♦ ణ్యాచార లింగాంబకుం
జేతోజాతసమానమూర్తులు విరిం ♦ చిశ్రీశగౌరీశసం
స్థితాంశప్రభవుల్ జనించిరి సుతుల్ ♦ శ్రీమంతు లత్యంతవి
ఖ్యాతుల్ తిమ్మయమంత్రివీరవిభుబా ♦ పామాత్యచూడామణుల్. ౫1

ఉ. తమ్ములదాయఁ గేరు ; వెలి ♦ దమ్ములతోఁ గలహం బొనర్చుఁ ; గుం
దమ్ముల నిందసేయుఁ ; గుము ♦ దమ్ములతో సరసంబు లాడుఁ ; జెం
దమ్ముల మించు ; శారదక ♦ దమ్ముల మేల్విదళించు ; హంసబృం
దమ్ములసౌరుఁ గాంచి నగుఁ ♦ దమ్మయమంత్రియశోవిలాసముల్. 52

మ. బుధదారిద్ర్యతమోదివాకరుఁడు, సం ♦ పూర్ణేందుబింబాననుం,
డధిపప్రోషవచోవిలాసుఁడు, దురం ♦ తారాతిసామంతతో

యధికుంభోద్భవుఁ, డీశ్వరాంఘ్రికమల ♦ ధ్యానస్థిరాత్ముం, డుదా
త్తధనశ్రీయుఁడు వీరమంత్రివరుఁ డే ♦ తన్మాత్రుఁడే చూడఁగన్. 53

సీ. తనవిరుదంబు లు ♦ ద్ధతమంత్రిమత్తేభ, తతులకు సింహనా ♦ దములు గాఁగఁ
తనవదనంబు కాం ♦ తాదృక్చకోరపం, క్తులకు సుధాంశుమం ♦ డలము గాఁగఁ
తనమానసము శైల ♦ తనయాధిపతికీర, రాజంబునకుఁ బంజ ♦ రంబు గాఁగఁ
తనవినిర్మలకీర్తి ♦ దశదిశాభామినీ, సమితికిఁ బాటీర ♦ చర్చ గాఁగఁ

గీ. తనభుజావిక్రమము వైరి ♦ ధరణినాథ, సైన్యకాదంబినికిఁ బ్రభం ♦ జనము గాఁగఁ
బ్రస్తుతికి నెక్కెఁ దిమ్మయ ♦ ప్రభునిసుతుఁడు, ప్రకటవైభవసురరాజు ♦ బాపిరాజు.

సీ. శ్రీమంతు వెంటూరి ♦ సోమేశ్వరస్వామిఁ, బూజించుబంగారు ♦ పూలచేత
భూసురశ్రేణికి ♦ భోజనం బిడుభక్ష్య, శాల్యన్నఘృతపాయ ♦ సములతోడ
జ్ఞాతిబాంధవభృత్య ♦ జనరక్షణము సేయు, ధనధాన్యబహుపదా ♦ ర్థములతోడఁ
గవిపుంగవులకు స ♦ త్కారంబు సేయు మా, న్యక్షేత్రవర్షాశ ♦ నములచేత

గీ. ధరణి ద్వాత్రింశదాద్యప్రధానవరుల, కరణి జగదేకవిఖ్యాతిఁ ♦ గాంచి మించె
భవ్యనందూరితిమ్మయప్రభునిసుతుఁడు, ప్రకటవైభవసురరాజు ♦ బాపిరాజు. 55

మ. చతురుం డాహవవిక్రమార్కుఁడు కళా ♦ సర్వజ్ఞుఁ డేకాదశీ
వ్రతనిష్ఠావిజితాంబరీషుఁడు పయో ♦ వారాశిగంభీరుఁ డా
శ్రితరక్షాకుశలుండు భూసురవరా ♦ శీర్వాదసంప్రాప్తశా
శ్వతలక్ష్మీవిభవుండు బాపవిభుఁ డం ♦ చత్కీర్తిధుర్యుం డిలన్. 56

సీ. గర్వాంధదుష్టాంధ ♦ కారంబులు దొలంగె, జనచక్రములకు హ ♦ ర్షంబు నిండె
బాంధవాశ్రితమనః ♦ పద్మము ల్వికసించె, నీతిబాధాహిమం ♦ బింకి చనియెఁ
బరమంత్రితారకా ♦ ప్రభ లదృశ్యత నొందె, న్యాయమార్గం బభి ♦ వ్యక్తిఁ జెందె
సత్ప్రతాపప్రకా ♦ శంబు దిక్కులఁ బర్వె, వైరిముఖేందు వై ♦ వర్ణ్య మెసఁగె

గీ. క్రూరసూచకకుముదసం ♦ చార ముడిగె, లోభికైరవబృందంబు ♦ శోభ దరిగె
సూరివన్నుతుఁ డైననం ♦ దూరిబాప, మంత్రిమార్తాండుఁ డుదయించి ♦ మహి వెలుంగ.

శా. వేమారుం గొనియాడి మెచ్చఁగఁ దగున్ ♦ వెంటూరిసోమేశ్వర
స్వామిశ్రీపదభక్తిలబ్ధసుమహా ♦ సామ్రాజ్యధౌరేయు సు
త్రామాచార్యమహాద్భుతప్రదవచః ♦ ప్రావీణ్యు నందూరిబా
పామాత్యోత్తము సార్వవర్యనుత శౌ ♦ ర్యౌదార్యధైర్యాధికున్. 58

వ. ఇవ్విధంబున మహానుభావులై తిమ్మరాజుసుతులు ముగ్వురుఁ బ్రకాశించిరి. 59

సంతతిక్రమంబు విన్నవించెద. 59

ఆ.వె. తిమ్మరాజుసుతులు ♦ ధర్మైకనిరతులు, దేవమంత్రినిభుఁడు ♦ తిమ్మవిభుఁడు
క్షేమశాలి మత్త ♦ నామాత్యుఁడును వీర, మంత్రిమణియు నన స ♦ మస్తు లందు. 60

సీ. సప్తసంతానసం ♦ స్థాపనాచార్యుఁడు, మత్తారిసైనిక ♦ మర్దనుండు
విద్వత్కవీశ్వర ♦ వినుతచారిత్రుండు, షడ్గుణైశ్వర్యప్ర ♦ శస్తకీర్తి
సుదతీమనోహర ♦ సుందరాకారుండు, వేదశాస్త్రార్థప్ర ♦ వీణబుద్ధి
అఘటితఘటనాస ♦ మర్థనోపాయజ్ఞుఁ, డవనీసురార్చనో ♦ త్సవపరుండు

గీ. మంత్రిమాత్రుండె సౌరాష్ట్ర ♦ మాగధాంధ్ర, పాండ్యకర్ణాటచోళనే ♦ పాళముఖ్య
దేశపతినుతవిభవవ ♦ ర్ధిష్ణుమూర్తి, నెమ్మినందూరితిమ్మయ ♦ తిమ్మశౌరి. 61

చ. బలమునఁ గాకినాడశల ♦ పాకమహాస్థలరాజ్యభారని
శ్చలుఁడయి దేవళంబులును ♦ సద్వనముల్ నిరతాన్నసత్రముల్
జలవిలసత్తటాకములు ♦ సత్క్రతుముఖ్యసమస్తకర్మముల్
పొలుపుగ నాచరించెఁ బరి ♦ పూర్ణుఁడు నందురితిమ్మఁ డన్నిటన్. 62

గీ. అతనితమ్ముఁడు మృత్యుంజ ♦ యాహ్వయుండు, కార్యఖడ్గప్రవీణుండు ♦ ధైర్యశాలి
సకలనరపాలకుంజరా ♦ స్థానగణ్య, వితరణార్జవనిర్జిత ♦ విబుధశాఖి. 63

వ. అతనిసోదరుఁడు. 64

చ. జనములు సంస్తుతింప నృప ♦ చంద్రులు ప్రస్తుతిసేయ బాంధవుల్
గొనకొని మోదమంద బుధ ♦ కుంజరు లెంతయు మెచ్చ నాశ్రితుల్
ఘనమగుకల్మిఁ జెంద శుభ ♦ కార్యసమర్థత విస్తరిల్ల నే
ర్పున ధర యేలె సర్వగుణ ♦ పూజ్యుఁడు నందురివీరుఁ డున్నతిన్. 65

వ. ఇది తిమ్మరాజుసంతతిప్రకారంబు. వీరరాజుసంతతిక్రమంబు వివరించెద. 66

ఆ.వె. వీరమంత్రిసుతులు ♦ విఖ్యాతచరితులు, జలజగర్భవిష్ణు ♦ శంభుసములు
దృఢవివేకనిధులు ♦ దేవన్నయును బాప, ఘనుఁడుఁ గామమంత్రి ♦ యనెడివారు. 67

చ. పగతుర నిగ్రహించునెడఁ ♦ బార్థుఁడు దేవనమంత్రి, శేషప
న్నగనిభవాగ్విలాసకల ♦ నాపటిపూర్ణుఁడు బాపశౌరి, ము
జ్జగముల వార్తకెక్కినయ ♦ సాంద్రుఁడు కామఘనుండు, విద్విష
న్నగరజయప్రవీణులు ధ ♦ నంజయతేజులుఁ బోల్చి రెంతయున్. 68

వ. ఇయ్యది వీరరాజుసంతతిక్రమంబు, బాపిరాజుసంతతిప్రకారం బభివర్ణించెద. 69

చ. పటుబలరక్షితక్షితిప ♦ పర్వఁడు నందురిబాపమంత్రి, ధూ
ర్జటి గిరిజ న్వరించుగతి ♦ సాధుచరిత్రను గొండెపూడివేం
కటకవిపుత్రికన్ సమధి ♦ కవ్రతశాలిని సూరమాంబికన్
స్ఫుటధృతిఁ బెండ్లియాడె పర ♦ సుగ్లానియాడఁగ నిండువేడుకన్. 70

శా. గౌరీదేవినిఁ బూజసేయు నెపుడుం ♦ గల్హారదామంబుల
న్నీరేజంబులఁ గేతకీదళముల ♦ న్నీపప్రసూనంబులన్
హారిద్రాక్షతకుంకుమాగరుఫలో ♦ దారోపహారంబులన్
సూరాంబామణి బాపమంత్రిసతి ని ♦ స్తుల్యప్రభావంబునన్. 71

సీ. ప్రతివచ్చు ననవచ్చుఁ ♦ బార్వతీదేవికి, వర్ణితసౌభాగ్య ♦ వైభవమున
జతవచ్చు ననవచ్చు ♦ జంభారికాంతకు, భువనైకవిఖ్యాత ♦ భోగకలన
సరివచ్చు ననవచ్చు ♦ జలరాశికన్యకు, మహనీయవివిధసం ♦ పదలమహిమ
నెనవచ్చు ననవచ్చు ♦ ననసూయ కెంతయుఁ, బరమపాతివ్రత్య ♦ భవ్యగరిమ
గీ. అభినుతింపఁగఁదగు సంత ♦ తాన్నదాన, చాతురీతర్పితాసేతు ♦ శీతకుధర
మధ్యపృథ్వీసుపర్వస ♦ మాజగణ్య, సుగుణనికురుంబ నందూరి ♦ సూరమాంబ. 72

సీ. ఆసూరమాంబకు ♦ శ్రీసతీరమణస, మానుఁడౌ బాపయా ♦ మాత్యమణికి
సోమేశఘనకృపా ♦ సామగ్రిచే సంభ, వించిరి తనయులు ♦ విదితనయులు
పరమాద్భుతోదార ♦ భాషాచమత్కార, పాండితీఫణిరాజు ♦ బాపిరాజు
గర్వాంధపరిపంథి ♦ గంధసింధురఘటా, ఖండనమృగరాజు ♦ కామరాజు
గీ. ధీరతాజితగిరిరాజు ♦ తిమ్మరాజు, రాజపూజ్యుండు సూర్యనా ♦ రాయణుండు
ననఁగ భూలోకసంరక్ష ♦ ణార్థజనిత, పుండరీకాక్షుఘనచతు ♦ ర్భుజములట్ల. 73

సీ. ఏమంత్రియౌదార్య ♦ మిందుబృందారక, భూజమేఘముల క ♦ ద్భుత మొనర్చు
నేమంత్రిసౌందర్య ♦ మిక్షుచాపవసంత, దివిజేంద్రతనయుల ♦ ధిక్కరించు
నేమంత్రికీర్తి సు ♦ త్రామసామజవాహ, నీహారగిరులఁ గృ ♦ శీకరించు
నేమంత్రివిక్రమ ♦ సామగ్రి భృగురామ, కార్తికేయాదుల ♦ గణనమాన్చు
గీ. నతఁడు నుతిగాంచుఁ బంచాక్ష ♦ రాభిధాన, శైవమంత్రాధిరాజప్ర ♦ సాదలబ్ధ
శాశ్వతైశ్వర్యగుణశాలి ♦ సచివహేళి, భవ్యనందూరిబాపయ ♦ బాపమంత్రి. 74
వ. తదీయానుజుండు. 75

సీ. భామినీజనములు ♦ పంచబాణుఁ డనంగఁ, గవిసార్వభౌములు ♦ కర్ణుఁ డనఁగ
ధీరులు తుహినధా ♦ త్రీధరేంద్రుం డన, విక్రమవంతులు ♦ విజయుఁ డనఁగ

బండితశ్రేష్ఠులు ♦ పద్మసంభవుఁ డన, సత్యవంతులు హరి ♦ శ్చంద్రుఁ డనఁగ
ధర్మమర్మజ్ఞులు ♦ ధర్మపుత్రుఁ డనంగ, మంత్రిజ్ఞు లెల్ల సుమంత్రుఁ ♦ డనఁగ

గీ. సకలసద్గుణమాణిక్య ♦ జలధి యగుచుఁ, బ్రస్తుతికి నెక్కె ధారుణీ ♦ పతులసభల
మహితనండూరిబాపయా ♦ మాత్యసుతుఁడు, కలితవాక్ప్రౌఢిఫణిరాజు ♦ కామరాజు

చ. చెలువుగ బిల్వపత్రతుల ♦ సీవళులతుల జాతిమల్లికో
త్పలసుమలక్షులం గనక ♦ పంకజకేసరపుష్పలక్షులన్
వెలయఁగఁ బూజసేయు దృఢ ♦ నిష్ఠను వెంటురిసోమనాయకు
న్నలినదళాక్షసన్నిభుఁడు ♦ నండూరికామయమంత్రి నిచ్చలున్. 77

చ. ఫలఘృతశాకపంచవిధ ♦ భక్ష్యసుశర్కరపాయసాంచితో
జ్జ్వలకలమాన్నదానమయ ♦ సత్రము లెల్లెడ నిల్పి భక్తి చే
మలయుతుపారభూమిధర ♦ మధ్యచరద్బహుశాస్త్రికద్విజా
వళులను నిచ్చలుం దనుపు ♦ బాపయకామయమంత్రి సత్కృపన్. 78

సీ. వెంటూరిసోమేశ ♦ విభునకుఁ గట్టించె, మంటపప్రాకార ♦ మందిరములు
నిలిపె సౌందర్యచ్ఛాయ ♦ ఫలభూజకలితశ్రీం, గారవనంబు వెం ♦ టూరి చెంత
నమృతవారాశితో ♦ నవఘళింపఁగజాలు, చెరువుఁ ద్రవ్వించె సు ♦ స్థిరముగాఁగ
నవివారితస్థితి ♦ నఖిలమాన్యంబుగ, భూసురులకుఁ బంట ♦ భూము లిచ్చె

గీ. సకలధనముల నార్జించె ♦ సాధువృద్ధ, దీనశరణాగతుల నెల్లఁ ♦ బూనికాచె
మంత్రిమాత్రుండె బాపయ ♦ మంత్రిపుత్రుఁ, డీశ్వరనిభుండు కామమం ♦ త్రీశ్వరుండు

క. ఆజ్ఞాబలసుగ్రీవుఁడు, విజ్ఞానవిశారదుండు ♦ విబుధస్తుత్య
ప్రజ్ఞావాదస్ఫూర్తి స, ర్వజ్ఞుఁడు నండూరికామ ♦ రా జెన్నఁదగున్. 80

సీ. ద్రాక్షారసైక్షవ ♦ గోక్షీరమాధుర్య, మాధుర్యజలపూర ♦ మంజులంబు
చక్రవాకక్రౌంచ ♦ సారసబకముఖ్య, జలపక్షిసంచార ♦ విలసితంబు
కమలనీలోత్పల ♦ కల్హారసౌరభ్య, లోభభ్రమద్భృంగ ♦ శోభితంబు
సముదికోన్నతసేతు ♦ సవిధపాదపమూల, భాగవిశ్రాంతియు ♦ క్పథికజనము

గీ. ప్రస్తుతింపఁగఁదగు మహా ♦ భాగసహిత, మహితనండూరిబాపయ ♦ మంత్రితనయ
కామరాజప్రతిష్ఠితో ♦ ద్దామవిభవ. సారవెంటూరిపార్శ్వకా ♦ సారవనము. 81

సీ. నండూరివంశంబు ♦ నకుఁ గీర్తి ఘనమయ్యె, వెంటూరు కడు సభి ♦ వృద్ధిఁ జెందెఁ
బాఁడిపంటలు గల్గి ♦ ప్రజలకు సిరి హెచ్చె, వెల్లకోటలు చాల ♦ విరివి నొందె

దుర్మంత్రిజనముల ♦ దుండగంబుఁ దొలంగె, సాధుసంఘంబుల ♦ బాధ లణఁగె
క్షితిదేవబాంధవ ♦ శ్రేణి సంపదఁ గాంచె, ధర్మంబు నాల్గుపా ♦ దముల నిలిచె

గీ. భాగ్యనిధియైననందూరి ♦ బాపమంత్రి, ఘనతసొబగుల వైభవం ♦ బున జనించి
రాజపూజితుఁడై కామ ♦ రాజఘనుఁడు, మేలుదలఁకొత్తఁగా రాజ్య ♦ మేలుచుండ.

ఉ. కాంచనశైలమైనఁ గణ ♦ కం దనకబ్బిన నర్థికోటికిన్
బంచియిమున్ రణోర్విఁ బుర ♦ మర్దనుఁడైన నెదిర్చె నేని భం
గించును శాత్రవుం డయినఁ ♦ గేవలమున్ శరణొందెనేని ర
క్షించును కామమంత్రిమణి ♦ కిన్ సరివత్తురె మంత్రులెవ్వరున్. 83

ఉ. హాళి నృపాళిమెచ్చ యవ ♦ నాధిపదత్తహయాధిరూఢుఁడై
లాలితకింకిణీగణక ♦ లధ్వను లింపు ఘటింపఁగాఁ జమూ
పాలసమేతుఁడై రిపువి ♦ భాలుఁడు నందురికామమంత్రివా
హ్యాళివిహారము ల్సలుపు ♦ నర్థిజనుల్ జయపెట్టుచుండఁగన్. 84

చ. చతురతఁ గార్యదక్షత వి ♦ చారసమర్థత ప్రాఁత నేర్పునన్
ధృతిని మనోహరాకృతిని ♦ దేవగురుద్విజభక్తిసంపదన్
మతిబలరూఢి నన్యనృప ♦ మంత్రులు జోడని పల్కవచ్చునే
నతజనరక్షకుం డయిన ♦ నందురిబాపయతిమ్మమంత్రికిన్. 85

క. నందూరిబాపమంత్రిసు, తుండగుతిమ్మన్నకీర్తి ♦ తో సాటిసుమీ
డిండీరాఖండలవే, దండసుధాపుండరీక ♦ ధావళ్యంబుల్. 86

ఉ. దేవనివాసశైలమును ♦ దేవపురోహితు దేవభూజమున్
దేవపథప్రవంతికను ♦ ధీరతఁ బ్రజ్ఞను దారతన్ సమా
ఖ్యావిభవంబునం గెలువఁ ♦ గల్గెదుసద్గుణశాలి శౌర్యవి
ద్యావిజయుండు నందురికు ♦ లాఢ్యుఁడు సూరనమంత్రి శోభిలున్. 87

మ. జనముల్ సన్నుతిసేయ నగ్రిజుల కా ♦ జ్ఞావర్తియై సాధువ
ర్తనుఁడై బంధుసముద్రుఁడై కుశలుఁడై ♦ ధన్యాత్ముఁడై పేరుగాం
చెనిలన్ నందురిబాపమంత్రిసుతుఁడౌ ♦ శ్రీసూర్యనారాయణుం
డనఘుం డాతనిఁ బ్రస్తుతింపఁగలరే ♦ యాశేషుఁడున్ బ్రహ్మయున్. 88

వ. ఏవంవిధవివిధగుణమణిగణాలంకారులై బాపిరాజుకుమారులు నలుగురును వంశకరులై ప్రకాశించి రందుఁ గామరాజేంద్రునకగ్రజుండయిన బాపిరాజుసంతతిక్రమం

బును, ననుజులగుతిమ్మరాజుసూర్యనారాయణులవంశక్రమంబును మున్నుగా వివరించెద. 89

ఆ. వె. భూరిబాహుబలవి ♦ హారియానందూరి, బాపమంత్రిసుతుఁడు ♦ బాపిరాజు
లలితలక్షణముల ♦ లక్ష్మియాలక్ష్మినిఁ, బ్రేమనివ్వటిల్లఁ ♦ బెండ్లియాడె. 90

క. వనితారత్నములక్ష్మికి, మనసిజసన్నిభుఁడు బాప ♦ మంత్రికిఁ గలిగెం
దనయుఁ డనవద్యవిద్యా, వినయాఢ్యుఁడు బ్రహ్మమంత్రి ♦ విఖ్యాతుండై. 91

చ. నరవరపూజ్యుఁడై యమరు ♦ నందురిబాపయతిమ్మమంత్రియుం
బరుఁడు వరించెఁ బార్వతికి ♦ సాటియనందగుపార్వతీసతిన్
గుణమతి తద్వధూవరుల ♦ కుం బ్రభవించె సముంచితప్రభా
తరుణదివాకరుండు గిరి ♦ ధైర్యుఁడు బాపఘనుండు ధన్యుఁడై. 92

క. పొందుగ నందురిబాపయ, నందనుఁడైనట్టిసూర్య ♦ నారాయణుఁ డిం
పొందఁగ ననంతలక్ష్మియు, నందనరిసతిని ముదము ♦ న న్వరియించెన్. 93

చ. పొలుపుగ సూరమంత్రికిని ♦ బుణ్యచరిత్రి యనంతలక్ష్మికిం
గలిగిరి కొండమంత్రియును ♦ కార్యధురీణుఁడు కామమంత్రియున్
బలధృతిరూపశోభితుఁడు ♦ బంగరుమంత్రియు నాఁగ మువ్వుర
త్యలఘుభుజాపరాక్రము ల ♦ హర్పతితేజులు రాజపూజితుల్. 94

సీ. ఏమంత్రిశేఖరు ♦ హృదయంబు సోమేశ, రాజహంసమునకు ♦ రమ్యసరసి
యేధన్యుదానంబు ♦ సాధువిద్వత్కవి, శ్వరశుకశ్రేణికి ♦ సఫలశాఖి
యేధీరుకారుణ్య ♦ వీక్షణంబు భయార్త, జనచకోరములకుఁ ♦ జంద్రకాంతి
యేమహాత్మునికీర్తి ♦ యిద్ధత్రిలోకీవ, ధూరత్నములకుఁ బా ♦ టీరచర్చ

గీ. అతఁడు పొగడొందు దానవి ♦ ద్యావిహారి, భూరివిభవబలాఢ్యు నం ♦ దూరిసూర
మాంబికాబాపమంత్రిప్రి ♦ యాత్మజుండు, కాంతినిర్జితదినరాజు ♦ కామరాజు. 95

మ. వరమౌద్గల్యసగోత్రబంధకవిస ♦ ద్వంశాబ్ధిరాకాసుధా
కరుఁడౌ పెద్దనమంత్రిమౌళికిని వే ♦ డ్కం బార్వతీదేవికిన్
సిరియుం(శం)బున సంభవించినసతిన్ ♦ శ్రీశంకరాంబామణిన్
హరితుల్యుం డగుకామధీమణి వివా ♦ హం బయ్యె మోదంబునన్. 96

సీ. పద్మాక్షునకుఁ బ్రియ ♦ పత్నియై సిరులచేఁ, గరమొప్పు క్షీరాబ్ధి ♦ కన్యమాడ్కి-
భువనాధిపతియైన ♦ శివునకు గృహిణియై, రాణించుచున్నశ ♦ ర్వాణికరణి

సకలప్రపంచక ♦ ల్పకుఁ డైనబ్రహ్మకు, రాణియై విలసిల్లు ♦ వాణిభంగి
పాకశాసనునకు ♦ భార్యయై యెనలేని, కీర్తిఁ గాంచినశచీ ♦ దేవిపోల్కి-

గీ. దానవిధి యైనకామప్ర ♦ ధానమణికిఁ, బత్నియై భవ్యసౌభాగ్య ♦ పటిమనూక్తి
కలితవిభవసమృద్ధులు ♦ కలిగి వెలసె, చారుసద్గుణనికురుంబ ♦ శంకరాంబ. 91

సీ. కొమరొప్పఁ బొగిచిన ♦ కూరగుంపులతోడఁ, బసిమిబంగరుచాయ ♦ పప్పుతోడఁ
వెడవెడలాడున ♦ ప్పడములగమితోడఁ, జవిమించునావప ♦ చ్చళ్లతోడ
ఘుమఘుమామోదంబు ♦ లమరుక్రొన్నేతితో, శర్కరాంచితపాయ ♦ సంబుతోడఁ
బనసరంభాచూత ♦ ఫలబృందములతోడఁ, గమనీయపంచభ ♦ క్ష్యములతోడ

గీ. సకలసంభారములతోడఁ ♦ జంద్రఖండ, పాండురంబైనదధితోడ ♦ బ్రాహ్మణులకు
భోజనం బిడు ద్వాదశీ ♦ పుణ్యవేళ, సద్గుణాలంబ నందూరి ♦ శంకరాంబ. 98

ఉ. నోములు నోచెఁ బండితజ ♦ నుల్గొనియాడఁగఁ జేసె దానముల్
భూమిసుపర్వబంధుజన ♦ పోషణ మొప్పఁగ నాచరించె ను
ద్దామదయాక్షమావినయ ♦ ధర్మగుణంబుల హెచ్చె శంకరాం
బామణి భాగ్యవైభవము ♦ భామల కెవ్వరికైనఁ గల్గునే. 99

మ. శ్రితచింతామణి కామమంత్రిమణికిన్ ♦ శ్రీశంకరాంబామహా
సతికిన్ వెంటురిసోమనాథుకృపచే ♦ జన్మించి రాత్మోద్భవుల్
చతురుం డైనయుమాపతిప్రభుఁడు భా ♦ స్వత్కీర్తి బాపన్నయున్
జితగర్వోద్ధతవైరిభూరమణుఁడౌ ♦ శ్రీకామరాజేంద్రుఁడున్. 100

ఉ. వారిజనాథనందనుఁడు ♦ వారిజగర్భుఁడు వారిజాప్తుఁడున్
వారిజవైరియున్ సవతు ♦ వత్తురె రూపవచోమహోమహో
దారతలందు నందురిత ♦ లాఢ్యునకున్ హృదయాబ్జసక్తగౌ
రీరమణాంఘ్రిపద్మునకు ♦ శ్రీమదుమాపతిమంత్రిమౌళికిన్. 101

సీ. సర్వంసహాధీశ ♦ సంసన్నిరాఘాట, చాటువాగ్వైఖరీ ♦ పాటవుండు
మానోన్నతారిధా ♦ త్రీనాథఘనసైన్య, కాననోద్దీప్తవై ♦ శ్వానరుండు
స్తవనీయహరిదంత ♦ దంతిదంతనితాంత, కాంతిసంతానసం ♦ కాశకీర్తి
ఏణాంకగీర్వాణ ♦ మాణిక్యకల్పక, క్షోణీజసదృశవి ♦ శ్రాణనుండు

గీ. సతతమృష్టాన్నతర్పిత ♦ క్షితిసుపర్వ, తతికృతాశీర్వచోబలా ♦ ర్జితవిరాజి
యతులవిభవుండు క్షితినిబ్ర ♦ స్తుతికి నెక్కె, మహితనందూరియుమ్మన్న ♦ మంత్రిమౌళి

సీ. తామసస్ఫూర్తిచేఁ ♦ దనరునుగ్రుఁ డతండు, సత్యస్ఫూర్తి వహించు ♦ శాంతుఁడితఁడు
పుణ్యజనావాస ♦ పురమర్దనుఁ డతండు, సజ్జనస్థానర ♦ క్షకుఁ డితండు
విబుధవిప్రియాధ్వర ♦ విఘ్నకర్త యతండు, యజ్ఞానుకూలప్ర ♦ యత్నుఁడితఁడు
రాజమౌళియనంగఁ ♦ బ్రకటుఁడయ్యె నతండు, బహురాజమౌళిసం ♦ భావ్యుఁడితఁడు
గీ. చర్చసేయ నుమాపతి ♦ స్వామికన్న, నితఁడు గుణవంతుఁడని బుధు ♦ లెన్నఁ బ్రబలె
భూరిదానఘనుఁడు నం ♦ దూరికామ, మంత్రికినయుఁ డుమాపతి ♦ మంత్రిమౌళి.

చ. కరుణయు వాక్ప్రమత్ప్రతియు ♦ గాఢవివేకనిరూఢి పార్థివే
శ్వరశివలింగపూజనధృ ♦ తస్థితనిష్ఠయు దానశీలమున్
గురుపదభక్తియుం గలిగి ♦ కుంభినిపైఁ బొగడొందెనా ధరా
మరసురశాఖి నందురియు ♦ మాపతి కేవలమంత్రిమాత్రుఁడే. 104

సీ. కామితార్థము లిచ్చుఁ ♦ గాని మందారంబు, చర్చఁజేసినశౌర్య ♦ శాలిగాదు
పరశురామునకుఁ ♦ జొప్పడుఁ గాని శౌర్యంబు, వర్ణింపఁ జక్రిని ♦ వాఁడుగాఁడు
తగ జయంతుండుసుం ♦ దరమూర్తి యగుఁగాని, వలనొప్పనాతఁడు ♦ శక్తుగాఁడు
వక్తృత్వమున ఫణి ♦ స్వామి వర్తిలుఁగాని, తిలకింప నతఁడు సా ♦ త్త్వికుఁడుగాఁడు
గీ. దానమును శౌర్యమునుజక్రి ♦ దనమునూక్తి, పటిమయును సత్వమునుగల్గి ♦ బరగెనార
మేరునగధీరుఁడైననం ♦ దూరికామ, రాజతనయుండు శ్రీబాపి ♦ రాజఘనుఁడు.

ఉ. చందనశాఖిసన్నిధిఁ బొ ♦ సంగుమహీరుహము ల్సుగంధముం
జెందువిధంబునం దనదు ♦ చెంతఁ జరించునరు ల్గుణాఢ్యులై
యందమునొంద విశ్వజగ ♦ దద్భుతవిక్రమలీల రాజిలె
న్నందగె మంత్రిరత్నమన ♦ నందురికామయబాపిరాజిలన్. 106

ఉ. గానకళావిశారదుఁడు ♦ కావ్యరసజ్ఞుఁడు సత్యభాషణుం
డానతవైరిరక్షకుఁడ ♦ వార్పతితేజుఁడు బాంధవాశ్రితో
ద్యానవసంతుఁ డూర్జితన ♦ యస్థిరకీర్తి ధరాతలేంద్రస
న్మానవిధానభూషితుఁడు ♦ నందురిబాపఘనుండు శోభిలున్. 107

చ. తగవులుదిద్దునాటి గణి ♦ తంబులయందు నిరూఢి వ్రాఁతయం
దుఁగలుగుప్రజ్ఞ భూవరుల ♦ తో సరసోక్తిఘటించుప్రౌఢియుం
బగతుల గెల్చునేర్పును ప ♦ మంచితసైజగుణంబు లెన్నఁగా
నగపతిధీరుఁడై యనురు ♦ నందురికామయబాపమంత్రికిన్. 108

గీ. అతనితమ్ముఁడు దానవి ♦ ద్యాఘనుఁడు, కార్యఖడ్గప్రవీణుండు ♦ కామమంత్రి
యతనికీర్తి నటించురా ♦ జాధిరాజ, ఘనసభాంగణనాట్యరం ♦ గములయందు. 109

సీ. శ్రీరామచంద్రుని ♦ చే రఘువంశంబు, భువనప్రసిద్ధమై ♦ పరఁగుభంగి
భరతాన్వయము జగ ♦ త్పావనం బగుధర్మ, తనయుని కీర్తిఁ ♦ దాల్చుభంగి
పరశురామునిచేత ♦ భార్గవకులమెల్ల, విదితమై భువనమ ♦ వెలయుభంగి
పరికింపఁ గశ్యప ♦ బ్రహ్మసంతానంబు, దినమణిచేత వ ♦ ర్ధిల్లుభంగి

గీ. తనమహోదయమున నితాం ♦ తప్రసిద్ధిఁ, గాంచి నందూరివంశంబు ♦ ఘనతఁ బూన
విజయధర్మపరాక్రము ♦ విపులయశులు, గలిగి వర్ధిల్లుఁ గామయ ♦ కామరాజు. 110

సీ. ఉరగభూషణునకు ♦ ధరియించువానికి, నవరత్నమయభూష ♦ ణములు దొరికె
కరిచర్మవసనంబు ♦ కటిఁ దాల్చువానికి, పట్టాంబరంబులు ♦ కట్టనమరె
విమలభస్మోద్ధూళి ♦ తను సేయువానికిఁ, జారుచందనపంక ♦ చర్చ గలిగె
పాసిన భిక్షాన్నంబు ♦ భుజియించువానికి, నందితషడ్రసా ♦ న్నంబు లబ్బె

గీ. నిర్వహంబున సోమనా ♦ థేశ్వరునకు, సిరియు భోగంబు గలుగంగ ♦ జేసె భక్తిఁ
గవిజనాభీష్టసంతత ♦ కనకవృష్టి, ఘనుఁడు నందూరి కామయ ♦ కామరాజు. 111

సీ. మత్తారిభూనాథ ♦ మంత్రిమంత్రకభంజ, నాతిప్రగల్భత్వ ♦ గాధిరాజు
విద్వత్కవిశ్రేష్ఠ ♦ వినుతవివేకతా, గుంభితానందసంతోషబుద్ధి ♦ భుజగరాజు
పరిజనానందసం ♦ పత్కరోత్కర్షతా, స్వీయభోగవిశేష ♦ విబుధరాజు
వాక్యార్థచతురత ♦ విద్యార్థినిర్వాహ, బోధాతిశయమున ♦ భోజరాజు

గీ. కోరివినుతింపఁ దగుశౌర్య ♦ కుసరరాజు, దక్షిణసామ్రాజ్యనిర్జిత ♦ రాజరాజు
చారుగాంభీర్యపాటవ ♦ జలధిరాజు, కాంతిదినరాజు నందూరి ♦ కామరాజు 112

సీ. కల్పకద్రుమదానంబు ♦ గణనసేయఁగ నేల, వసుధకు వచ్చి యె ♦ వ్వారి కిచ్చె
మేఘుని బలుమారు ♦ మెచ్చి పల్కఁగ నేల, కనకంబు వర్షింపఁ ♦ గలఁడె యెవఁడు
చింతామణి నుతించి ♦ చెప్ప నేటికి దాని, సామర్థ్య మక్షిగో ♦ చరము గాదు
కర్ణుని భూషింపఁ ♦ గా నేమిపని పూర్వ, కాలవృత్తం బది ♦ కలదొ లేదొ

గీ. అని పురాతనదాతల ♦ నవతఁ దెగడి, తనమహోన్నతగుణగణంబు ♦ తత్సమఖిల
యాచకులు గొనియాడ వి ♦ ఖ్యాతకీర్తిఁ, గాంచె నందూరికామయ ♦ కామరాజు.

మ. ఒకమారుం డొకపార్థుఁ డొకగ్రాయినజుం ♦ డూహింపఁగా సాటియే
మకరాంకుల్ పదివేలు లక్ష విజయుల్ ♦ మార్తాండజుల్ కోటియుం

బ్రోకటింపన్ జలఁగాక రూపమున శౌ ♦ ర్యస్ఫూర్తి దానంబునన్
సుకృతోద్భావికిఁ గామమంత్రిమణికిన్ ♦ శుంభద్గుణాంభోధికిన్. 114

చ. దివిజుల కిచ్చునట్లు జగ ♦ తీజనవాంఛలు పూర్తిఁజేయ భూ
భువనమునందు నంద మగఁ ♦ బూరుషమూర్తి ధరించియున్న యా
దివిజమహీరుహంబు నగ ♦ ధీరుఁడు నందురికామమంత్రిస
త్కృవులు నుతింప నర్థిజన ♦ కామిత మిచ్చుట సాక్షి దీనికిన్. 115

సీ. కృపను జేపట్టెనా ♦ యెటువంటిబీదను, వదలక నృపునంత ♦ వానిఁజేయుఁ
విద్యావిశేషంబు ♦ విని మది మెచ్చెనా, వాంఛాధికముగ ద్ర ♦ వ్యం బొసంగు
క్షమచేసి కాచెనా ♦ శరణాగతులనేర, ములు సహస్రంబైనఁ ♦ దలఁపఁడాత్మ
కోపించెనా మేరు ♦ సుధరచాపునినైనఁ, దృణముగాఁ జూచి మ ♦ ర్దించి విడుచు

గీ. మంత్రిమాత్రుండె యసమాన ♦ మాననీయ, హారిమణిమయపూర్ణగ ♦ ర్భాకరుండు
భవ్యనందూరికామయ ♦ ప్రభుసుతుండు, కామినీజనరతిరాజు ♦ కామరాజు. 116

ఉ. వాజిహసేనుచేత ♦ కనకాంబరభూషణతారహారస
ద్వాజిసుఖాసనాదిసము ♦ దంచితసత్కృతిఁ గాంచె విద్విష
ద్రాజుల గెల్చె భూప్రజల ♦ రంజిలఁజేసి గుణాభిరాముఁడై
యాజికకీర్తి కామసచి ♦ వాగ్రణి కేవలమంత్రిమాత్రుఁడే. 117

ఉ. భాసురకాకినాడశల ♦ పాకమహాస్థలరాజ్యభర్తతో
భూసురబాంధవార్థిజన ♦ పోషణవిశ్రుతచారుకీర్తితో
వాసరనాథతుల్యరుచి ♦ వైభవుతోడఁ బ్రధాను లిద్దఱే
వాసవమంత్రితోడఁ ♦ బ్రతివత్తురె నందురికామమంత్రితోన్. 118

ఉ. స్నానము సంధ్యయున్ జపము ♦ సజ్జనగోష్ఠి పురాణనిష్ఠయున్
దానము దేవతార్చనము ♦ తత్త్వవిచారము పార్వతీశ్వర
ధ్యానమహోత్సవంబు సము ♦ దంచితహోమము విప్రపూజయున్
మానక చేయు నిత్యమును ♦ నందురికామయమంత్రి ధన్యతన్. 119

సీ. బహుదేశలిపులును ♦ భాషావిశేషంబు, లేమంత్రి నేర్చు ను ♦ ద్దామగతుల
నఘటితఘటనాన ♦ మర్థుఁడై యేమంత్రి, మంత్రాంగరూఢిచే ♦ మహిమ నెరపు
వారూఢి నేమంత్రి ♦ పేరు విన్నంతనే, తల్లడింతురు వైరి ♦ ధరణిపతులు
దొరలెవ్వ రేమంత్రి ♦ తోడ నాలోచన, సేయు కేకార్యంబు ♦ సేయఁజాల

గీ. రతఁడు పొగడొందె నేతుళి ♦ తాద్రిమధ్య, ధారుణీశ్వరశేఖరా ♦ స్థానసుకవి
గద్యపద్యైకవినుతాన ♦ వద్యహృద్య, కలితగుణహారి నందూరి ♦ కామశౌరి. 120

ఉ. కారుణికాగ్రగణ్యుఁ డగు ♦ కామయమంత్రియశోవికాస సం
భోరుహగర్భసాక్షికి న ♦ భోనదివారికి శూలధారికిన్
వారణవైరికిం ద్రిదశ ♦ నాథుకటారికి సారసారికిన్
సీరికి మేలుబంతి యగు ♦ నిర్మలతాగుణవైభవంబునన్. 121

చ. సముధికసోంపరాయపురి ♦ సన్నిధి శోభిలు తుల్యభాగతీ
రమున సమగ్రబిల్వరుచి ♦ రస్థలిఁ బాయక యున్న ముక్తిలిం
గమునకు మందిరంబు మణి ♦ కర్ణికతోఁ బ్రతివచ్చు బావియుం
నరిమణ రచించె నిత్యముగ ♦ నందురికామయమంత్రి భక్తితోన్. 122

శా. శ్రీమంతంబయిరొప్పు పెన్గుమటిలో ♦ సీతేశ్వరస్వామికిన్
ధామం బూర్జితయుక్తిచే నిలిపి ప్ర ♦ త్యబ్దంబుఁ గళ్యాణము
ద్దామప్రక్రియ నాచరించు శుభ మొం ♦ దన్ సేవఁ గావించు సు
ప్రేమ న్నందురికామమంత్రి పటుకీ ♦ ర్తిస్ఫూర్తి వాటిల్లఁగాన్. 123

సీ. చోళ్లంగిపురమున ♦ సోమేశ్వరుని మ్రోలఁ, జెఱువుఁ ద్రవ్వించె సు ♦ స్థిరముగాఁగ
కొమరపాలెము చెంతఁ ♦ గొమరైనశృంగార, వనము నిర్మించె దే ♦ వతలు మెచ్చ
గురుజానపల్లిలోఁ ♦ గరపలోఁ ఘనమర్తి, లోనఁ గావించె ను ♦ ద్యానతతులు
తమతండ్రి చేసిన ♦ తటతటాకాదిధ, ర్మము దృఢంబుగఁ జేసి ♦ మట్టుపరచె

గీ. మఱియు నర్హస్థలంబుల ♦ మధురనీర, పూర్ణబహువాపికాకూప ♦ ములు రచించె
సకలభువనాభినుతకీర్తి ♦ సుకృతగరిమఁ, గాంచె నందూరికామయ ♦ కామరాజు.

మహాస్రగ్ధర. కరవీరాంభోజపున్నా ♦ గములఁ గుముదసౌ ♦ గంధికశ్రేణులం
సరమల్లీమాలతీకాం ♦ చనముల లలిత ♦ స్వచ్ఛబిల్వచ్ఛదాళిన్
వరదున్ వెంటూరిసోమే ♦ శ్వరుని ద్రిభువన ♦ స్వామినిం బూజసేయుం
గరమర్థిం గామరాజా ♦ గ్రణి శుభమతిన్ ♦ గాఢనిస్తంద్రభక్తిన్.

సీ. అకళంకుఁడై నిర ♦ స్తాఖిలదోషుఁడై, సన్నుతిఁ గనుమంత్రి ♦ చంద్రుఁడితఁడు
కఠినభావప్రసం ♦ గతిలేక తులలేని, మహిమఁ బూనినమంత్రి ♦ మణియితండు
తగ నపరిమితత ♦ నెగడి నిరంకుశ, సత్త్వుఁడౌ మంత్రిపుం ♦ జరుఁ డితండు
కువలయామోదంబుఁ ♦ గూర్చుచుఁ దాపంబు, ఖండించు మంత్రిమా ♦ ర్తాండుఁడితఁడు

గీ. సకలశోభావగుణగణ ♦ స్థైర్యశాలి, యనిశపద్మానుకూలవి ♦ హారి కనక
వృష్టికరుఁ డితఁడని బుధు ♦ లెన్న నమరు, ఘనుఁడు నందూరికామయ ♦ కామరాజు.

బహుర నుతింపఁదగ్గ కొని ♦ యాడఁదగున్ బహుభంగులన్ బుధో
త్తమనుతచారుసద్గుణక ♦ దంబను నందురిరాజమాంబికన్. 143

చ. పతిహితమాచరించు గురు ♦ బంధుబుధద్విజపూజ సల్పు స
ద్వ్రతమును లోనఁజుప్పఁ బుణ్యకని ♦ తాజనసత్కృతిఁ జేయు సంతతం
బతికుల నెల్లఁ బొగడు విన ♦ యంబున నందురిరాజమాంబ పా
ర్వతి కెనవచ్చు విద్వదభి ♦ వర్ణితసద్గుణవైభవంబునన్. 144

శా. ఆ రాజమ్మకుఁ గామమంత్రికిని దీ ♦ ర్ఘాయుష్యవిద్యావచ
శ్శ్రీరాజీవభవుల్ జనించిరి సుతుల్ ♦ శ్రీమంతు లత్యూర్జితా
కారశ్రీజితమన్మథుల్ (గుణనిధుల్) ♦ కారుణ్యపూర్ణు ల్మహా
ధీయుల్ జోగనమంత్రికామసచివుల్ ♦ తేజంబు సంధిల్లఁగన్. 145

వ. అందు. 146

చ. నలనలకూబరత్రిదశనాథతనూజమనోజచంద్రులన్
గెలువఁగఁజాలురూపమునఁ ♦ గీర్తిసమున్నతిచేత భారతీ
హాలధరనీలకంఠరజ ♦ తాద్రిహిమాద్రుల గెల్వఁజాలు (న
న్నలినజు గెల్వఁజాలు) ధళి ♦ నందురిజోగన మాటనేర్పునన్. 147

చ. జలజదళంబులన్ గెలువఁ ♦ జాలెడుకన్నులు నిండుచందురుం
గలకలనవ్వు మోమును ♦ చొకారపురొమ్మును దీర్ఘబాహువుల్
గలిగినభాగ్యహేతుశుభ ♦ లక్షణలక్షితు నెన్నఁగాఁదగు
న్నలినముఖీమనోభవుని ♦ నందురిజోగనమంత్రిశేఖరున్. 148

క. ఆజోగిరాజుతమ్ముఁడు, తేజోనిధి భాగ్యశాలి ♦ ధీరోత్తముఁ డం
భోజదళాక్షుఁడు విద్యా, భోజుఁడు కామేశమంత్రి ♦ పుంగవుఁ డలరున్. 149

గీ. వరచిరాయుష్యమున ధాత ♦ వంటివాఁడు, వర్ణితసుభాగ్యమునఁ దాత ♦ వంటివాఁడు
భూమి వర్ధిల్లునందూరి ♦ కామమంత్రి, కామమంత్రికిసుతుఁడైన ♦ కామమంత్రి. 150

శా. క్షేమస్థైర్యసుపుత్రపౌత్రయుతులై ♦ శ్రీసోమనాథేశ్వర
స్వామిప్రేమకటాక్షలబ్ధసకలై ♦ శ్వర్యాయురారోగ్యులై
శ్రీమన్నందురికామమంత్రితనయుల్ ♦ శ్రీజోగికామేశ్వరుల్
ధీమంతుల్ చిరకీర్తిగల్గి యభివృ ♦ ద్ధింగాంతు రాకల్పమున్. 151

క. ఈవిధమువవిజవంశము, భూవిదితం బగుచు వృద్ధిఁ ♦ బొందుచునుండన్
శ్రీవత్సమునివరాన్వయు, పావనుఁ డగుకామరాజు ♦ ప్రస్తుతిఁగాంచున్. 152

సీ. చెరువులునూతులు ♦ శృంగారవనములు, శివమందిరములు ని ♦ క్షేపతతులు
♦ భూదేవబాంధవ ♦ పోషణంబును దీన, (జనతా)ర్థివృద్ధిం ♦ క్షణము సాంబ
శివవిష్ణుసత్కథా ♦ శ్రవణంబు నిరతాన్న, దానకన్యామహా ♦ దానములును
బ్రహ్మప్రతిష్ఠలుఁ ♦ బానీయశాలలు, జపహోమదేవతా ♦ ర్చనము లాది
గీ. గాఁగవిలసిల్లుధర్మము లక్షణఁకతోడ, నాదరింపుచుఁ బుత్రపౌ ♦ త్రాభివృద్ధి
జయచిరాయువ్యశాశ్వతై ♦ శ్వర్యమహిమ, గలిగి వర్ధిల్లు నందూరి ♦ కామమంత్రి.
వ. ఈదృగ్విధగుణాలంకారుం డైననందూరికామమంత్రీంద్రునకు నభిమతప్రసవపారిజాతం
బును సకలదైవతంబును నగునమ్మహాదేవునకు షష్ఠ్యంతములు. 154
క. శ్రీనాయకమిత్రునకున్: భానుసుధాకరకృశీట ♦ భవనేత్రునకున్
మీనాంకశత్రునకు వా ♦ గ్జానిస్తవనీయపుణ్య ♦ చారిత్రునకున్. 155
క. అక్షయతూణీరునకుం, జక్షుశ్రుతిహారునకు ని ♦ శాపతిరేఖా
లక్షితకోటీరునకు వ, లక్షశరీరునకు నిర్మ ♦ లవిహారునకున్. 156
క. కృతకేలరవాణీమయ, చతురతురంగమహిమాంశు ♦ సవిత్పురథాంగ
ద్వితయచతుర్ముఖసారథి, యుతధరణీశతాంగునకు జ ♦ యోత్తుంగునకున్ 157
క. సింధురజలధర? (జాలంధర)వ్యా, ఘ్రాంధకముఖనిఖిలముఖభు ♦ గహితకృతభయో
గ్రాంధతమసభరితజగ, ద్బంధురతపనాయమాన ♦ పటుతేజునకున్. 158
క. గంగాప్రసూనమాలా, సంగతకేశునకు సజల ♦ జలధగపాళీ
భృంగాళీకాళిమజయ, రంగత్కమనీయకంధ ♦ రాదేశునకున్. 159
క, భీమేశనిలయద్రాక్షా, రామపురీవరుణదిగ్వ ♦ రాజితవిభవో
ద్దామశ్రీవెంటురిపుర, ధామునకు స్వభక్తకుముద ♦ తతిసోమునకున్ 160
క. నయపన్నతనందునికా, మయమంత్రీనూజకామ ♦ మంత్రీంద్రమనః
ప్రియునకు మునిదహరకుశే, శయనిలయునకుం గృపార్ద్ర ♦ సద్హృదయునకున్. 161
క. శరదిందుకుందచందన, శరదరసురగరుడరాళ ♦ సంకాశునకున్
గిరితనయాధీశునకున్, సుచిరవెటూరినగర ♦ సోమేశునకున్. 162
వ. సర్వక్షిసమర్పితంబుగా నారచియింపంబూనినజాహ్నవీమాహాత్మ్యం బనుమహాప్రబం
ధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 163
శా. శ్రీవిజ్ఞానరమాగృహంబు శుభని ♦ క్షేపప్రదేశంబు స
త్సాక్షల్యాఖ్యానిధిప్రధానజనము వి ♦ ద్యావాట్యరంగంబుఁ జే

చెయ్యది కోర్కు లెల్ల ఫలి ♦ యింపఁగఁ జేయుఁ ద్రిలోకపావనం
బెయ్యది సర్వసిద్ధికర ♦ మెయ్యది దాని గుఱుంగఁ జెప్పవే. 10

ఆ.వె. అని మునీంద్రులెల్ల ♦ నత్యంతభక్తితో, నడుగుటయుఁ బ్రసన్నుఁ ♦ డగుచు బాద
రాయణునిఁ దలంచి ♦ యంజలిఁ జేసి, యమ్మునులతోడ నిట్టు ♦ లనియె నతఁడు. 11

క. మతిమంతులార త్రిజగ, ద్ధితమగుప్రశ్నంబుఁ జేసి ♦ తిరి మీరు భవ
ద్వితతకృపాలబ్ధమహా, మతినై వచియింతు వినుఁడు ♦ మహితశ్రద్ధన్. 12

సీ. గంగ మహాతీర్థ ♦ గణములలోఁ బెద్ద, గంగకు బ్రహ్మయుఁ ♦ గమలనాభుఁ
డంగజవైరియు ♦ నధిదైవతంబులు, గంగ మహాపాత ♦ కములు ద్రుంచు
గంగను గనుఁగొన్నఁ ♦ గలుగుఁ గైవల్యంబు, గంగ కోర్కులొసంగు ♦ కల్పవల్లి
ముజ్జగంబుఁ బవిత్ర ♦ ముగఁ జేయునది గంగ, యణిమాదిసిద్ధియు ♦ నౌను గంగ

గీ. గంగ గంగ యనుచుఁ ♦ గడఁగి యెవ్వఁడు వల్కు, యోజనాయుతముల ♦ నుండియైనఁ
బరగ నతఁడు సర్వ ♦ పాపవిముక్తుఁడై, విష్ణుపదముఁ గాంచు ♦ విబుధులార. 13

వ. మీకు నొక్కయితిహాసంబుఁ జెప్పెదఁ దొల్లి దివ్యజ్ఞానదేదీప్యమానుం డగుభీష్ముం
డు శరతల్పగతుండై వివరింప వివిధంబు లగుధర్మంబు లాకర్ణించి పాండవాగ్రజుం
డప్పితామహునిపాదపద్మంబులు శిరంబునోఁకం బ్రణమిల్లి యేదేశంబు లేపర్వతం
బు లేనదులు పుణ్యానుభావసమధికత్వంబు గలయవి యని యడుగుటయు నతం డీ
విషయమునకు నొక్కయితిహాసంబు గలదు దాని నీకు వివరింతు ననియిట్లనియె. 14.

సీ. ఉంఛవృత్తికుఁడైన ♦ యొకవిప్రునింటికి, నతిథియై యొకసిద్ధుఁ ♦ డరుగుదెంచె
నాతిథ్య మొనరించి ♦ యతనితో సల్లాప, మాచరింపుచు నద్ధ ♦ రామరేంద్రుఁ
డడిగె నీవడిగిన ♦ యట్టు లాసిద్ధుఁడా, ధర్మసంవేది యా ♦ తనికిఁ జెప్పె
పుణ్యాత్మ యేదేశ ♦ ములను నెన్నుము గాఁ, బ్రవహించుఁ బుణ్య ♦ తరంగ గంగ

గీ. అట్టిదేశము లాగిరు ♦ లాపదార్థ, ములును బుణ్యతమంబులు ♦ భూరివైభ
వాతిశయభూషితములు సం ♦ యమిజనాభి, మతములవి గాక జాహ్నవీ ♦ మహిమ వినుఁడు

గీ. బ్రహ్మచర్యంబుఁ దపమును ♦ గ్రతువు దాన, కృత్యములును యథావిధి ♦ కృతములయ్యు
జాహ్నవీసేవనంబున ♦ సంభవించు, సుగతి నరులకీఁ జాలవు ♦ సుకృతశాలి. 16

క. తనువులపై నించుక సోఁ, కినజాహ్నవిజలము నరుల ♦ కిల్బిషకోటిం
దునిమి(తుదిని)బలనూ, దనలోకానందమొసఁగు ♦ ధర్మవిచారా. 17

ఆ.వె. మున్నుఁ బాతకంబు ♦ లెన్ని జేసిన వెన్క, గంగఁ దీర్థమాడఁ ♦ గమలహితుఁడు
పొడువ నడఁగుతిమిర ♦ ములగతి నణఁగు దే, వశ్య మొందుఁ బుడమి ♦ వదలి యతఁడు.

క. మనుజునికేకపశకలము, లనువుపడఁగ నెన్ని యేఁడు ♦ లమరనదీవా
రిని నుండు నన్నివేలేం, డ్లనిమిషలోకంబునందు ♦ నతఁడు సుఖించున్. 19

వ. మహాత్మా! సోమంబులేనియజ్ఞంబును జంద్రుండు లేనిరాత్రియు సూర్యుండు లేనిపగలును బుష్పసంపద లేనిభూజంబును వ్యాకరణశుద్ధిలేనిభాషణంబును పాతివ్రత్యంబు లేనివనితయు నతిథి పూజలేనిగృహస్థాశ్రమంబును దానంబులేనిహస్తంబును ధ్వని లేనికావ్యంబును నిస్సంగత్వంబులేనిసన్యాసంబును క్షమలేనితపంబును గులవిద్య లేని పురుషుండును ధర్మంబులేనిరాజ్యంబును విద్వాంసుండు లేనిసభయును మాధుర్యంబులేనిసంగీతంబును వివేకంబులేనిప్రభువును వేగంబులేనిహయంబును లజ్జలేనికులాంగనయు విప్రుండులేనిగ్రామంబును సలిలంబులేనితటాకంబునుంబోలె గంగలేనిదేశంబు హీనత్వంబు నొందు. 20

క. పూనికతో గంగోదక, పానక్రియవోలెవిగత ♦ పాపులఁజేయం
గా నేరవునసలునూ, త్రైనసుఁ జాంద్రాయణంబు ♦ లాగమవేదీ. 21

ఆ.వె. కీలియందుఁబడిన ♦ తూలమట్లగుఁబాత, కములు త్రిపథ ♦ గా(వగా)హనమున
దురితములనుదోలఁగఁ ♦ ద్రోచుటకెన్నిథం, గులనుగంగసాటి ♦ గలదెయొండు. 22

సీ. ఝంఝూసమీరంబు ♦ జలధరంబులఁబోలెఁ, గంఠీరవము మత్త ♦ కరులఁబోలె
పతగవంశస్వామి ♦ పన్నగంబులఁబోలెఁ, గమలమిత్రుండు చీ ♦ కట్లఁబోలె
వజ్రియుధుండు ప ♦ ర్వతసమూహముఁబోలె, ఘనరసాయనము రో ♦ గములఁబోలెఁ
బరమాత్మబోధంబు ♦ ప్రకృతిబంధముఁబోలె, జ్వలనంబు తూలికా ♦ సమితివోలె

గీ. విలసదనురాగమునఁ దన్నుఁ ♦ గొలుచునట్టి
జంతువులరూప?(పాప)ములనెల్ల ♦ సమయఁజేయుఁ
బటుతరాజ్ఞానతరుఖండ ♦ పరశుధార
రంగదుత్తుంగపుణ్యత ♦ రంగ గంగ. 23

గీ. అనఘ వినుశరణములేని ♦ జనులకెల్ల, జహ్నుసుత శరణం బగ్రదు ♦ సకలమునులు
సురల కమృతమువలె నగు ♦ నరుల కవని, యందు భాగీరథీజలం ♦ బనఁగ వినుఁడు. 24

ఉ. మేలుగ మానవుండు తల ♦ మీఁద నొకించుకమైన జాహ్నవీ
వాలుకఁ జల్లుకొన్న నని ♦ వారితభక్తిని గంగమట్టిచే
ఫాలమునందు బొట్టిడినఁ ♦ బాతకముల్ దొలఁగున్ భయంకర
వ్యాళతతుల్ విహంగమకు ♦ లాధిపుఁ జూచి తొలంగుకైవడిన్. 25

సీ. గంగాతరంగిణీ ♦ కథసుసంగతపవ, మానంబు లెవ్వాని ♦ మేను సోఁకు
నతఁడు భంగించు దు ♦ ర్గతిజాతయాతనా, హేతుభూతము లైన ♦ పాతకముల
గంగానదీవిలో ♦ కనమాత్రవాఙ్మనః, కాయసంభవమైన ♦ కలుష మణఁగు
వినిన వేడుకఁజేసి ♦ నను గనుంగొనినఁ జే, నంటిన మునిఁగిన ♦ ననఘచరిత

గీ. తల్లివంకను గలయేడు ♦ తరములందుఁ, దండ్రివంకను గలయేడు ♦ తరములందుఁ
గలుగుపితరులనెల్ల స ♦ ద్గతికిఁ బుచ్చు, సకలసంయమిజనమాన్య ♦ జహ్నుకన్య. 26

గీ. గంగ గంగ యని చె ♦ లంగి కీర్తింపుచు, నొందునీట మాన ♦ వుండు మునుఁగ
నతఁడు పాపముక్తుఁ ♦ డగునని పెద్దలు, పలుక విందు విప్రకులవరేణ్య. 27

చ. అనఘచరిత్ర చూడఁగ స ♦ మర్థత గల్గియు జాహ్నవీనదిం
గనుఁగొనకున్నవాఁడు పశు ♦ కల్పుఁడు సందియ మేమి పంకజా
సనుఁడు పురాంతకుండు బల ♦ శాసనుఁడున్ మొదలైనదేవతల్
గొనకొని జాహ్నవిం గొలువఁ ♦ గోరుదు రాత్మశుభాభిలాషులై. 28

క. పరనిజభవాదిసురలకు, శరణం బగునట్టిగంగ ♦ జనులు గొలువ సు
స్థిరనిశ్రేయససంపద, కరస్థితామలక మగు జ ♦ గద్గీతచరితా. 29

క. విను మనఘా రాజభయం, బును జోరభయంబు మఱియు భూతాదిభయం
బును జనులకు గమనసమయం, బున గంగఁ దలంచిరేనిఁ ♦ బొందవు వారిన్. 30

సీ. సకలదేవతలలో ♦ సంక్రందనుఁడువోలె, గ్రహములలో దివా ♦ కరుఁడువోలె
నచలసంఘములోన ♦ హాటకాద్రియువోలెఁ, దరువులలోఁ గల్ప ♦ తరువువోలె
ఉడుమండలంబున ♦ నోషధీశుఁడువోలెఁ, గరులలో నింద్రుని ♦ గజమువోలె
నాశ్రమంబులలో గృ ♦ హస్థాశ్రమమువోలె, మణులలోఁ గౌస్తుభ ♦ మణియువోలె

గీ. వాహములలోన నుచ్చైశ్శ్ర ♦ వంబువోలె, నగరములలోనఁ గాశికా ♦ నగరివోలె
భువనమునఁ గల్గునదులలో ♦ భూరిమహిమ, గంగ యెక్కుడు వేదోక్త ♦ కర్మనిరత.

మ. అని తానందమయారవిందభవలో ♦ కారోహసోపానమా
ర్గనిహపుణ్యులసత్తరంగ యగుగం ♦ గం గాంచి భక్తిన్ మహో
నమయంచుం బ్రణమిల్లి చేరి ముసల? ♦ స్నానంబుఁ గావించువాఁ
డమరప్రార్థితమోక్షరాజ్యపదవీ ♦ తారూఢుఁ డుర్వీసురా. 32

క. ఒకయెడ గంగాజలకణ, మొకయెడఁ జాంద్రాయణంబు ♦ లొగి నూఱును బో
ల్చి కగాఁ దుల నిడి తూచినఁ, బ్రకటితముగ గంగజలము ♦ బరువై పెంచెన్. 33

గీ. ఒకరుఁ డోపి చేసె నుగ్ర ♦ తపంబు వే, ఱొకరుఁ నరుఁడు గంగ ♦ నోలలాడె
వారతపస్వి చేరె నమరేం ♦ ద్రపురము గం, గాభిషేకకర్త ♦ యమృత మొందె.

గీ. గంగ మనుజులపాలింటి ♦ కల్పవల్లి, సన్నిధిని గన్నపెన్నిధి ♦ జహ్నుకన్య
యమరనది భవరోగది ♦ వ్యౌషధంబు, ముక్తిలలితకు భాగీరథి ♦ మూలదుంప. 35

గీ. రంగుమీఱంగ గంగాత ♦ రంగనికర, జనితనాదంబు వినునట్టి ♦ మనుజుఁ డనఘ
యాలకింపఁడు ప్రాణప్ర ♦ యాణవేళ, నంతకలులాయకంఠఘం ♦ టారవంబు. 36

మ. తమవంశంబునఁ బుట్టినట్టిజను లు ♦ ద్యత్ప్రీతి గంగావగా
హముఁ జేయన్ సమకట్టి గట్టు డిగుచో ♦ నాథన్యులం జూచి మో
దము గల్గెం దమకంచు వారిపితరుల్ ♦ గావింతు రానందనా
ట్యము మేఘుం గనుఁగొన్నబర్హిణసమూ ♦ హంబట్ల లీలాకృతిన్. 37

క. గంగాతటవిటపికోటర, సంగత మగుపక్షితోడ ♦ సముఁడే మదమా
తంగతురంగశతాంగభ, టాంగచమూవిజితవిమతుఁ ♦ డగునరపతియున్. 38

శా. గంగాస్నానముఁ జేసి వచ్చితిమి వే ♦ డ్కల్ మీఱ మేమంచు నీ
భంగి న్మాటికి మాటి కాటతమితో ♦ భాషింపఁగా వారికిన్
గంగాస్నానఫలంబు గల్గు భవదుః ♦ ఖంబుల్ నశించున్ వియ
ద్గంగాస్నానపవిత్రులౌ జనములం ♦ గన్నంత నే మేలగున్. 39

క. సులభము సురపతిలోకము, సులభము శశిలోక మవని ♦ సుర విను గంగో
జ్జ్వలతీరమరణలాభము, సులభము గాదండ్రు ముక్తి ♦ సుఖకర మగుటన్. 40

గీ. జాహ్నవీపుణ్యగర్భసం ♦ జనితమకర, మత్స్యకూర్మాదిజలజంతు ♦ మండలంబు
పొందియును మాతృగర్భప్ర ♦ వేశఖేద, మనుభవింపక చిరసుఖ ♦ మనుభవించు 41

మ. గతజన్మంబులనెట్టిదివ్యతపముల్ ♦ గావించెనో యెట్టియ
ద్భుతపుణ్యం బొనరించెనో సురసరి ♦ త్పుణ్యోర్మికాలోలసం
తతిఖేలన్మదభృంగగానవిలస ♦ చ్ఛ్రీజవరాజీవమం
చితడోలాపటలీవిహారసుఖల ♦ క్ష్మీమత్తహంసావళుల్. 42

శా. గంగాతీరనివాసులన్ యతుల భి ♦ క్షావృత్తులం గాంచి స
ర్వాంగంబుల్ భువిసోఁక ప్రమ్రొక్కి ఫలదు ♦ గ్ధాన్నాదులన్ భిక్ష భ
క్తిం గావించినపుణ్యవంతులకు సి ♦ ద్ధించున్ సుఖంబుల్ పలిం
మం గ్రొత్తల్ తుది విష్ణులోకము లభిం ♦ చున్ మోక్షనిక్షేపమై. 43

క. ఘనపరిమళమిళితాంబుజ, వనంబు సేవించుమధుప ♦ వర్గముచందం
బున విడువక భాగీరథి, ననువర్తింతురు ముముక్షు ♦ లగుమానిజనుల్. 44

గీ. ప్రబలతాపత్రయాగ్నితా ♦ పంబు మాన్ప, నొండుభేషజ మున్నదే ♦ యార్యులారఁ
జారుధావళ్యజితశర ♦ చ్చంద్రకిరణ, నికర మగుజాహ్నవీజలం ♦ బొకటి దక్క. 45

గీ. తల్లి త్రిదివగంగ ♦ ధనము భాగీరథి, విమలవిద్య జాహ్నవి ♦ వీపరింతి
తోడునీడ గగన ♦ ధుని మానవుల కెల్లఁ, దెలియు వినుము ధరణి ♦ దేవతిలక. 46

క. రాజీవంబులుఁ గలువలు, జాజులుఁ దులసీదళములు ♦ సంపెంగవిరులున్
బూజించి జహ్నుకన్యం, బూజించినవారు దివిజ ♦ పూజ్యులు విప్రా. 47

క. గంగాస్నానపరాయణు, లంగనుఁగొని దూరముగఁ దొ ♦ లంగుదు రతిభీ
తిం గాలకింకరులు తమ, కుం గీడు జనించు నంత ♦ కునిచే ననుచున్. 48

గీ. మూడుత్రోవలఁ బరంగ గంగను ♦ జూడఁడేని, అర్థితో జాహ్నవినిఁ దీర్థ ♦ మాడఁడేని
కోరి గంగాజలంబులు ♦ గ్రోలఁడేని, కలుగ నేటికిఁ దల్లుల ♦ కడుపుచేటు. 49

గీ. మూరి నలరుభగీరథు ♦ కీర్తివోలె, మదనరిపుమౌళి మల్లికా ♦ మాలవోలె
సొంపుదీపింప భాతు ని ♦ లింపతటిని, భక్తిఁ జూచిన ప్రజకేమి ♦ బ్రాంతిముక్తి. 50

గీ. శీతలము లయ్యుఁ దమయందుఁ ♦ జేరి మునుఁగు, నరులపాతక మనుకాన ♦ నముదహింప
నతికఠోరానలజ్వాల ♦ లగుచు వెలుఁగు, లలితగంగాతరంగజా ♦ లంబులనఘ. 51

చ. తుటుములు గట్టి మింట విబు ♦ ధు ల్గొనియాడఁగ జాహ్నవీతటిం
దటుకునఁ బ్రాణము ల్విడుచు ♦ ధన్యుఁడు ముక్తిసతిన్ వరింపుచోఁ
బటుగతి మ్రోయువాద్యముల ♦ భంగిఁ జెలంగు నభంగుగాప్లవన
స్ఫుటవిలుఠద్ద్యుసింధుశుభ ♦ సూచకవీచిఘటాసహాస్రముల్. 52

సీ. అనవరతాధ్యాప ♦ కునికన్న నెక్కుడు, జాహ్నవీస్మరణుం ♦ డలుప్రసాదు
భాగీరథీతీర ♦ భాగంబున వసించు, దోమఁ బోలరు ... ♦ ... నిగమంబు
గంగ చెంగట నొక్క ♦ గవ్వ విప్రుని కియ్య, నది మేరుదానమ్ము ♦ నై ఫలించు
తలమీఁద సురనదీ ♦ జలబిందువులు భక్తి, జిలికించుపురుషుండు ♦ శివనిభుండు

గీ. కోటిజన్మార్జితానంత ♦ కోటిదురిత, కూటకుధరవిపాటనా ♦ కుంఠకులిశ
ధారయగుజాహ్నవీదేవి ♦ భూరిమహిమ, నలువకైనను వచియింప ♦ నలవియగునె.

సీ. గంగ నుద్దేశించి ♦ కదలి బత్తివిమీఁదు, రోజనంబులు చను ♦ నుత్తముఁడు
గంగావగాహంబు ♦ కతఁ గల్గుఫలంబు, సమకూరు స్వర్గా ♦ ప్తప్రవీణ

యెప్పుడు గంగకుఁ బోదు ◆ నెప్పుడు గంగను జూతు, నని యెల్లవేళల ◆ ననుతపించు
జనుఁడు సాక్షాజ్జనా ◆ ర్దనుఁడు మర్త్యుఁడు గాఁడు, సందేహ మియ్యెడఁ జెందవలదు

ఆ.వె. సకలపుణ్యతీర్థ ◆ సకలపుణ్యక్షేత్ర, ములఁ ఫలించుఁ బుణ్య ◆ ఫలము దొరకు
వేడ్కనీర జాహ్న ◆ వీశుభనామకీ, ర్తనముఁ జేయునట్టి ◆ ఘనునికైన. 54

ఉ. మానితభక్తి విప్రకుల ◆ మౌళికి నొప్పుగ గంగచెంత గో
దానము లాచరించినవ ◆ దాన్యుఁడు దివ్యవధూసమేతుఁడై
మానుగఁ జంద్రమండలస ◆ మానవిమానము లెక్కి వేల్పులౌ
నౌనని మెచ్చ నేగు దను ◆ జాంతకువీటికి ముక్తిపేటికిన్. 55

గీ. ధాత్రిసురునకు గోచర్మ ◆ మాత్రభూమి, గంగచెంగట దానంబొ ◆ సంగుదాత
యఖిలనిర్జరలోకసౌ ◆ ఖ్యానుభూతిఁ, బడసి తర్వాత నిర్వాణ ◆ పదముఁ గాంచు.

క. కరితురగరథపదాతులు, ధరణీదేవునకు గంగ ◆ దరి నిచ్చినభూ
వరుఁడు రవిబింబశతభా, సురయానము లెక్కి తిరుగు ◆ సురలోకములన్. 57

వ. మఱియుఁ గన్యాసాలగ్రామశివలింగదానంబులు గంగాతీరంబునఁ గావించువారు కృతకృత్యులై యక్షయపుణ్యలోకంబు లనుభవింతురు. రత్నరచితకాంచనభూషణాంబరతిలతండులధాన్యదధిమధుఘృతక్షీరగుడపాయసభక్ష్యఫలకర్పూర సుగంధఛత్త్రపాదుకాశయ్యాసనాదిమహాపదార్థంబులు దానంబుసేయుమహాత్ము లపమృత్యువర్జితులై పుత్రపౌత్రసహితులై చిరకాలంబు సకలభోగంబు లనుభవించి శరీరాంతంబున యథేష్టంబు లగునూర్ధ్వలోకంబుల నధివసింతురు. గంగాతీరంబున నొక్కనాఁ డుపవసించినవానికి ననేకచాంద్రాయణవ్రతఫలంబు సిద్ధించు. జపతపోయాగదానధర్మంబులు మోక్షకారణంబు లగు. జాహ్నవిచెంత నొక్కప్రాణాయామంబుఁ జేసినసుకృతికి దురన్నదుష్ప్రతిగ్రహదోషంబులు నశించు. చిత్తశుద్ధి సంభవించు. 58

గీ. సర్వజ్ఞోత్తమ దేవతా ◆ సార్వభౌముఁ, డైనత్రిపురాంతకస్వామి ◆ యర్థితోడ
పావనోదకమూర్తి యా ◆ దేవి నింగి, నుండి రాఁ దాల్చెఁ దే జటా ◆ మండలమున.

క. చెలువమరఁగ మూడుపథం, బులఁ జని ముల్లోకములకు ◆ భూషణ మగును
జ్వలమూర్తి నీ యాదేవిం, గొలుచునతఁడు ధన్యుఁ డఖిల ◆ గుణరత్ననిధీ. 60

క. కుపితకపిలముని శాప, తపితాంగులఁ గలుషయుతుల ◆ సగరాత్మజులన్
కృపఁ జూచి గంగ సురరా, జపదస్థులఁ జేసెఁ దనదు ◆ జలసేకమునన్. 61

క. కలితగతిన్ విష్ణుపదము, వలనన్ రవిమండలంబు ♦ వలన సువర్ణా
చలమువలన హరునౌదల, వలనన్ హిమగిరికి గంగ ♦ వచ్చెం బెలుచన్. 62

క. మనసున వాక్కునఁ గ్రియచే, ననిశముఁ దన నమ్మి కొలుచు ♦ ననఘాత్ములకుం
బునరావృత్తివివర్జిత, సనాతనస్థానలాభ ♦ సంపద లిచ్చున్. 63

చ. అనఘచరిత్ర యే నెఱుఁగు ♦ నంత వచించితిఁ గాని జాహ్నవీ
ఘనగుణవైభవం బదియ ♦ గణ్య మనంతము మేరురత్నముల్
వననిధివారిబిందువులు ♦ వారక యెన్నఁగవచ్చు జహ్నునం
దనిగుణము ల్గణింపఁగ వి ♦ ధాతకు శేషునికైన శక్యమే. 64

క. అవనిసుర నేను నీకున్, వివరించినయట్టిజాహ్న ♦ వీశుభగుణవై
భవ మనిశంబు వచింపుము, ప్రవిశదగతి నాత్మలోన ♦ భక్తి దలిర్పన్. 65

క. తేజమెలర్పఁగ నటువలె, శ్రీజాహ్నవిఁ గొల్చితేని ♦ సిద్ధుఁడవై వి
భ్రాజితగతి ముజ్జగములఁ, బూజార్హుఁడ వగుచు సుఖముఁ ♦ బొందెదవనఘా. 66

గీ. కడఁగి వేదోక్తనిజధర్మ ♦ కర్మనిరతుఁ, డగుచుఁ దన్నుభజించుమ ♦ హానుభావు
చిత్తపద్మముఁ గృప వాధి ♦ జించి గంగ, యతనిఁ జిరసౌఖ్యుఁ జేయు ధ ♦ రామరేంద్ర

సీ. అని యిట్లు గంగామ ♦ హాత్మ్య మాద్విజునకు, వివరించి యాసిద్ధ ♦ వృషభుఁ డంత
నాకాశగతి నేగ ♦ నయ్యవనీసుర, ప్రవరుండు నియతాంత ♦ రంగుఁ డగుచు
గంగను సేవించి ♦ క్రతుతపోదానాద్య, శేషసాధనములఁ ♦ జెందరాని
గతిఁ గాంచెఁ బాండవా ♦ గ్రజ నీవు నద్దేవి, భజియించి పరమశు ♦ భంబు నొందు

గీ. మని పలికె శాంతనవుఁ డిట్టు ♦ లనియె జాహ్న, వీస్తుతిసమేతమైనయి ♦ వ్విశ్రుతేతి
హాసరత్నంబుఁ జదివిన ♦ నధికభక్తి, వినిన రుజలును దోషంబు ♦ లును దొలంగు. 68

వ. అనిన విని ధర్మనందనుండు మందాకినీనందనునియుపదేశంబుచొప్పున గంగాసంసే
వనం బాచరించి తత్పుణ్యానుభావంబున నిర్మలాంతఃకరణుండై యశ్వమేధాదిమ
హాయజ్ఞంబు లనుష్ఠించి చిరకాలంబు సాగరవేలావలయితధరిత్రీమండలం బేకచ్ఛ
త్రంబుగా నేలి యంతంబున ననంతపుణ్యలోకారోహణంబుఁ జేసె. కావున జా
హ్నవీభజనపరాయణు లగువారికి ధర్మార్థకామమోక్షంబులులభించునది పరమార్థం
బని సూతుం డుపదేశించిన నాకర్ణించి సముచితహర్షోత్కర్షసమున్మీలనకలనాప
మావేశితమనస్కులై శౌనకాదిమునీంద్రులకఁథకునితో నిట్లనిరి. 69

గీ. అఖిలజగదేకపావని ♦ యనఁగఁ బరగు, జాహ్నవీదేవి యెటువలె ♦ సంభవించె
వినుతగుణశీల యెటువలె ♦ విస్తరిల్లెఁ, దెలియఁబలుకుము సాధువ ♦ త్సలుఁడవీవు

వ. అని యడిగినఁ దొల్లి నారదునకు బ్రహ్మదేవుండు వక్కాణించిన తెఱంగు మీకెఱింగించెద వినుండని యిట్లుఁ జెప్పందొడంగె. 71

గీ. కలఁడు నిజబంధుజనమనః ♦ కమలఘనవి, కాసకరణప్రగల్భజా ♦ గ్రస్మహాప్ర
తాపతపనవిలుప్తారి ♦ తారకుండు, తారకుం డనుపేరిటి ♦ దనుజరాజు. 72

వ. అద్దానవుండు పెద్దకాలంబు తపంబుఁజేసి పెంపువడసి గర్వంబునొంది మూఁడులోకంబులకుం గీడుసేయుచు నిరపరాధులగు మునులను రాజులను వధించి దిక్పాలకులయిళ్లు కొల్లవెట్టి బెట్టిదంబుగా విజృంభింప నొంచిన నిర్వహింపఁ దోఁచక వేలుపులు చీకాకుపడి చింతించి యార్తత్రాణపరాయణుండు నారాయణుఁడు దక్క నొక్కరుండు మనలకు శరణ్యుఁడు లేఁడని నిశ్చయించి యక్కరుణాసముద్రునిఁ గనుంగొని విన్నవింతు మని కదలి క్షీరసాగరంబు డాసి. 73

మ. కని యింద్రాదిసుపర్వు లయ్యెడఁ గన ♦ త్కాదంబినీశ్యామశో
భనగాత్రున్, శరదిందుబింబవదనుం, ♦ బద్మాయతాక్షున్, లస
ద్వనమాలాన్వితవక్షు, ఙక్కరికరో ♦ దంచద్భుజున్, దివ్యచం
దనలిప్తాంగు, సుదారభూషణు గృపా ♦ ధారుని రమావల్లభున్. 74

గీ. ఇట్లు నేత్రోత్సవముగ ల ♦ క్ష్మీశుఁ జూచి, భయము విడిచి సుపర్వులు ♦ ప్రమదమొంది
సాగి ప్రణమిల్లి వేవి హ ♦ స్తములు మొగిచి, వినుతులొనరించి తగ విన్న ♦ వించిరిట్లు.

సీ. ఓకృపాసాగర ♦ యో భక్తవత్సల, యో జగన్నాయక ♦ యో శరణ్య
మముఁ బ్రోవఁ బూనవే ♦ మత్స్యావతారమున్, పరిహరింపవె దైత్య ♦ బాధ లెల్ల
నసురలపాలయ్యె ♦ నమరులరాజ్యంబు, జేజేవెలందులు ♦ చెఱలఁ బడిరి
తలముంచిపోయిని ♦ యలజడిఁ దొలఁగించి, వైచి కావకయున్న ♦ వాఁడ వేమి

గీ. యెంచిచూడఁగ మాకుఁ ♦ బ్రాపెవ్వ రింక, దీనులకు వేఱ నీకన్న ♦ దిక్కు గలదె
కడఁగి మాపయి మును నీకుఁ ♦ గల్గు కరుణ, నేఁడు మఱచితె గోవింద ♦ నీరజాక్ష.

క. అని సురలు విన్నవించిన, విని పంకజనాభుఁ డిట్టి ♦ వెత మీకిత్తె
ఱ్ఱనివలనఁ బొడమె నాకు, ద్దనుజాతతింగింపుఁ డనినఁ ♦ దద్దయు వేడ్కన్. 77

గీ. తారకుం డనునొకదుష్ట ♦ దైత్యుఁ డధిక, బలపరాక్రమజనితద ♦ ర్పమునఁ గెరలి
ప్రాణములతోడ నుంచివాఁ ♦ డమరవరుల, వానిఁ జెకటార్చిరక్షింప ♦ వలయు మమ్ము.

క. అయ్యసుర గెలువఁజాలము, కయ్యంబున మేము; వాఁడ ♦ ఖండితబలుఁ డో
యయ్యా! యూషరబీజము, లయ్యెక్ వానియెడ నెట్టి ♦ యత్నములైనన్. 79

క. అని చెప్పిన మాధవుఁ డి, ట్లనియెన్ మీవంటివారి కా రక్కసు మా
ర్కొని నిలువఁ దరమె దురమున, వినిపించెద వాని గెలుచు ♦ వీరుని మీకున్. 80

గీ. పదిదినంబులలోపలి ♦ బాలకుండు, గాని తెగటార్పఁగా నోపఁ ♦ డాని కాటు
నట్టిబాలుఁడ నగుచు నే ♦ నద్దురాత్ముఁ, దొడఁగి రణమున నెదిరించి ♦ తునుమలేను.

క. నావలన నిట్టిబాలకుఁ, డేవెరవుల నైనఁ గల్గఁ ♦ డిత్తఱి మతి వీ,
కావిర్భవించు బాలుర, కావిధిఁ దీర్పంగ నెట్టు ♦ లగుఁ దెలుపంగన్. 82

సీ. అపరమేశవీ ♦ ర్యంబునఁ బొడమిన, బాలుండు తారకు ♦ నోలిఁ గెడప
నోపు జితేంద్రియుం ♦ డూహింప నభవుఁ డా, యనకుఁ బుత్రోత్పత్తి ♦ యగుట యరిది
కావున నిమ్మహా ♦ కార్యంబునకు యోగ్య, మైనయత్నంబు సే ♦ యంగవలయు
నని యుపదేశించి ♦ హరి తిరోహితుఁ డైన, నచ్చోటుఁ బాసి యిం ♦ ద్రాదిసురలు

గీ. చని మునులతోడఁ గూడి మం ♦ తనమొనర్చి, వారు దమరును జనిహిమ ♦ వన్నగేంద్రుఁ
గాంచి భక్తి నతండుగా ♦ వించు నర్ఘ్య, పాద్యసత్కారవిధులకుఁ ♦ బ్రమద మొంది.

ఆ. పర్వతేంద్ర నీకుఁ ♦ బరమకల్యాణకా, రణము మాకు గుఱుత ♦ రప్రమోద
కరము నగు ప్రకృష్ట ♦ కార్యంబుఁ దెలుపవ, చ్చితిమి దాని తెఱఁగుఁ ♦ జిత్తగింపు.

వ. దక్షప్రజాపతిపుత్త్రిక యైనసతీదేవి నాఁ బరగుపరమేశ్వరునితరుణీలలామంబు మున్ను దనతండ్రిచేసినయవమానంబు గారణంబుగాఁ బురస్కరించుకొని నిజశరీరంబు యోగాగ్నికి నాహుతిఁ గావించె నమ్మహేశ్వరి నీకుం బట్టియై వెండిగిట్టునట్టుగాఁ బరగుజగజ్జెట్టిని వరియించి మనకుం బరమానందంబు సేయుం లీలాకల్పితగుప్తప్రపంచయు లజ్జాలక్ష్మీసరస్వతీమేధాశ్రద్ధాసిద్ధివిద్యాకీర్తిక్షమాదయానీతిశాంతిస్వరూపయు నగునమ్మహాదేవిం బుత్త్రిగాఁ బడయుమని దేవతలు మునులును బలికిన హిమవంతుం డంతరంగంబునం దరంగితంబగుహర్షోత్కర్షంబునం బొలిచె. నతనిప్రియపత్ని మేనకాదేవియు నానందం బినుమడింప నాజగన్మాతృకం గూఁతుంగాఁ బడసి మీహితం బాచరించెద నని పలికె. పురందరాదిబృందారకులు యథేచ్ఛం జనిరంత.

క. నిర్భరతరరసలక్ష్మీ, గర్భిత యగుసుకవికవిత ♦ గతి లోకసుఖా
విర్భావకారణముగా, గర్భిణియై మెఱసె మేన ♦ కాసతి మిగులన్. 86

క. అలివేణికిఁ జనుముక్కులు, నలుపెక్కె విలాసవతికి ♦ నవసవలవలీ
దళములగతిఁ బాండురరుచి, నలరెం జెలువమరుచెక్కు ♦ టద్దము లంతన్. 87

ఆ.వె. మందగమన యనెడు ♦ మాట నిక్కముగాఁగ, నడలు జడనుపడియె ♦ నళినముఖికిఁ
గలదు లేదటంచుఁ ♦ బలుకంగ నోర్వని, యట్టి నడుము సతికి ♦ నదనమయ్యె. 88

క. పటునీలకాంతులఁ బరి, స్ఫుటమై నూగారు సాగె ♦ సుదతికి రశనా
కటకాదిభూషణము లు, త్కటభారము లయ్యె హిమన ♦ గప్రేయసికిన్. 89

చ. జగము సృజింపఁగోరె, దను ♦ జప్రతతిం దునుమం దలంచె, దే
వగణము నెల్లఁ బ్రోచుటకు ♦ వాంఛ నొనర్చె, నిజప్రితాళి కిం
పుగ భువనాధిపత్య మిడఁ ♦ బూనె, వధూమణి గర్భసీమసం
పుగ నభివృద్ధిఁ గాంచుతఱి ♦ భూషణుదేవిమహానుభావతన్. 90

క. నిట్టూర్పులు దఱుచయ్యెను, గట్టులదొరకలికికలికి ♦ కన్నులయందున్
రెట్టించె ధవళకాంతులు, పట్టుగఁ గనుఱెప్ప లలస ♦ భావముఁ జెందెన్. 91

వ. ఇట్లాదిశక్తిని గర్భంబునం బూనిన మేనకామహాదేవికి నవమాసంబులు గడచి దశమ
మాసంబునం గొన్నిదినంబులు చనునంత. 92

మ. జనియించెన్ గ్రహపంచకంబు పరమో ♦ చ్చస్థానగంబై త్రయీ
తనుసంపర్కము లేక భాగ్యవిభవో ♦ త్కర్షంబు సూచింప శో
భనలగ్నంబున శైలరాజసతికిన్ ♦ బ్రహ్మాండభాండావళుల్
తనగర్భంబునఁ దాల్చుబాల జగదు ♦ త్సాహంబు సంధిల్లఁగన్. 93

సీ. గంధవాహములు సు ♦ గంధంబు వెదజల్లె, గుభులున దేవదుం ♦ దుభులు మ్రోసె
కుసుమవర్షంబులు ♦ గురిసె మేఘంబులు, దిక్కులు మిక్కిలి ♦ తెలివి నొందె
రంభాదిసురవధూ ♦ రత్నంబు లాడిరి, పాడిరి గంధర్వ ♦ పద్మముఖులు
విమలనిర్ఝరముల ♦ విలసిల్లె నదులెల్ల, నబ్జమిత్రాదిగ్ర ♦ హంబు లలరె
గీ. సురలు నిర్భరసంతోష ♦ భరితులైరి, మానిహృదయంబు లానంద ♦ మయము లయ్యె
సౌఖ్య మొదవెఁ జరాచర ♦ జంతుతతికి, శైలకన్యావతారవా ♦ సరమునందు. 94

వ. ఇట్లు లీలావిగ్రహధారిణి యగుసర్వేశ్వరికిఁ బార్వతి యనియు నుమయనియు నునా
మకరణంబు గావించి యనేకప్రకారంబులం బ్రశంసించి యమందానందకందళిత
హృదయారవిందులై యరవిందాసనాదిబృందారకులు నిజమందిరంబులకుం జని రంత
నయ్యచలబాలయు బాలచంద్రరేఖయుంబోలె దినదినప్రవర్ధమానయై పూర్వజన్మ
భావనావిశేషవశంబున శేషాహిభూషణుం దన డెందంబునం బొందుపఱచి యితరం
బు మఱచి సురుచిరహరచరణారవిందచింతనామృతరసాస్వాదనిష్ఠాగరిష్ఠయై వర్తిం
పుచు. 95

గీ. బంతు లాడుచు సకియల ♦ పాట వినుచు, వేడ్కఁ జూడుచుఁ జెలులకు ♦ విందులిడుచు
నగుచు నుయ్యాల లూఁగుచు ♦ నగతినూజ, పెక్కులీలల నిబ్భంగిఁ ♦ జెలఁగుచుండె.

గీ. చారుతరతనులతికావ ♦ సంతకాల, మంగలావణ్యసింధువ ♦ ల్లాగమంబు
రాగజలధివిధూదయా ♦ రంభవేళ, నగతనూభవనవయౌవ ♦ నంబుఁ జెందె. 96

గీ. హరమనోధైర్యధన మెల్ల ♦ నపహరింపఁ, బ్రబలయత్నంబు గావించు ♦ పంచబాణ
తస్కరునకు సహాయమై ♦ తనరుతిమిర, బృందమనఁ బొల్చెఁ జికురంబు ♦ లిందుముఖికి.

సీ. వనజగర్భనివరం ♦ బున నిష్కళంకుఁడై, పాడమినశశి యనఁ ♦ బొసఁగె మోము
తారుణ్యమనుశాణ ♦ ధారఁ బట్టినమనో, జానితూపు లనఁగ లో ♦ చనములమరె
లావణ్యదుగ్ధాబ్ధి ♦ నావిర్భవించిన, లలితశంఖం బన ♦ గళము వెలసె
పంచశరుండు గా ♦ వించినహరుకంఠ, పాశంబు లనఁ బొల్చె ♦ బాహులతలు

గీ. శివఘనాశ్రయసత్క్రియా ♦ చితములైన, కనకగిరులన వర్తుల ♦ స్తనము లలరె
చాయశృంగారరసపూర్ణ ♦ సరసి యనఁగ, నగతనూజకు విలసిల్లె ♦ నాభిబిలము. 99

క. చారుదిశాకరికరధి, క్కారో(దా)రంబు లగుచుఁ ♦ గదళీకాండా
కారశ్రీచోరములై, భూరిద్యుతి నూరు లమరె ♦ భువనేశ్వరికిన్. 100

క. ముక్కంటిఁ గెలువఁబూనిన, చక్కరవిలుకానితరక ♦ సంబులె పోలెన్
జక్కనిపిక్కలు మెఱసెను, మిక్కిలి జిగి పిక్కటిల్ల ♦ మీనేక్షణకున్. 101

గీ. పద్మములు పార్వతీపాద ♦ పద్మములకు, నోడెఁ గాఁబోలు నటుగాక ♦ యున్న నేల
పూను విస్తీర్ణపత్ర ♦ సంతానసంగ, తాళికులకైతవమ్మున ♦ నపయశంబు. 102

చ. అభినుతనూత్నపల్లవస ♦ హాయము లైనబిసప్రసూనముల్
ప్రభగలపార్వతీచరణ ♦ పద్మయుగంబున కోహటించి చా
లభయమునన్ మహావనము ♦ లం బడి భంగము లందెఁ బంకజ
ప్రభవునకైన దుస్తరవి ♦ పత్కరముల్ (బలవద్విరోధముల్) 103

గీ. కనకతాటంకకంకణ ♦ కటకతార, హారమణిమేఖలాద్యలం ♦ కారములకు
శైలకన్యాంగకములు భూ ♦ షణము లగుచు, లలితలావణ్యసముదా ♦ లక్ష్మిఁ జెలఁగె

గీ. ఇవ్విధంబునఁ దారుణ్య ♦ మెసక మెసఁగ, నవ్వధూమణి యనురక్తి ♦ నివ్వటిల్ల
నిందుశేఖరుఁ డెందంబు ♦ నందు నిలిపి, యుతరకృత్యము మఱచెఁ ద ♦ దేకనిష్ఠ. 105

గీ. అట్టియెడ గట్టురాయని ♦ పట్టిఁ జూచి, వినయవినమితగాత్రులై ♦ విబుధు లెల్ల
నమ్మనీవమ్మహేశ్వరు ♦ నాదిదేవు, విశ్వపతిఁ గూర్చి తపముఁ గా ♦ వింపు మనిరి.

వ. అమ్మాట కమ్మానిని సంతసించి. 107

సీ. శీతమహీధర ♦ శిఖరభాగంబున, నగ్వస్థలంబున ♦ నధివసించి
శివునిపాదములపైఁ ♦ జిత్తంబు నిలిపి, యత్యంతనియమకృ ♦ శాంగి యగుచు

శీతవాతాతప ♦ జాతవ్యథకు భీతి, నొందక యాఁకలి ♦ నుడిలఁగొనక
మునులకునద్భుతం ♦ బుగఁ బార్వతీదేవి, సాధునిష్ఠఁ దపంబు ♦ సలుపుచుండె

ఆ.వె. నట్టియెడ నిలింపు ♦ లందఱు నొకచోటఁ, గూడి సకలలోక ♦ గురుఁడు శివుఁడు
యోగనిష్ఠ విగత ♦ రాగుఁడై యుపు డున్న, వాఁడు వనిత నెట్లు ♦ వాంఛసేయు.

గీ. హరుఁడు పార్వతి నుద్వాహ ♦ మయ్యెనేని, వారికిజనించుసుతుఁడుదు ♦ ర్వారబలుఁడు
సురలభయ మెల్లఁదీరుఁద ♦ త్సుతునివలనఁ, బ్రొద్దువొడిచినఁజీకట్లు ♦ పొలియుఁగాదె

వ. కావున నిఖిలబర్హిర్ముఖసుఖకారణం బగునికార్యంబు నిర్వహింపంజాలినసమర్థుం
డెవ్వండు గల్గునో యని యనిమిషులు విచారించునెడ దేవగురుం డందఱం జూచి
కుసుమశరప్రయోగలాఘవప్రగల్భత్రిలోకవిజయలక్ష్మీనికేతనుం డగుమకరకేతనుండి
ప్పని దీర్ప నేర్పరి యగుఁ జిత్తజుం డెత్తి యిత్తరి మురిముల్కిమొత్తంబులు హ
రించిన నత్తపోధనసత్తమునిచిత్తంబు మెత్తవడి తత్తరపాటు నొంది యమ్మత్తకాశి
నిహత్తుఁ గోరు నిట్లునీలలోహితుం డవ్వరారోహ నుద్వాహం బగు నాభగవంతు
తేజంబున నగరాజతనూజయందు నుదయించినకుమారకుండు తారకాసురునకు మార
కుం డగు నట్లుగావునం గంతునకు ననంతలతాంతవాసనాసంతోషితసకలజనస్వాం
తుం డగువసంతుండు సహచరుండై చనుట మేలని గురుం డుపదేశించిన విని యిది
య కార్యం బని హరునిం దలంచిన. 110

చ. కనుఁగొనరయ్యె నయ్యెడ జ ♦ గంబులు గెల్చినబల్లిదుండు తి
య్యనివిలుఁ గమ్మదూపులును ♦ హస్తయుగంబునఁ బూని మీనకే
తనము చెలంగ రాచిలుక ♦ తత్తడికొందలిరాకుతేరిపై
గొనబుగ నెక్కి నెమ్మిఁ దన ♦ కూర్మిసఖుండు మధుండు తోడుగన్. 111

గీ. ఇత్తెఱంగునఁ దమమ్రోల ♦ నెలమి గదుర, నలరువిల్తుఁడు ప్రాంజలి ♦ యగుచు నిలువ
గారవంబునఁ బూజించి ♦ కార్యసరణి, బూసగ్రుచ్చినచందానఁ ♦ బొసగఁ దెలిపి

గీ. కమ్మపూవుల హరునిచి ♦ త్తమ్ముఁ గరఁగఁ, జేసి పర్వతకన్యను ♦ శివుఁడు పెండ్లి
యాడునట్లు ఘటించి న ♦ మస్తలోక, ములకు మేలొనరింపుము ♦ మోహనాంగ.

క. అని వేఁడిన నుత్సాహము, మనమున ననలెత్తుచుండ ♦ మదనుండు వసం
తుని గూడి పురాంతకుపైఁ, జనియెక్ దావాగ్నిమీఁద ♦ శలభమువోలెన్. 114

చ. అళిభటహుంకృతుల్ శుకస ♦ యస్ఫుటహేష లుదాత్తమత్తకో
కిలగజబృంహితంబులు నొ ♦ గిన్ విరహిప్రళయం బొనర్పఁగా

మలయమరుత్సుధాంశుమధు ♦ మంత్రులఁ గూడి రతీశ్వరుండు రా
చిలుకహయ మాయి నెక్కి నడ ♦ చెందిపురాంతకుమీఁద నుద్ధతిన్. 115

వ. ఇట్లు సపరివారుండై జగదేకవీరుం డగుమారుండు కదలి చనువాఁ డంతర్గతంబున నిట్లు చింతించె. 116

సీ. పరమేశుఁ ద్రిభువన ♦ గురునిఁ బురాంతకు, నిస్సంగు నిర్మలు ♦ నిటలనయను
నేరీతిఁ గెలుతు నే ♦ నెట్లు వశ్యునిజేతు, సమరులకార్య మె ♦ ట్లాచరింతు
కమలపత్రికతాంబు ♦ కణముచందంబున, నల్లఁబు కదుఁ దల్ల ♦ డిల్లఁజొచ్చెఁ
గాలాగ్నిరుద్రుని ♦ క్రోల నిల్చుటయెట్లు, కోఁతివినిఁ దలఁగోకి ♦ కొనఁగనగునె

గీ. సకలజగముల గెలుచునా ♦ సాయకములు, దక్షయాగవిరోధిచి ♦ త్తంబు గాఁడి
వాఁడిమెఱసి కరంగించి ♦ వలపుగొలుపఁ, (జాలఁగలవో కొక్కొ) నాకీర్తి ♦ జగముపొగడ

శా. ఏలా వట్టివిచారముల్ సలుపఁగా ♦ నీశానుపై నెత్తిసన్
వాలాయంబుగఁ బ్రాణసంకట మగున్ ♦ వ్యర్థంబుగా దమ్మహా
కాలున్ డగ్గఱఁబోక మానుట దగుం ♦ గాదన్న ఫాలాంబకా
(ఖీలప్రోజ్జ్వలకీలికాని) చయసం ♦ ప్రక్[illegible]నిం జేయఁడే. 118

క. నను వేల్పు లేల వేఁడిరి, గొనకొని సే[illegible]కియ్య ♦ కొని వచ్చితి ని
ప్పని కిట్లు వచ్చి మదిఁ జెనఁ, గినవెరపున మరలి చనుట ♦ కీర్తికరంబే. 119

ఆ.వె. దేహమైన విడిచి ♦ దివిజులకార్యంబు, నిర్వహింతు ననుచు ♦ నెమ్మితోడ
గడఁగి కదలె చేసి ♦ కన్నులవేలుపు, తపము సేయుకడకు ♦ దర్పకుండు. 120

ఆ.వె. మదనుఁ డెట్లు శివుని ♦ మమత నొందించునో, కార్య మెట్టులగునొ ♦ కాంచవలయు
నంచు సురలు శంక ♦ రాశ్రమం బగుమఁచు, గొండఁ జేరి మింట ♦ నుండి రపుడు.

క. వినుఁ డిది పరమాశ్చర్యము, మునులార, సుపత్వ లబ్ధ ♦ మున నిల్చి హరుం
గనునంతలోనఁ జెనకిన, మనసిజుఁ డారుద్రుకంటి ♦ మంటల నణఁగెన్. 122

వ. ఇట్లు ముక్కంటికంటిమంటలం బడి మిడుతవడువునం బొడివడియున్న వెడవిల్తునిం బొడఁగాంచి భయవిహ్వలులై బలభేదిమొదల[illegible]దివౌకసు లాకసంబున నుండి. 123

గీ. ఓపురాంతక యోరుద్ర ♦ యోమహేశ, [illegible]హాలాహలభంజన ♦ యోశరణ్య
తారకాసురుచేతి బా ♦ ధలకుఁ జిక్కి[illegible]న్నట్టిమముఁ బ్రోవ ♦ వేక్షపాత్ర.

వ. దేవా నీవు ప్రసన్నుండవై పార్వతిం బరిగ్రహించిన నెల్లదేవతలకు నుల్లంబునం జల్లదనము వాటిల్లు నీవీర్యంబున సహార్యకన్యకుం గల్గినకుమారుండు బృందారకమారకుం డగుతారకుం దెగటార్చి సకలలోకంబులకు నానందంబు సంపాదించు నని ఫా

లంబులం గేలుఁదమ్ములు గీలించి వేలుపు లెల్ల బ్రార్థించిన నట్లయగుంగాక యని కరుణించి. 125

సీ. శంకరుం డంతట ♦ సంతోషభరితుఁడై, సప్తర్షిదంద్రుల ♦ సంస్మరించి
రావించి సత్కృతి ♦ గావించి గిరిసార్వ, భౌమునిపాలికిఁ ♦ బంచి తనదు
సంబంధమునకు హ ♦ ర్షంబున నుప్పొంగు, నతనిభాగ్యమునకు ♦ నాత్మ మెచ్చి
పద్మజపద్మాక్షు ♦ బలశాసనాదిదే, వతలకు లేఖలు ♦ వ్రాసి పంపి

గీ. యక్షగంధర్వసిద్ధవి ♦ ద్యాధరులను, దగినపరిగడల రప్పించి ♦ జగములెల్ల
మెచ్చ వైవాహికోత్సవం ♦ బిచ్చగించి యుచితభంగుల మెలఁగుచు ♦ నుండె శివుఁడు

వ. హిమవంతునియోషధిప్రస్థపురంబును రంభోర్వశీమేనకాదిసర్వగీర్వాణగణికాసమారబ్ధలాస్యప్రసంగసంగతంబును, నభంగురోత్సాహసంపన్నకిన్నరగంధర్వకురంగనయనాసంగీతభంగీసముజ్జృంభితంబును, కాహళశంఖభేరీమృదంగవీణావేణుపణవగోముఖాద్యనేకహృద్యవాద్యఘోషసంపూర్ణంబును, గలశభవకణ్వగాధినందనగౌతమగాలవభృగుభరద్వాజమార్కండేయమాండ[illegible]మతంగకణాదిమహామునిగణసంశోభితంబును, మేరుమందరవింధ్యగంధమాదనమలయప[illegible]బంధుజనసంకీర్ణంబును, నరుంధత్యనసూయాసావిత్రీలోపాముద్రాప్రభృతిపుణ్యాంగనాసమాచరితమంగళాచారసమంజసంబును, నభ్రంకషాదభ్రశుభ్రకేతనశతసహస్రసముల్లంఘితతారకాపథంబును, నవనవపరిసాధనక్రియావిశేషభూషితాశేషగోపురప్రాకారప్రాసాదహర్మ్యాదిగృహరాజవిరాజమానంబును, హిమాంబుసమ్మిళితకలితకస్తూరీపంకవిలిప్తవిపణిరాజమార్గస్థలకల్పితరంగరంగత్కర్పూరరంగవల్లీసముల్లసితంబును, సకలజన(నా)స్వాపుటీప్రియబంధుబంధురసర్వతోనిక్షిప్తనితాంతవాసవాసనాధవముద్వేలకాగురుధూపధూమమాలికాకపటకాదంబినీసమాశ్రితనభోంగణంబును అనల్పకల్పనాకుశలశిల్పిజనవినిర్మితవిచిత్రచిత్రకలాపసమున్మీలితశాతకుంభకుడ్యభాగాభోగంబును, ప్రత్యగారద్వారపార్శ్వపరిణద్ధశుద్ధసువర్ణకదళికాస్తంభసంభారంబును, వివాహసంభారసమానయనజాగరూకమహీకాచలరాజభృత్యసంతోషభ[illegible]కోలాహలకలధ్వానమేదురంబును, సంతప్తకాంచనమయస్తంభాదిసంధాననికాయకా[illegible](మాన)సంధానితముక్తావితానసంతానసంయోజితతరుణారుణకిరణస్ఫురణహరణ[illegible]ప్రకటపద్మరాగమణితోరణ రమణీయంబును, అమ్లానసంతానతరుకుసుమదామస్తోమసుందరకేళీమందిరద్వారంబును, భద్రకరవిద్రుమప్రవాళబద్ధమంజీమంజులభాసురోశీరకాయమానచ్ఛాయాభిరామపర్యంతభూభాగంబును, వివిధానర్ఘ్యమణిమయాభరణగంధమాల్యానులేపనవిచిత్రవసనాలంకృత దివ్య

శ్రీపురుషమండితంబును, సకలప్రాణిమానసమహోన్నతానందసందోహసంధాయకనవోత్సవంబును నగుచునుండె నక్కడఁ గైలాసంబునందు నిందుశేఖరుండు వివాహసన్నాహసముచితవర్తనుండై యున్నంత. 127

చ. సురపతిముఖ్యదిక్పతులు ♦ సొంపెసలార వధూసమేతులై
తరుణతరార్కబింబసమ ♦ ధామవిమానము లెక్కి వచ్చి రా
మరధరణీమహాప్రసవ ♦ మాల్యసుగంధభరానుయాతబం
భరనికరంబు వెంటఁ బడి ♦ బంట్లతెరంగున నంటి కొల్వఁగన్. 128

క. మరుదశ్వివిశ్వచారణ, గరుడోరగసిద్ధసాధ్య ♦ గంధర్వవియ
చ్చరకిన్నరతుషితాఖ్యా, స్వరు లీశువివాహమునకు ♦ వచ్చిరి వేడ్కన్. 129

వ. మఱియును త్రివిష్టపవాసు లగువార లందఱు నయ్యష్టమూర్తియిచ్ఛావశంబున సాక్షా(హ్లా)తులై ప్రకృష్టహర్షంబునం గైలాసంబునకు వచ్చిన వారినందఱ నభినందించి చందనకుంకుమసంకుమదమృగమదాదిపరిమళద్రవ్యభవ్యాంబర భూషణార్పణాదుల నాదరించి విరించివిజ్ఞాపితహిమవత్పురగమనుండై వృషభగమనుండు వైవాహికసమయోచితవేషంబుఁ దాల్చె నివ్విధంబున. 130

సీ. నిడుదకెంజడగుంపు ♦ ముడి విప్పి సిక వేసి, డంబైనమణికిరీ ♦ టంబుఁ దాల్చి
కలితత్రిపుండ్రరే ♦ ఖలఁ బొల్చునొసటిపైఁ, గస్తూరిచేఁ దిల ♦ కంబు దిద్ది
గరళంపుఁగప్పునఁ ♦ గారుక్రమ్ముచునున్న, యఱుత ముత్తెపుగంట ♦ సరియమర్చి
కరిచర్మ మటు పెట్టి ♦ కటిసీమఁ బసిఁడిక, మ్మలఁ బొల్చు తెలిపట్టు ♦ వలువ గట్టి

గీ. మదనభసితాంగరాగంబు ♦ మాని మేనఁ, బరిమళోద్గారిపాటీర ♦ పంకమలఁది
చిలువసొమ్ములు విడనాడి ♦ చెలువు మెఱయ, లలితనవరత్నభూషణం ♦ బులు ధరించి

వ. ఇట్లు సర్వేశ్వరుం డపూర్వవేషంబు ధరియించి హృద్యానవద్యసముద్యన్మహావాద్యఘోషంబులును, కుసుమాంజలివిక్షేపకుశలసురవధూకరకంకణఝుణత్కారంబును, నీరాజనార్పణనిపుణవృద్ధాంగనామంగళసంగీతనాదంబును, కాశ్యపపులహక్రతుపులస్త్యవసిష్ఠాదిమహర్షిస్వస్తివాచనరవంబును, నందిభృంగిరిటినికుంభకుంభోదరాదివేత్రధరహూంకారంబును, వందిమాగధపాఠ్యమానగద్యపద్యశబ్దంబును నేకీభవించి భూనభోంతరంబులు నిండింప నఖండితత్వరాహంకారపరాభూతమాతరిశ్వంబును, రమణీయరత్నకింకిణీగణవిరాజమానంబును, భర్మనిర్మితపల్యాణశోభితంబును, ఘణఘణత్కారకమనీయఘంటికాలలితకంఠభాగంబును నగువృషభవాహనంబు నెక్కి. 131

గీ. లక్ష్మి యును వాగ్వధూటియుం ♦ లలితలీల, పూర్ణకుంభద్వయముఁ గరం ♦ బులధరించి
కోరి ముందట నడువఁగఁ ♦ గొంద ఱమర, సతులు మంగళగీతికా ♦ కలము నెరప.

క. ఇరుదెసల వెనుక ముందట, హరిపరసిజగర్భవాస ♦ వ దివుషద్వల్
కరమర్థిఁ గొలువఁ గదలెన్, హరుఁ డప్పుడు తుహినగిరిపు ♦ రాభిముఖుండై. 134

గీ. ఇవ్విధంబునఁ గదలి య ♦ య్యిందుమౌళి, మందగమనంబునఁ దుపార ♦ మహీధరేంద్రు
పురము చేరఁగఁ జేర నా ♦ భూధరాధి, నాథుఁ డవ్వార్త విని మహా ♦ నందుఁడగుచు

చ. మునివరులున్ సువర్ణగిరి ♦ ముఖ్యనిజప్రియబంధువర్గముం
దనయులుఁ బుణ్యకాంతలు ల ♦ తాప్రతిమానతనూవిలాసశో
భనగణికానికాయము న ♦ పారముదంబునఁ గొల్వ లోకనా
థునిఁ గరుణాధునీశుని నె ♦ దుర్కొనియె న్నగరాజు వేడుకన్. 136

గీ. వందిమాగధరూప మిం ♦ పొందఁ దాల్చి, వెలసివచ్చినవేదాది ♦ విద్య లపుడు
త్రిపురహరణాదిశంకర ♦ విపులవిజయ, గాథలు పఠించెఁ బటునిరా ♦ ఘాటసరణి.

క. ఆడిరి వేలుపుచానలు, పాడిరి గంధర్వసతులుం ♦ బ్రమదం బెసఁగన్
బోడిదలగుమింటి తెరువరి, చేడియ లటు చల్లిరలరు ♦ సేసలువేడ్కన్. 138

క. దుందుభులు మొఱసె నయ్యెడ, మందరమంథానమధ్య ♦ మానోద్భూతా
మందస్పందనవీచీ, సందోహమహాబ్ధిశబ్ద ♦ సదృశధ్వనులన్. 139

గీ. శిశిరకరఖండధరహిమ ♦ క్షితిభృదుభయ, పక్షచారిపరస్పరో ♦ పరివికీర్ణ
సురభికర్పూరపటవాస ♦ చూర్ణపూర్ణ, మగుచుఁ గనుపట్టె భూగగ ♦ నాంతరంబు

గీ. శివునివారును నీహార ♦ శిఖరివారు, రంగదుద్వేలనిబిడహ ♦ ర్షమునఁ బొంగి
కలసి వర్తించిరి విలాస ♦ గతిసమేత, పూర్వపశ్చిమజలధుల ♦ పోల్కి నపుడు.

వ. ఈక్రమంబున నెదుర్కొన్న యన్నగరాజునకుఁ ద్రిలోకవంద్యుం డగుచంద్రశేఖ
రుండు నమస్కరించిన నతండు భయలజ్జాపభ్రమంబులు డెందంబున సందడింప ది
వ్యోపచారంబుల నప్పురాణపురుషునిం బూజించి నిజపురప్రవేశంబు సేయించి ము
కుందశతానందపురందరాదిబృందారకులకెల్ల విడుదుల విడియించి పెండ్లికొడుకున
కు విశ్వకర్మనిర్మితంబును, నవరత్నమణికిరణమాలికాకిమ్మీరితంబును నగుమందిరంబు సమ
ర్పించినఁ బ్రమదపరివారంబులతోడ నందు సుఖాసీనుండై యుండె నంత. 142

గీ. సురపతినిఁ జూచిపరమేష్ఠి ♦ శుభముహూర్త, మునసమీక్షిలియెడ లేదు ♦ భువనపతికి
సత్వరంబుగ మంగళ ♦ స్నానకృత్య, మర్హవిధమునఁ జేయింపు ♦ మనుచుఁ దెలుప.

వ. అంతట శచీదేవి మొదలయిననిర్జరాంగనల రావించి గంగాధరునకు (మంగళస్నానంబు సేయింపవలయు) నని నియోగించిన. 144

క. వల్లెయని యల్లనిర్జర, పల్లవపాణులు ప్రమోద ♦ భరమునఁ దారా
వల్లభధరు మణిఘృణిసం, పల్లలితకనకపీఠి ♦ పైనునిచి తగన్. 145

చ. నొసలను ముంగురుల్ చెదర ♦ నూల్కొని ముక్కెరదాలు మోవిపై
వెసఁ గొనసాగఁ జన్నుఁగవ ♦ విఱ్ఱుచు నట్టువద్రొక్కి హారముల్
ముసరి పెనంగులాడ నగు ♦ మోము చెమర్ప నొకర్తు చంపక
ప్రసవసుగంధితైలమున ♦ భర్గునకుం దల యంటె నేర్పునన్. 146

క. అపు డనసూయారుంధతు, లపరిమితప్రీతి జలక ♦ మార్చిరి శుంభ
త్తపనీయకుంభ సంభృత, సపరిమళద్రవ్యభవ్య ♦ జలసేకములన్. 147

క. ఒకకోమలి తడియొత్తెను, మకరధ్వజరిపున కొకతె ♦ మహితదుకూలాం
శుక మొసఁగె నంత నొకతె, పకగంధి సుగంధ మలఁదె ♦ భవునెమ్మేనన్. 148

క. కన్నులు మూడున్నవి చెలి, కన్నావఁటె యింక నొకింత ♦ కాటుకఁ దెమ్మం
చెన్నుచుఁ జెన్నుగ శివునకుఁ, గన్నుల నొకబోటి నునుపుఁ ♦ గాటుక దీర్చెన్.

వ. మఱియును మణిమకుటమకరకుండలగ్రైవేయతారహారకేయూరకంకణోర్మికాకటిసూత్రనూపురాదిసకలాభరణంబు లలవరించి రక్షాబంధనంబు మొదలగుశుభాచారంబు లన్నియు నిర్వర్తించి యామించుబోడులు తనతోడం జనుదేర నయ్యిందురేఖాచూడామణి మణిపాదుకారమణీయచరణారవిందవిన్యాసంబుల నాగుల్ఫకీర్ణకుసుమవిసరం బైనయభ్యంతరాంగణమార్గంబునకు ధన్యత్వంబు సంపాదింపుచు నల్లన నడచి యెదురుగా వచ్చి తనకు మ్రొక్కినమైనాకునికరంబుఁ గరంబున నవలంబించి పుణ్యపురంధ్రీనికురుంబసంభరితంబును, మేరుమందరాదిహిమవద్బంధుజనపరంపరాపరివేష్టితంబును, మహామునిగణపరిశోభితంబును, వసురుద్రాదిత్యనానావిధవిబుధవిశేషభూషితంబును, సరిత్సాగరవనస్పతిసమేతంబును, కామధేనుప్రముఖగోమాతృకాలంకృతంబును, విశ్వకర్మనిర్మితంబును నైనకల్యాణమంటపంబుఁ జేరం జనుదెంచి పుణ్యాంగనావిహితనీరాజనమంగళోపచారం బైనవివాహవేదికయందుఁ బ్రవేశించి హిమవంతుం డునుప ననుపమసమున్నతకనకసింహాసనంబున నాసీనుండై యుండె నంత.

గీ. కమలగర్భుఁడు కనకాసనమున నుండి, యాజ్ఞికత్వముఁ బూనిబ్ర ♦ హ్మర్షిసహితుఁ
డగుచుఁ బుణ్యాహవాచనం ♦ బాచరించి, సకలవిధులు యథావిధి ♦ సలుపుచుండె.

వ. అంత హిమవంతుండు. 152

గీ. పసిమిపదియాఱువన్నియ ♦ పసిఁడిపళ్లె, రమున శివునిపదాబ్జంబు ♦ లమర నునిచి
కేలుఁదమ్ముల రతనంపు ♦ గిండి వంచి, యనుగుటిల్లాలు నీరు వో ♦ యంగఁ గడిగి.

వ. అప్పుణ్యజలంబు లంబుజాక్షియుం దానును శిరంబులం దాల్చి. 154

చ. అతులితవైభవోన్నతున ♦ కబ్జభవాదిసమస్తదేవతా
పతికి గుణాఢ్యకిన్ భువన ♦ భర్తకు నీకును మాకుమారి ని
చ్చితిమని ధారవోసె గుణ ♦ సేవధి యాహిమవన్నగేంద్రుఁ డా
శ్రితశుభదాయి యైనశశి ♦ శేఖరుసవ్యకరాంబుజంబునన్. 155

క. అంగజజయశంఖం బన, మంగళగతిఁ బొల్చుసర్వ ♦ మంగళయుఱితన్
రంగమర శివుఁడు గట్టెను, మంగళసూత్రంబు భువన ♦ మంగళకరమున్. 156

వ. అంత. 157

క. గిరిసుతతలపై శివుఁడును, హరునౌదలఁ బార్వతియు స ♦ మంచితగతి నం
చిరి ముత్తియంపుసేసలు, కర మనురాగంబు మదిని ♦ గడలుకొనంగన్. 158

చ. సలలితకాంతిబాహువులు ♦ సాఁచుచు దోయిటఁ బట్టి గౌరి యా
దలఁ దలఁబ్రాలు వోయఁగ ను ♦ ధాకరశేఖరుఁ డొప్పె నత్తఱిన్
వలనుదలిర్ప సన్నిధికి ♦ వచ్చినయిందిరపుత్రరంధ్రిమీఁద ను
జ్వలనిజశాఖలన్ విరులు ♦ చల్లెడుకల్పకుజంబుకైవడిన్. 159

గీ. (అమ్మహోత్సవసమయంబు ♦ నందు) సురలు, కానుకలుగాఁగ నిచ్చిరి ♦ కనకవసన
లలితమణిభూషణములు క ♦ ల్యాణముదిత, చిత్తు లగుచు(నాగారిందు♦శేఖరులకు)

మ. అపు డర్పించెహిమాద్రిరాజు కడునె ♦ య్యం బొప్ప భూధేనువుం
దపనీయాచలదోగ్ధ మున్నుపితుకం ♦ దావత్సమై ముందుగా
నపు డావక్త్రని సంగ్రహించినయన ♦ ర్ఘామేయరత్నావళుల్
స్వపదారాధకముక్తిదాయ (కునకున్ ♦ జామా)తకున్ వేడుకన్. 161

గీ. ధైర్యమే కాదు చూడ నౌ ♦ దార్యగుణము, నీతనికి సహజం బని ♦ యెంచుకొనఁగఁ
దుహినగిరిసార్వభౌముఁ డ ♦ ర్థులకు నిచ్చె, నపు డమేయధనంబు వాం ♦ ఛాధికముగ

వ. ఇవ్విధంబునం ద్రిభువనానంద(దాయ)కంబై పార్వతీపరమేశ్వరులకల్యాణమహో
త్సవంబు ప్రవర్తించె. మఱియును జంద్రికాసంకాశమేదురదుకూలాస్తృతం బైన
యపరంజిపసిండిపెండ్లిపీటమీఁద నాదంపతులంగూర్చుండఁబెట్టి శాస్త్రోక్తప్రకా

రంబున నగ్నిప్రతిష్ఠాపనంబు గావించి సప్తర్షికం బగునక్షతంబు నిలిపిలాజహోమం బు నిర్వర్తింపంజేసి వధూవరులచేత జాతవేదునకుం బ్రదక్షిణప్రక్రమణంబు సేయిం చి సప్తపదంబులు మెట్టించునవసరమున. 163

సీ. కమలగర్భుఁడు శంకర ♦ కరగృహీత, శాంకరీచరణాంగుష్ఠ ♦ సౌష్ఠవంబు
గాంచి మన్మథకుంతసం♦క్రాంతుఁడయ్యె, నాగుణాధ్యునకప్పుడవి♦ర్యముస్రవించె

క. మనమున సిగ్గును వెలిపుం, జినఁగొని నిండార వేల్పు ♦ పెద్దన యప్పు డ
ల్లన నేలమీఁద నొలికిన, తనశుక్లము వామపాద ♦ తలమునఁ జమరెన్. 165

వ. అందు మహాతేజశ్శాలు లైనవాలఖిల్యులు జనించి రంత. 166

ఆ.వె. అపరిబుద్ధి వొడమె ♦ నయ్యయో విధి కని, నిఖిలమునులు సురలు ♦ నింద సేయ
నూరకుండె నెద్ది ♦ యును బలుకనేరక, మోసపోయి కార్య ♦ మూఢుఁ డగుచు.

వ. ఇట్లు దేవసభనమునం బొడమినసిగ్గుపెంపుకతంబునం దమ్మిచూలినాలుగుమోము లును వంచుకొని ఖిన్నుండై యుండి కొంతసేపునకు నల్లనఁ గదలి యోషధిప్రస్థప ట్టణంబు నిర్గమించి యెటకేనియుంబోవంగ నాభుజంగరాజభూషణుండు దయాప ముద్రుండుగావున నందికేశ్వరు నాలోకించి యాలోకేశ్వరుం దోడ్కొనిరమ్ము ము జ్జగంబులు సంతసింప నతని నిరపరాధిం గావించి కరుణించెదననిన నమ్మహేశ్వరుం డు వాణీశ్వరునిం దోడ్కొని తెచ్చె నంత విరూపాక్షుండు కరుణాకటాక్షవీక్ష ణంబుల వీక్షించి విరించి నాదరించి. 168

గీ. పాపకర్ములపాపముల్ ♦ పాపనోపు, భువియుఁ దోయంబులును మహా♦పుణ్యగరిమ
జక్కనారెంటిసారముల్ ♦ సంగ్రహించి, విగతపాపునిఁగావింతు ♦ విధినటంచు.

వ. నిశ్చయించి నీలగ్రీవుండు నిఖిలజలసారంబు లగుగంగోదకంబులాహరించి భూసా రంబున నొక్కకుండిక గావించి యప్పుణ్యజలసారంబు లందుఁ బూరించి యభిమం త్రించి విరించి నాలోకించి యీకమండలుపాత్రంబు ధరియింపుము దీనం బరిశు ద్ధుండ వగుదు వని మఱియు నిట్లనియె. 170

క. అప్పులు త్రిజగన్మాతృక, లప్పుడమియు లోకమాత ♦ యయ్యుభయము దా
నొప్పుగ జన్మస్థితులకుఁ, జెప్పెద వినుకారణం బ ♦ శేషంబునకున్. 171

గీ. యజ్ఞదానతపోనియ♦మాదులైన, ధర్మములు సమకూరు నా ♦ ద్వయమువలన
వృద్ధిఁబొందుఁ జరాచర ♦ విశ్వమెల్ల, సలిలధరణులచేత న ♦ బ్జాతజన్మ. 172

గీ. సలిలములతోడ భువితోడ ♦ సాటియెన, సేవనార్హపదార్థముల్ ♦ లేవు సుమ్ము
స్మరణమునవందనమునమ♦జ్జనమువలన, వినుమనోవాక్క్రియాకృత♦వృజినమడఁచు

క. అమరోత్తమ, యీసలిలమె, యమృతము మఱి దీనికన్న ♦ నధికము లేదు
త్తమతమ మగునీజలపా, త్రము నీవు నిరంతరంబు ♦ దాల్చుము భక్తిన్. 174

మాలిని. వినుము కనకగర్భా ♦ వేడ్క నిబ్భామిపాత్రిం
బున వెలసినగంగా ♦ పుణ్యతోయంబుఁ గీరిం
చిన(వివఁగనజంతు) ♦ శ్రేణికిం గోర్కెలబ్బున్
ఘనసుకృతము గల్గుం ♦ గల్మషంబుల్ దొలంగున్. 175

గీ. ఉత్తమంబులు పృథివియు ♦ నుదకములును, కమలసంభవ పంచభూ ♦ తములయందు
బూను మెప్పడుఁ దత్సార ♦ భూతమైన, యిమ్మహాపాత్ర(నానంద) ♦ మెసక మెసగ.

వ. కమండలుసంగతగంగోదకప్రభావంబున నీరుఁ జిత్తచాంచల్యసంభూతంబైనపాతకంబు నశించు నిది ధరింపు మని పలికిన సకలమునులును మురవైరిమొదలగుదేవతలును ముదంబునం బ్రశంసించిరి యప్పరమపావనసలిలసంభరితం బైనకమండలుపాత్రింబు ఫాలనేత్రుండు పద్మసంభవున కిచ్చె నమ్మహాపాత్రంబు స్వీకరించి విరించి విగతకల్మషుండై వెలింగె. నిట్లావిర్భవించి సకలభువనస్థితాంగనాసముత్కృష్ట(సర్వాం)గలావణ్యసంగతసర్వమంగళాచరణాంగుష్ఠసౌందర్యసందర్శనసంచలిత స్వాంతుం డైనసరస్వతీకాంతునిదోషంబు బ్రహ్మకమండలుగర్భంబున నుండె నంత హిమవంతునిచేతననుజ్ఞవడసి యప్పరమేశ్వరుండు పార్వతీసమేతుండై కైలాసంబునకుం జని యభీష్టసుఖంబు లనుభవింపుచు నుండె నంతం గతిపయకాలంబునకు భవానీశంకరులకుఁ గుమారస్వామి సంభవించి తారకాసురునిం జెగటార్చి యెల్లలోకంబులకుఁ బరమానందమ్ము బొనరించె నీగౌరీకళ్యాణమహోత్సవంబును గంగోత్పత్తిప్రకారపుణ్యాఖ్యానంబును వినినఁ బఠించిన సకలశుభంబులుసిద్ధించుమహాపాతకంబులు నశించు. మనోరథంబులు ఫలించు. బుత్రపౌత్రాభివృద్ధి యగు నని సూతుండు నైమిశారణ్యనివాసు లగుశౌనకాదిమహామునులకు జాహ్నవీసంభవప్రకారంబు వివరించె.

### ఆశ్వాసాంతపద్యములు.

మ. జగదుత్పత్తినిదానదానవచమూ ♦ సంహార, హారాయితో
రగరాడ్బ్రహ్మకపాల పాలనకళా ♦ ప్రావీణ్యసంపన్న ప
న్నగభూగ్యావహబాణ, బాణముఖినా ♦ నాభక్తమందారదా
రగతాంచత్తనుభాగభాగరిమసం ♦ క్రాంతాఖిలా శాంతరా. 178

క. శేషాహిభూష, భాషా, యోషాధిపవదననిగది ♦ తోక్తివిశేషా
న్వేషితపద శరశోషిత, దోషాచరనగర సకల ♦ దోషవిదూరా. 179

మాలిని. త్రిభువననుతకీర్తీ ♦ ధీరనందూరికామ
ప్రభుశుభకరమూర్తీ ♦ భానుమన్మధ్యవర్తీ
యభినవశశిమౌళీ ♦ యాశ్రితాంభోజహేళీ
విభవవిపులవిద్యా ♦ వీర్యకారుణ్యశాలీ. 180

గద్యము.

ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుగులక్ష్మణా
మాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ
లక్ష్మణకవినామధేయ ప్రణీతంబైన జాహ్నవీ
మాహాత్మ్యం బనుమహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.
శ్రీమత్పరదేవతాయైనమః.

# జాహ్నవీమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీవెంటూరిపురీశ్వర, పావనగుణచరిత భక్త ♦ పాలనమహిత
ప్రావీణ్యకామమంత్రీశ, భావజ, సోమేశలింగ ♦ యతిధవళాంగా.

వ. దేవా! అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుం డిట్లనియె. నట్లు బ్రహ్మకమండులుపాత్రింబుననుండి గంగాభవాని విస్తరిల్లిన తెఱంగుఁ జెప్పెదఁ దత్కథాశ్రవణమాత్రంబున సకలపుణ్యంబులు లభించు; విష్ణునాభికమలంబున బ్రహ్మదేవుండు జనించె; నమ్మహాత్మునకు మరీచి కొడమె నతనికిఁ గశ్యపుండు సంభవించె; నయ్యనఘునకు హిరణ్యకశిపుహిరణ్యాక్షులు పుట్టిరి. హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుం డాయనకు విరోచనుండు విరోచనునకు బలియనువాఁడు మహాధర్మాత్ముఁడు పుత్రుం డుదయించె. 2

ఉ. భాగవతాగ్రగణ్యుఁడు కృ ♦ పాపరిపూర్ణుఁడు సత్యభాషణుం
డాగమవేది యజ్ఞపతుఁ ♦ డాహవదోహలుఁ డుజ్జ్వలాత్ముఁ డ
భ్యాగతపూజకుండు సక ♦ లార్థిజనాభిమతార్థసంతత
త్యాగపరాయణుండు బలి ♦ దానవుఁ డొప్పు నజేయసత్త్వుఁడై. 3

గీ. అతఁడు నిజవంశగురుని మ ♦ హానుభావు, భార్గవోత్తము శుక్రుని ♦ భక్తిఁ గొలిచి
పరమఘనతప మొనరించి ♦ వరము బడసి, సమధికైశ్వర్యసామ్రాజ్య ♦ శాలియగుచు.

గీ. శక్రు నమరావతీపురం ♦ బాక్రమించి, యమరవీరుల భంజించి ♦ యాహవమున
గెలుపు నొంది పురందరాదులను దరిమి, యేలెఁ ద్రైలోక్యసామ్రాజ్య ♦ మేకమాళి

వ. ఆసమయంబున.

క. అదితియుఁ గశ్యపుఁడును నా, రదునిప్రసాదమున నమర ♦ రక్షకు లక్ష్మీ
హృదయేశు భక్తవాంఛా, ప్రదుని హరిం గొల్చి రింద్ర ♦ రాజ్యార్థంబై. 7

క. వనరుహనాభుఁడు వారికిఁ, దనయుండై పుట్టె నింపు ♦ దళుకొత్తఁగ న
వ్యనఘునకు వామనాహ్వయ, మొనరించెను గశ్యపుఁడు మ ♦ హోత్సవ మమరన్. 8

గీ. కశ్యపబ్రహ్మ శాస్త్రోక్త ♦ గతిని వామ, నునకు నుపనయన(మొనర్చి ♦ ము)నిహృదబ్జ
చారియైయొప్పు నాబ్రహ్మ ♦ చారి నంత, వేదపారగు నొనరించె ♦ విశదభంగి. 9

వ. ముజ్జగంబులకుఁ దండ్రియైనయయ్యావటువు తండ్రియొద్ద వేదాధ్యయనంబుఁ
జేసి వటుజనార్హకర్మనిరతుండై వర్తింపుచున్నయవసరంబున. 10

గీ. బ్రహ్మవేత్తలైన ♦ భార్గవప్రముఖు లా, ర్త్విజ్య మాచరింప ♦ దీక్షఁ బూని
పరమభాగవతుఁడు ♦ బలి హయమేధయ, జ్ఞంబు సేయుచుండె ♦ జగము వొగడ.

క. అమరేంద్రునిపని దీర్పన్, సమయం బిది యనుచుఁ దలఁచి ♦ చనియెన్ సర్వో
త్తమవటువు శిష్యసముదా, యముతో బలిచక్రవర్తి ♦ యజ్ఞంబునకున్. 12

గీ. ఇట్లు వచ్చి మఖస ♦ మృద్ధియు ఋత్విగ్గు, ణానుభావమును స ♦ మగ్రసూక్తి
కలనఁ బొగడుచున్న ♦ కపటవామను వటు, వేషధరుని జూచి ♦ తోషమొంది. 13

గీ. ఎదురుచనిభార్యయును దాను ♦ నెలమిమ్రొక్కి, యతనితేజస్సమృద్ధిక ♦ ద్భుతమునొంది
యర్ఘ్యపాద్యాదిసత్కార ♦ మాచరించి, కనకపీఠముపై నుంచి ♦ గౌరవమున. 14

వ. అబ్బలిదానవేంద్రుండు. 15

చ. కరయుగళంబు మోడ్చి యళి ♦ కంబునఁ జేర్చి వినీతవృత్తియై
వరకృప నీవు నాకడకు ♦ వచ్చుట ధన్యుఁడనైతి ధన్యతం
బొరసిరి మత్కులోద్భవులు ♦ పూర్వభవంబున నేమిపుణ్యముల్
కర మనురక్తిఁ జేసి నినుఁ ♦ గాంచితినో ఫలియించెఁ గోరికల్. 16

గీ. గ్రామకనకవస్త్ర ♦ రాజ్యభూములయందు, నిష్టమైనదాని ♦ నిత్తు నీకు
నడుగు మనుచు సవిన ♦ యంబుగఁ బలికిన, నతని కిట్లులనియె ♦ నవ్వటుండు. 17

ఉ. నీవు మహాకులీనుఁడవు ♦ నిర్మలకీర్తివి భూసుపర్వసం
సేవనతత్పరుండవు ప్ర ♦ సిద్ధుఁడ వద్భుతదానశాలివి
భూవలయంబు సర్వమును ♦ భూరిభవద్భుజశక్తిపాలితం
బై విలసిల్లె నిన్నుఁ గొని ♦ యాడఁదగుం బదివేలమోములన్. 18

ఉ. గ్రామసువర్ణవస్త్రమణి ♦ రాసులు భిక్షుల కేటికిన్ సుధా
ధాముని జేరఁబోయి యమృ ♦ తం బటు మాని తుషారలేశముం
బ్రేమ వరించునట్లనద ♦ భీష్టతభూరివదాన్యతాగుణో
ద్దాముని నిన్ను సూక్ష్మమగు ♦ దానము వేఁడెద దానవేశ్వరా. 19

వ. అది యెయ్యదియంటివేని. 20

గీ. తపము సేయ మాకు ♦ ధరణి మూడడుగుల, కొలఁది నిమ్ము దనుజ ♦ కులవరేణ్య
యిదియ ముజ్జగంబు ♦ లిచ్చుట(మది)సంశ, యింపవలదు నిక్క ♦ మిది యెఱుంగు.

క. అని వామనుండు పలికిన, దనుజేంద్రుఁడు సంతసిల్లెఁ ♦ దగ నేకాంతం
బున నంత నతనితో ని, ట్లనియెన్ శుక్రుండు కడుహి ♦ తాచరణమతిన్. 22

క. కేవలవటుఁడని తలఁపకు, మీవామను విష్ణుదేవుఁ ♦ డీశ్వరుఁ డీతం
డీవరపున నీసిరి గొని, దేవేంద్రున కిచ్చు నిజము ♦ దెల్పితి నసఘా. 23

ఆ. వె. భూమియితనికియ్యఁ ♦ బొసగదు మానుము, టంచుగురుఁడు దెలుప ♦ నతఁడు చింత
నొంది యిట్లు పలుకు ♦ నుచితమె మిముబోంట్ల, కింతకన్న ధర్మ ♦ మెద్ది చెపుమ.

ఆ. వె. యజ్ఞపురుషుఁడైన ♦ హరి వచ్చి ప్రార్థింప, నియ్యరాని దెద్ది ♦ యెంచిచూడఁ
గరుణ నన్ను ధన్యుఁ ♦ గావింపఁదలఁచి నా, యింటి కరుగుదెంచె ♦ నీశ్వరుండు.

వ. అని పలికి భార్యాసమేతుండై బలిచక్రవర్తి వామనస్వామిచరణకమలంబులు కన
కకలశచ్యుతపుణ్యతోయంబులచేతం బ్రక్షాళనంబు జేసి భృగుప్రముఖబ్రహ్మర్షులును
శుక్రుండును లోకపాలురును సకలదైత్యదానవులును జూచుచుండఁ బదత్రియపరి
మితభూతలంబు ధారాపూర్వకంబుగా నిచ్చెఁ బుష్పవర్షంబు గురిసె దేవదుందుభు
లుమ్రోసె జయజయశబ్దంబులు చెలంగె సకలభూతంబులుఁ బ్రశంసించెననంతరంబ

ఆ. వె. భూమి యిమ్ము సత్య ♦ భాషణ, గ్రక్కున, నేగవలయు నన బ ♦ లీంద్రుఁ డట్ల
కాక యనుచుఁ బలుకఁ ♦ గా నంతలోనే న, ద్వేషధారి మిగుల ♦ వృద్ధిఁబొందె. 27

ఉ. అందఱుఁ జూచుచుండఁ బరి ♦ మాద్భుతరూపముఁ బూని సూర్యుఁడ
య్యిందుఁడు మధ్యభాగమున ♦ నెంతయు దాసి చరింప నుజ్వలా
మంద సమున్నతిం బొరసి ♦ మానసవృత్తికి వాక్యశక్తికిం
జెందఁగరానివిక్రమవి ♦ శేషముఁ జూపె నుపేంద్రుఁ డత్తఱిన్. 28

వ. ఇట్లు వామనుండు జగద్వ్యాపకుండై. 29

గీ. వృద్ధకచ్ఛపకులరాజు ♦ వెన్నుమీఁద, మడమ తుదురుగ నిల్పివా ♦ మనుఁడు యజ్ఞ
వాటికయందుఁ బదాగ్రంబు ♦ నూటినిచి, ధరణియిటువలెనొక్క ♦ పాదమునఁగొల్చె.

క. అటుపై రెండవపాదము, పటువిక్రమ మహిర నమర ♦ పాలకుఁ డగున
వ్వటువుంచె సత్యలోకము, తటుకున నది దాసె దేవ ♦ తలు నుతిసేయన్. 31

క. జగదంతరమంతయుఁ బద, యుగళంబునఁ గొలువఁబడియె ♦ నొగి నీయెదుటం
దగ మూడవపదమునకుం, జగతీతల మిమ్ము సత్య ♦ సంధ మహాత్మా. 32

చ. అన(బలిదానవేంద్రుఁడపు) ♦ డంజలి ఫాలతటిన్ ఘటించి యి
ట్లనియె జగన్నివాస పరి ♦ హాసవినోదమునందు నేని యే
నన్యత మెఱుంగ నీదగుప ♦ దాబ్జము పాతలమీఁద నుంచి న
న్ననఘుని జేసి యేలుము ద ♦ యాతిశయభూషణ భక్తపోషణా. 33

ఉ. నావిని సంతసిల్లి వటు ♦ నాథుఁడు దానవనాథుఁ జూచి నీ
పావనశీలసంపదకు ♦ భక్తికి సత్యవచోనిరూఢికిన్
భావిని మెచ్చితిన్ సుకృత ♦ వర్ధన వేఁడు వరం బొసంగెదన్
నావుడతండు పల్కె సుజ ♦ నప్రియ నిన్ను వరింప నెట్టియున్. 34

వ. అనిపలికిన వామనాకారంబు ధరియించినయాదినారాయణుండు (నిష్పృ)హుం డగు నాత్మకింకరునితలం పెఱింగి తాన యప్పరమభాగవతునకు రసాతలలోకాధిపత్యంబును భావిదేవేంద్రపదంబును శాశ్వతం బగుమహాయశంబును బ్రసాదించి పుత్రమిత్రకళత్రామాత్యపరివారసమన్వితంబుగా బలిచక్రవర్తిని పాతాళలోకంబున నిలిపి సకలైశ్వర్యంబు లొసంగి గారవించె. ఇంద్రునిం దొల్లంటిచందంబునం ద్రిలోకనాయకుం గావించి దిక్పతుల నిజస్థానంబులం బ్రతిష్ఠించి సర్వసుపర్వులకు సఖర్వప్రమోదంబు సంపాదించి యుపేంద్రుండై వామనుండు జగం బేలుచుండె నీక్రమంబునఁ ద్రివిక్రమస్వామి ముల్లోకంబు లాక్రమించునెడ నతనిపాదపద్మంబు సత్యలోకంబునకు వచ్చినం జూచి బ్రహ్మదేవుండు. 35

మ. ముదమొప్పన్ భగవత్పదాంబురుహముం ♦ బూజించువాఁడై శుభ
ప్రదమౌ పావనవస్తు వెద్ది యనుచున్ ♦ భావించి యత్యుత్తమం
బుదకంబే యని నిశ్చయించి శివద ♦ త్రోదాత్తపాత్రస్థపు
ణ్యదగంగాసరిదంబుపూరములచే ♦ నర్చింప నుద్యుక్తుఁడై. 36

కవిరాజవిరాజితము.

అజుఁ డభిషేకము సేసె స ♦ మంచితహర్షమున న్మునిసంయుతుఁడై
త్రిజగదధీశ్వరుఁడై తగువామన ♦ దేవుని శ్రీచరణంబునకున్
నిజకరసంభృతదివ్యకమండలు ♦ నిర్గతగాంగజలౌఘముచే
ఋజుతరచారుచతుర్వదనోక్త స ♦ మృద్ధచతుశ్శ్రుతిమంత్రములన్. 37

గీ. శ్రీకరం బగునయ్యభి ♦ షేకజలము, దానవారాతిపాదప ♦ ద్మముననుండి
తగినగతిఁ బూర్వపశ్చిమ ♦ దక్షిణోత్త, రములఁ బ్రవహించె నాల్గుచం ♦ దములనప్పుడు

వ. తూర్పుదెసఁ జనినజలప్రవాహంబు ఋషులును బృందారకులును పితృదేవతలును

దిక్పాలకులును బరిగ్రహించిరి. దక్షిణదిక్కునం బ్రవహించినతీర్థంబు రుద్రగణస్వీకృతం బయ్యె. పశ్చిమదిగ్భాగంబునఁ జారినతోయంబు బ్రహ్మదేవుండు కమండలుపాత్రంబున నిడుకొనియె. ఉదగ్భాగంబునంబడిరంబు లయినసలిలంబు లచ్చోటనె వసించె. మఱియును బూర్వదిక్ప్రవృతంబయినయప్పుణ్యప్రవాహంబు వైకుంఠంబునకుం జని విరజానామంబువూనె. నీతెఱంగున దేవతాలోకంబులం బ్రవహించి పరమపావని యగుచుం బ్రకాశించె నిట్టిగంగాభవానిం దలంచినసకలపురుషార్థంబులు సిద్ధించు నిట్లు గంగవిస్తరిల్లె నీపుణ్యాఖ్యానంబు విన్నవారికిం బఠించినవారికి నశేషతీర్థస్నానఫలంబును గయావ్రజనఫలంబును లభించు. పుత్రార్థికిఁ బుత్రలాభంబును విద్యార్థికి విద్యలును ధనార్థులకు ధనంబునుం గలుగు. దేహపీడలు నశించు. విఘ్నంబులు దొలంగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులును పితృదేవతలును తృప్తు లగుదు రని సూతుండు వక్కాణించిన విని సంతుష్టాంతరంగులై శౌనకాదులిట్లనిరి. 39

క. దివినుండి యేవిధంబున, భువికిం జనుదెంచె మౌని ♦ పుంగవ మును జా
హ్నవి యేచందమున మహా ♦ ర్ణవమునకుం జనియె నది వి ♦ నంగావలయున్. 40

వ. అని యడిగిన శ్రీరామునకు విశ్వామిత్రుండు వివరించిన తెఱం గెఱింగించెద సావధానులరై వినుండని సూతుండు గంగావతరణం బిట్లు చెప్పందొడంగె. 41

క. సగరుఁ డనునృపుఁ డయోధ్యా, నగరాధిపుఁ డార్తరక్ష ♦ ణవిచక్షణుఁ డ
బ్ధిగభీరుఁ డాపయోనిధి, జగతీశుఁడు వెలయు సకల ♦ జనహితుఁ డుర్విన్. 42

గీ. అతని కిద్దఱుభార్యలం ♦ దగ్రమహిషి, కేశినియనంగఁ దగువిద ♦ ర్భసుతనయ
రెండవవధూటి వెలయు న ♦ రిష్టనేమి, కూర్మికూఁతురు సుమతిసా ♦ కోమలాంగి.

వ. అమ్మహారాజనపత్యుండై భార్యలతోఁ గూడి హిమవంతంబునకుం జని ప్రస్రవణగిరియందు భగవంతుం డగుమహామునిం గూర్చి శతసంవత్సరంబులు తపంబుఁ జేసె నంత నమ్మహర్షి ప్రసన్నుండై సగరునితో నిట్లనియె. 44

సీ. పార్థివోత్తమ నీకు ♦ బహుపుత్రలాభంబు, గలుగు మహాకీర్తిఁ ♦ గాంచె దీవు
కాంచు నొక్కతె వంశ ♦ కరుఁడైనపుత్త్రుని, యరువదివేవుర ♦ నాత్మభవుల
గను నొక్కయతివ యి ♦ ట్లని పలుకమ్మౌని, ప్రభుఁ బ్రసన్నుని జేసి ♦ రాజభార్య
లతిముదంబునఁ బల్కి ♦ రనఘ మహాభాగ, యెవ్వతె కుదయించు ♦ నేకపుత్రుఁ

గీ. డెవ్వతెకు సంభవింతు ర ♦ నేకపుత్రు, లిది యెఱింగింపు మనిన మీ ♦ కిష్టమెద్ది
యట్లు వేడుఁడు వరమిత్తు ♦ ననియె నంత, దనయుఁ గులకరు నొకని కే ♦ శిని వరించె.

గీ. సుతుల నఱువదివేవుర ♦ నతులబాహు, బలుల నుత్సాహవంతులఁ ♦ బ్రకటయశుల
బరమసాధ్వి సుపత్ని ♦ భగినిసుమతి, యధిపుసన్నిధి వరముగా ♦ నడిగె నపుడు.

వ. ఇట్లు వరంబు వడసి మునికిం బ్రదక్షిణం బొనరించి దండప్రణామంబు గావించి సభార్యుండై సగరుండు నిజరాజధాని యగునయోధ్యకుం జనియె నంతం గొంతకాలంబు చనిన. 47

ఆ.వె. అధిపుపెద్దభార్య ♦ యైనకేశిని యస, మంజుఁ డనఁగ దగుకు ♦ మారుఁ గనియె
గడఁగి పిన్నభార్య ♦ కడుపున నంతఁ బ్రా, దుర్భవించె నొక్క ♦ తుంబిఫలము.

క. సుతషష్టిసహస్రకము, ద్గత మయ్యెం దుంబిఫలవి ♦ దళనమువలనం
జతురత వెలయఁగ వారల, ఘృతఘటముల నుంచి పెంచి ♦ రెలమిని దాదుల్. 49

క. ఈగతిఁ గడుపోషితులై, సాగరు లెంతయును బెరిగి ♦ చారువయశ్శ్రీ
యోగవిరాజితులు మహో, ద్యోగులునై మెలఁగుచుండి ♦ రుద్ధతవృత్తిన్. 50

వ. సగరునిపెద్దకొడుకు దురాచారుండై యసమంజుం డనువాఁడు బాలులం బట్టుకొని సరయూనదియందు వైచి మునుంగుచున్నవారిం జూచి పకపకనగుచు పౌరజనబాధకుండై చరింపుచున్నది సహింపక వానిం బురంబువలన వెడలం దరిమించి రాజు ప్రజలకు హితం బొనరించె. ఆసమంజునిపుత్రుం డంశుమంతుండు సర్వలోకసమ్మతుండును వీర్యవంతుండును ప్రియంవదుండును నై వర్తింపుచుండె నంతం బెద్దకాలం బతిక్రమించిన. 51

ఆ. సగరుఁ డశ్వమేధ ♦ సవనంబు సేయంగ, దలఁచి నిశ్చయించి ♦ ధర్మవిదుఁడు
పరమనియతి(తో)ను ♦ పాధ్యాయసహితుఁడై, క్రతువు సేయఁ బోడఁగె ♦ నతులమహిను

క. అతిపుణ్యావింధ్యతుహిన, క్షితిధరమధ్యమున నృపతి ♦ సింహునియాస
క్తక్రతువు ప్రవర్తించె సమం, చిత మద్దేశంబు మఖవి ♦ శేషక్రియకున్. 53

క. హయరక్షణార్థ మరిగె, న్నయశాలి మహారథుండు ♦ నానాస్త్రవిదుం
డయకలితుఁ డంశుమంతుఁడు, నియతేంద్రియరిపుఁడు సగర ♦ నృపవరునాజ్ఞన్.

వ. అంత. 55

ఆ.వె. అపహరించె నింద్రుఁ డ♦శ్వరాజంబును, గపటదైత్యరూప♦కలితుఁ డగుచుఁ
యజ్ఞహయ మదృశ్య♦మగుడు నయ్యజమాను, నెదుట నిలిచి గురువు♦ లిట్లు లనిరి.

సీ. యజ్ఞాశ్వ మపహృతి ♦ మయ్యె వేగంబున, దాని దెప్పింపుము ♦ ధరణినాధ
యిదె వచ్చెఁ బర్వమా♦హితవృత్తిఁ దురగాప, హర్తను గాలిచి హ♦యమ్ముఁ దెమ్ము

క్రతుభంగ మగువాజి ♦ రానివాఁ డనవుడ, య్యధిపుఁడు షష్టిస ♦ హస్రసుతులఁ
గనుఁగొని పల్కె నీయా ♦ గం బిది బ్రహ్మర్షి, గణములచే నుప ♦ క్రాంత మయ్యె

ఆ.వె. సుచితవిధి సమాప్తి ♦ నొందింపఁగాఁదగు, నట్లు గానినాఁడు ♦ హాని వచ్చుఁ
గావ మీరు చనుఁడు ♦ ప్రకటిన వెతకుఁడు, తిరుగుఁ డవనియెల్లఁ ♦ దెండు హయము.

వ. అని తండ్రి యాజ్ఞాపించిన. 58

చ. సగరకుమారు లందఱును ♦ సమ్మదసంభరితాంతరంగులై
స్వగురువచోనియుక్తులు వె ♦ సం జని సప్తసముద్రవేష్టితం
బగువిపులక్ష్మావలయ ♦ మంతయుఁ ద్రిమ్మరి యెల్లచోటులం
దగినవిధంబులన్ వెదకి ♦ తత్తడిఁ గానక తత్తరంబునన్. 59

గీ. ఉరుభుజాసత్వ లోకోత్కటో ♦ యోజనంబు, నిడుపు వెడలుపుగా నవ ♦ నీతలంబు
వరుసఁ ద్రవ్విరి సగరులు ♦ వజ్రనిశిత, శూలనఖహలతీక్ష్ణకు ♦ ద్దాలతతుల. 60

ఆ.వె. ఇట్లు ద్రవ్వుచున్న ♦ యెడ భూమి ఘోషించె, సురగదనుజరాక్ష ♦ సోగ్రసత్వ
తతులు సగరరాజ ♦ సుతులచేఁ దెగుచు నా, గుబ్బగాఁగ మిగులఁ ♦ గూత లిడియె.

వ. ఇట్లు భూతాక్రోశంబు మిన్నులమ నఱువదివేలయోజనంబులు రసాతలంబంట జం
బూద్వీపంబు గ్రొచ్చి యన్నియెడలం ద్రవ్వుచుండిరి. 62

ఉ. అంతట భీతులైనముని ♦ యక్షసురాదులు భారతీమనః
కాంతునిపాలికిం జని యు ♦ ఖండితభక్తిఁ గృతప్రణాములై
శాంతమై నిల్చి విన్నపము ♦ చేసిరి యోభగవంత భూతలం
బంతయుఁ ద్రవ్వి రోలిఁ దెగ ♦ టార్చి రనేకుల సాగరుల్ వడిన్. 63

ఆ.వె. వీఁడుజన్నమునకు ♦ విఘ్నంబు గావించె, వీఁడు హయముఁ దెచ్చె ♦ వాఁడటంచు
నెల్లభూతములను ♦ హింసింపుచున్నారు, సగరనృపునిసుతులు ♦ జగదధీశ. 64

క. అని సురలు విన్నవించిన, వనజాసనుఁ డనియె భయము ♦ వలవదు మీకున్
వినుఁ డాసగరకుమారులు, మొనసి నశించెదరు కపిల ♦ మునికోపాగ్నిన్. 65

క. అని లోకగురుఁడు దెలిపిన, విని సంతోషించి నిజని ♦ వేశనములకున్
జనిరి కృశానుపురస్సరు, లనిమిషులు మహామునీశ్వ ♦ రావళితోడన్. 61

ఆ.వె. సగరపుత్రు లంత ♦ జగదేకభీకరు, లట్లు గ్రొచ్చిగ్రొచ్చి ♦ యఖిలభూమి
వలయమెల్లఁ దిరిగి ♦ వలగొని తమతండ్రి, పాలి కరిగి యిట్లు ♦ పలికి రపుడు. 67

క. వలగొంటిమి భువి యంతయు, బలవంతుల దేవదనుజ ♦ పన్నగభూతా
దులఁ బరిమార్చితి మేమెల్ల, దులఁ జూడము తురగహరుని ♦ తురగము నైనన్. 68

ఆ.వె. ఏమి సేయువార ♦ మిఁక నుపాయం బెద్ది, తెలియ నానతిమ్ము ♦ దేవ? యనుఁడు
గుపితచిత్తుఁ డగుచు ♦ నృపసత్తముఁడు వారి, నెల్లఁ గలయఁ జూచి ♦ యిట్టులనియె.

గీ. వెండియును జని త్రవ్వుఁడు ♦ ర్వీతలంబు, త్రవ్వి యశ్వాపహర్తను ♦ దగిలి యజ్ఞ
హయముఁ గొంచుఁ గృతార్థు ల♦రగుచు మరలి, రండు మీర న్న వారును ♦ గండు మెఱసి.

మ. చని యారాజసుతుల్ రసాతలము దో ♦ శ్శక్తిన్ విభేదింపుచున్
గని రచ్చోట దిశాకరిన్ గిరివరా ♦ కారంబు దానిన్ సకా
నన శైలాఖిలభూమిమండల మమం ♦ దస్ఫూర్తి శీర్షంబుపై
నను వొప్పన్ ధరియించి యొప్పెడు విరూ ♦ పాక్షాఖ్యనాగేంద్రమున్. 76

గీ. అవిరూపాక్షదిగ్గజం ♦ బవనిభార, జనితఖేదమువలన వి ♦ శ్రాంతి కొఱకు
మొనసి తలయూచు నేపర్వ ♦ మునఁ గడంగి, యప్పుడు భూకంపమగు విమ ♦ లాత్ములార

క. అక్కరికి సగరతనయులు, మ్రొక్కి ప్రదక్షిణముఁ జేసి ♦ ముదమొప్పఁగఁ జే
రుక్కున రసాతలంబును, గ్రక్కున భేదించి చనిరి ♦ కార్యాపేక్షన్. 73

సీ. అంత నాబలవంతు ♦ లమరేంద్రుదిశ మాని, యరిగి భేదించిరి ♦ యామ్యదిశయు
కాంచి రక్కడ దిశా ♦ కరిని మహాపద్మ, మనెడి పేరఁటి దాని ♦ నఖిలధరణి
చక్రంబు మస్తక ♦ స్థలమునఁ బూనిన, దానిఁ బర్వతనిభం ♦ బైన దాని
గాంచి మహాశ్చర్య ♦ కలితులై వలగొని, కుంజరేంద్రుని జేరి ♦ కుశల మడిగి

గీ. తివిరి వారలు పడమటి ♦ దెసకుఁ బోయి, త్రవ్వి దర్శించి రెలమి ది ♦ గ్దంతి నదట
నచలమును బోలెఁ బొడవగు ♦ నట్టి దాని, సౌమనసమను దానిని ♦ సగరసుతులు. 74

గీ. చేరి యాదిక్కరికిఁ బ్రద ♦ క్షిణ మొనర్చి, సేమ మరసి మహావీర ♦ సింహు లంత
నర్థపతిదిక్కు భేదించి ♦ రధికశక్తి, నయ్యెడఁ గనుంగొనిరి భద్ర ♦ మనెడు కరిని. 75

క. ధరణీమండల మంతయు, శిరస్థలంబున వసించి ♦ శీతాచలపాం
డురరుచి నమరెడు దిక్కరి, వరుని విలోకించి వారు ♦ వలగొని కడఁకన్. 76

వ. అంత. 77

శా. రోషావిష్టమనస్కులై నృపకుమా ♦ రు లవ్వక్రమోదారుల
ద్భీషస్ఫూర్తి నుదగ్రశావసుమతిన్ ♦ భేదింపుచుం బోయి ని
ర్దోషప్రాభవు వాసుదేవపద్వృతున్ ♦ దుర్వారతేజున్ జిత
ద్వేషాత్మున్ గపిలున్ మునిప్రవరునిన్ ♦ వీక్షించి రచ్చోటునన్. 78

గీ. అతనిచేరువఁ జరియించు ♦ హయముఁ జూచి, పరమసంతుష్టులై మహీ ♦ పాలతనయు
లమ్మునీంద్రుని యజ్ఞాశ్వ ♦ హరుని గాఁగ, నాత్మ నూహించి క్రోధభర ♦ క్రాంతు లగుచు

ఉ. శూలఖనిత్రిపాణు లతి ♦ శూరులు దారుణవృత్తులాఁగల
స్థూలశిలాధరుల్ సగర ♦ సూనులు కోపపరీతచిత్తు లా
ఖీలత నిల్వునిల్వుమని ♦ పెద్దయెలుంగునఁ బల్కుచున్ సము
ద్వేలజవంబునం జని సు ♦ ధీనుతు నమ్ముని డాసి రుద్ధతిన్. 80

ఉ. ఈగతి డాసి సంయమికు ♦ లేంద్రునిఁ జూచి, దురాత్మ, నీవుమా
యాగహయాపహర్తవు మ ♦ దాంధుఁడ వచ్చినవారలన్ మమున్
సాగరులన్ మహాభుజుల ♦ శత్రుకృతాంతుల దుష్టనిగ్రహో
ద్యోగులఁ జూడుమంచుఁ గడు ♦ నుద్ధతి నిష్ఠురభాషలాడఁగన్. 81

క. విని కినిసి కపిలదేవుఁడు, ఘనహుంకృతి సేసినంతఁ ♦ గడచెడివార
మ్మునికోపశిఖిస్మసాత్కృత, తనులై పడిరచట సగర ♦ తనయులు పెలుచన్. 82

క. తనసుతులు రాక మసలుట, మనునిభుఁ డగుసగరుఁ డెఱిఁగి ♦ మనుమనినసమం
జుని తనయునంశుమంతుని, వినయాన్వితుఁ జూచి పలికె ♦ వేడుక వెలయన్. 83

గీ. శూరుఁడవు సర్వవిద్యావి ♦ శారదుఁడవు, తేజమునఁ బూర్వసముఁడవు ♦ ధీరవర్య
కడఁగి నీపినతండ్రుల ♦ గతియుఁ దురగ, హారునిజాడయుఁ బరికింపు ♦ మనఘచరిత

క. క్షితిమధ్యస్థితసత్త్వము, లతులితబలవీర్యజవస ♦ మన్వితములు త
త్ప్రతిఘాతార్థము బూనుము, శితఖడ్గముఁ గార్ముకంబు ♦ జితపరిపంథీ. 85

గీ. ద్రొక్కఁదగినవారలకును ♦ మ్రొక్కి యంత, రాయకరుల వధించికృ ♦ తార్థుఁడవయి
మరలు మని పల్క నాయంశు ♦ మంతుఁ డట్ల, ఖడ్గకార్ముకపాణియై ♦ కదలెనపుడు

వ. ఇట్లు కదలి పితరు లగుసాగరులు త్రవ్వినభూవివరమార్గం బనుసరించి దైత్యదానవర
క్షఃపిశాచపతగపన్నగాదిపూజ్యమానం బైనదిగ్గజంబు నాలోకించి ప్రదక్షిణపూ
ర్వకంబుగాఁ గుశలప్రశ్నంబుఁ జేసి పితరులను యజ్ఞాశ్వహర్తను నడిగిన నతనికి ది
గ్దంతి యిట్లనియె. 87

గీ. అంశుమంత కృతార్థుఁడ ♦ వై హయంబు, గోడఁ జనుదెంచెదవు నీవు ♦ తూర్ణగతిని
నావిని యతండు సర్వది ♦ ఙ్నాగములను, వరుస మునువోలె నడుగంగ ♦ వానిఁ జూచి.

వ. దిగ్గజంబులును గారవించి యజ్ఞహయంబునుం దోడ్కొని శీఘ్రంబ నీవు రాఁగలవని
పలికిన విని సగరులు భస్మీభూతులైనచోటికి నరిగి దుఃఖపరవశుండై విలపించి త
త్సమీపంబున సంచరించుచున్నహయంబు నాలోకించి శోకంబు నొంది యంశు
మంతుండు. 89

క. వారికి జలదానక్రియ, నారూఢిం జేయఁదలఁచి యచ్చోట జలా
ధారము గానక దృష్టివి, సారము గావించి చూచె ♦ సలిలాన్వేషిన్. 90

వ. తదనంతరంబ. 91

క. సగరునిపౌత్రుఁడు గాంచెన్, ఖగకులనాయకుని నచటఁ ♦ గల్పాకారుఙ్
సగరాత్మజమాతులునిన్, జగదభినుతు వైనతేయు ♦ జవసత్వనిధిన్. 92

వ. ఆగరుత్మంతుం డంశుమంతున కిట్లనియె. 93

ఆ.వె. రాకుమార వినుపు ♦ శోకంబు సాగర, సంక్షయంబు లోక ♦ సమ్మతంబు
గాన భూరిబలులు ♦ కపిలునిచే మహా, విష్ణుచేతఁ జెగిరి ♦ వీరువత్స. 94

సీ. వినుము రాజకుమార ♦ వీరికి లౌకిక, మగుసలిలం బిడఁ ♦ దగదు గంగ
యందు నీపితరుల ♦ కర్థితో జలకర్మ, మాచరింపుము పుర ♦ సాగ్రగణ్య
గంగోదకమున సా ♦ గరభస్మరాసులు, తడిసినఁ గడుఁ బవి ♦ త్రిత వహించి
సగరకుమారులు ♦ స్వర్గస్థు లగుదురు, పవనవాజిని గొని ♦ చనుము నీవు

గీ. తాతజన్నంబుఁ బెంపునొం ♦ దంగఁజేయు, మని సుపర్ణుఁడు చెప్పిన ♦ వినియతండు
వాజిఁ జేకొని క్రమ్మఱ ♦ వచ్చి యజ్ఞ, రక్షితుని సగరకుమా ♦ రాజుఁ గాంచె. 95

వ. తను పోయివచ్చిన తెరంగును వైనతేయునివచనంబులు నెఱింగించిన ఘోరసంకాశం బగునంశుమంతునివాక్యంబు విని యనంతరంబ యజ్ఞంబుయథాశాస్త్రమ్ముగా నిర్వర్తించి యిష్టయజ్ఞుండై సగరమహారాజు తనపురంబున కరిగె నంత. 96

గీ. అతఁడు గంగావతరణంబు ♦ నందు నిశ్చ, యంబు నొందక త్రింశత్స ♦ హస్రవత్స
రములు ధర్మక్రమంబున ♦ రాజ్య మేలి, దీప్తపుణ్యుఁడు సగరుండు ♦ దివికి నరిగె. 97

క. సగరనృపానంతరమున, జగతీజను లంశుమంతు ♦ సమధికతేజుం
దగ రాజును గావించిరి, సుగుణాశ్రయుఁ డతఁడు బ్రోచె ♦ సొంపుగఁ బ్రజలన్.

గీ. అతనిసుతుఁడు దిలీపుఁ డూ ♦ ర్జితసమాఖ్యుఁ, డాకుమారునియందు రా ♦ జ్యంబునిలిపి
రమ్యమగుహిమవచ్ఛిఖ ♦ రంబునందు, నంశుమంతుఁడు బహుతపం ♦ బాచరించె. 99

వ. ఇట్లువనంబున ముప్పదిరెండువేలయేండ్లు దారుణతపంబు సేసి యాతపోధనుండు స్వర్గంబుఁ జేరె. దిలీపుండును పితామహు లగుసాగరులవధప్రకారంబు విని దుఃఖాపహతబుద్ధియై నిశ్చయంబు నొందక యంతర్గతంబున. 100

ఉ. ఏగతి గంగవచ్చు భువి ♦ కెట్లు జలక్రియ సంభవించు నే
నేగతి మత్పితామహుల ♦ నెల్లఁ దరింపఁగఁజేతు నంచుఁ దాం

తాగతుఁ డయ్యె నట్లు ♦ పరితాపముఁ బూని మెలంగు నమ్మహా
భాగునకున్ భగీరథుఁడు ♦ ప్రాజ్ఞుఁడు పుత్రుఁడు పుట్టె నున్నతిన్. 101

శా. వంశోద్ధారకుఁ డాదిలీపుఁడు ప్రజా ♦ వాత్సల్యసంశోభియై
త్రింశద్వర్షసహస్రముల్ సకలధా ♦ త్రీమండలం బేలి దే
వాంశప్రోద్భవుఁ డశ్వమేధములు సం ♦ ఖ్యాతీతముల్ సల్పి శు
భ్రాంశుప్రోజ్వలకీర్తియై త్రిదశలో ♦ కారూఢుఁ డయ్యెం దుదిన్. 102

ఉ. శ్రీకరలక్షణుండు నృప ♦ సింహము సూనృతవాది వైరిహృ
ద్భీకరుఁ డస్త్రకోవిదుఁడు ♦ దేవగురుద్విజపూజకుండు సు
శ్లోకుఁడు వేదపారగుఁడు ♦ సుస్థిరబుద్ధి జనప్రియుండు ధ
ర్మైకపరాయణుండు సుగు ♦ ణాబ్ధి భగీరథుఁ డెన్నఁ గాఁ దగున్. 103

క. అతఁ డనపత్యుండై ఘో, రతపము సేయంగఁ దలఁచి ♦ రాజ్యము సచివ
స్థితముగ నొనర్చి గంగా, వతరణరతుఁ డగుచుఁ బుణ్య ♦ వనమున కరిగెన్. 104

వ. ఇట్లు గోకర్ణంబున కరిగి యందు మాసాహారుండును నూర్ధ్వబాహుండును నై భగీ
రథుండు ఘోరంబైన తపంబు సేయుచుండె నంత. 105

మ. మదనోద్దీపనకారణంబు పికవా ♦ క్మాధుర్యసంపాది ష
ట్పదతృష్ణావ్యసనాపహారి శుకసం ♦ పత్కారి నానావనీ
సదలంకారము పాంథహృద్భయదమం ♦ చత్పుష్పలక్ష్మీకళా
స్పద మత్యంతసుఖావహంబు మధుమా ♦ సం బొప్పె భూమండలిన్. 106

క. భువనత్రయ(జయ)యాత్రో, త్సవపరమదనప్రతాప ♦ దహనజ్వాలా
నివహద్యుతు లన వనముల, నవిరళనవపల్లవంబు ♦ లామనిఁ దనరెన్. 107

క. కమనీయవసంతప్రియ, సమాగమప్రభవహర్ష ♦ సమధికపులకో
ద్గమకలనఁ బూనె లతికా, సముదయ మన నూత్నముకుళ ♦ జాలము లెసఁగెన్.

మ. మదభృంగాలకకాంతి కారుకొన శం ♦ భద్గుచ్ఛవక్షోజసం
పద రాణింపఁగ బల్లవావయవశో ♦ భల్ సొంపు దీపింప న
భ్యుదితాంచత్పికభాషితంబు లమరం ♦ బ్రోద్యల్లతాకాంత లిం
పుదలిర్పంగ వయోవిలాసగతులం ♦ బొల్చెన్ మనోజ్ఞాకృతిన్. 109

సీ. తొలుత దక్షిణదిగ్వ ♦ ధూటికి జనియించి, రహి లతాసతులగా ♦ రాము వడసి
కుసుమరసంపుటు ♦ గ్గులు దాఁగి వర్ధిల్లి, కలిరాకుపాన్పుల ♦ నెలమి నుండి

తేఁటిబోటులజోల ♦ పాటలచేఁ జొక్కి, లీలఁ బూఁదీఁగెలు ♦ య్యాల లూఁగి
మురిపెంపుపడకల ♦ ముద్దులు చూపించి, యెల్లతావుల విల ♦ సిల్లి మెలఁగి

సీ. ధరణిఁ దనుఁ గౌఁగిలించుభూ♦జములఁ బొదలి, కొలకులను దోఁగి క్రొవ్విరి♦తోఁటలందు
మల్లులఁ బెనంగి విరహుల♦మదమడంచి, మరునితోఁ డయి పవనుఁడు♦ మాఱుసేఁగె

చ. శిశిరకులంబు ధూమముగఁ ♦ బల్లవముల్ పటుతీవ్రకీలలై
యమరఁగ దక్షిణానిలస ♦ హాయతఁ జేర్చి యశోకగుచ్ఛర
క్తిమఁ బొలుపై వియోగిభయ ♦ కృత్పరితాప మొనర్చె నా వసం
త మనుమహాగ్ని దా హిమవి ♦ తానతిమోదశినప్రవీణమై. 111

ఆ.వె. చూడనొప్పెఁ గుసుమ ♦ శోభితసహకార, భూరుహంబు లపుడు ♦ భూరిచంద
నోజ్జ్వలాంగరాగ ♦ యుక్తాంగు లగుమహా, పురుషవరులువోలె ♦ సరసగతుల. 112

క. చందనశీతలములు సుమ, బృందోహనితాంతగంధ ♦ సారవహంబుల్
మందగతికలితములు సాం, పొందఁగ సుఖమారుతంబు ♦ లోలసెన్ వనులన్. 113

క. లసమానచూతకిసల, యగ్రసనైకకషాయకంఠ ♦ కలకంఠసము
ల్లసితకుహూకోలాహల, విసరము లవ్వేళఁ బ్రబలె ♦ వేడుక లొసఁగన్. 114

క. పికనాదగీతపద్యా, ళ్యకతన్ నర్తనము సేయఁ ♦ దొడఁగె వనం బా
యక పవనక్షిప్తలతా, నికరము గావించెఁ బ్రజలు ♦ చైత్రోత్సవమున్. 115

క. శ్రుతిహితభాషితముఖరత, నతిముద మొనరించు నలరు ♦ కాద్విద్విజసం
తతికి ఫలప్రదుఁడై యం, త్నతి మాధవుఁ డడరె సుపవ♦నశ్రీప్రియుఁడై. 116

మ. శుకపఙ్క్తుల్ లలితేంద్రచాపములు గా ♦ సాంపారుచాంపేయకో
రకముల్ మిందులుగా గళద్బహుసుమ ♦ వ్రాతంబు వర్షోపల
ప్రకరంబై విలసిల్లఁగా వనవా ♦ ద్రిశ్రేణి ధాత్రీస్థలిన్
మకరందామృతవర్షముల్ గురిసె సం ♦ తాపంబు శాంతంబుగన్. 117

ఉ. తమ్మికొలంకులం దిరిగి ♦ దట్టపుఁబుప్పొడితిప్ప లెక్కి భూ
జమ్ములమీఁద వ్రాలి మధు ♦ సారము గ్రోలి మదించి యాచ్చకుం
జమ్ములు దూఱి పక్వఫల ♦ సౌరభలక్ష్మికిఁ జొక్కియాడి భృం
గమ్ములు సంచరించెఁ గుతు ♦ కంబు దలిర్ప వనాంతరంబులన్. 118

చ. భృశశిశిరద్రుమత్తగజ ♦ శోణితసంభవరక్తసిక్తస
న్నిశితవసంతకేసరి వి ♦ [illegible]

తుళసీఁ బలాశపుష్పతతులు • తుందము లుల్లసిలెన్ సమున్నతా
కృళతదిభప్రభేదపరి • కీర్ణసుమాక్షికపుంజమో యనన్. 119

క. సురభోత్సవశాలి వధూ, వరము సుఖస్పర్శ గంధ • వాహము మల్లీ
పరిమళరమ్యదిగంతము, సరసవిహారము వసంత • సమయము వెలసెన్. 120

వ. ఇట్లు నితాంతలతాంతవాసనాసంతోషితసకలజనస్వాంతం బై వసంతంబు నివ్వటిల్లె నంత. 121

శా. ప్రత్యూషప్రభృతిప్రచండదినకృ • ద్భానువ్రజం బుచ్చల
ద్వాత్యాదభ్ర మహాతపస్థనులత • స్వాపంబు తోయావగా
హాత్యుత్సాహకరంబు పాటలమహీ • జారామమిత్రంబు రా
త్రిత్యక్తాయతికంబు గ్రీష్మసమయం • బ్రిం గ్రమ్మె నత్యుగ్రతన్. 122

ఉ. వడముటిగాడుపు ల్విసరెఁ • బాటలముల్ వికసించె సర్పముల్
బడలికఁ జెందెఁ జెల్లుగ న • భంబునఁ బర్వె మహీపరాగముల్
సుడివడె దంతిసంఘములు • సూర్యునిదీప్తికి వాఁడి మించెఁ గా
ల్నడలయి యేరు లింకె విపి • నంబు దహించె దవాగ్ను లత్తఱిన్. 123

ఆ.వె. కరిమముతో నగాధ • విమలోదకమహాహ్రదమ్ము లింకెఁ దపన • తాపమునను
బొరినసంఖ్యలోల • పూర్ణగేహములు దు, శ్శీలనృపునిచేన • శించు భంగి. 124

క. ధరణి భగీరథునితప, స్స్ఫురితను వెలుగంది విధికిఁ • వెలుపంగా ప
త్వరగతి నరిగెడు నన నం, బరవీధికి నెగసె ధూళి • పవనోద్ధతమై. 125

వ. ఆసమయంబున భగీరథుండు పంచాగ్నిమధ్యగతుండై మహాఘోరంబుగాఁ దపంబు సేయుచుండె నంత. 126

గీ. అవని సంతాపశాంతికై • దౌషధంబు, బర్హితాండవసత్క్రియా • భ్యాసగురువు
పథికజనపాదశృంఖలా • బంధనంబు, జాతిబంధువు వర్షావ • సరము దోఁచె. 127

గీ. భూవధూతాపభరశమ • నావతీర్ణ, సమయవిష్ణుకళేబర • చ్ఛాయ లనఁగ
మేఘమాలికలుదయించె • మెఱుఁగు లెసఁగె, నతనిపీతాంబరద్యుతు • లనఁగ మింట

క. ప్రకటతృష్ణామూర్ఛితచా, తకకులసంజీవనౌష • ధంబులు ప్రథమో
దకబిందులు కృషిసంపా, దకములు భువిఁ దొరఁగె సకల • సంధాయకముల్.

క. లలితపచేళిమరసఫ, లములజంబూమహీజ • భాసురశాఖల్
వొలిచె వనంబుల సమ్మృళ • దళిపంక్తులువోలె వారి • దాగమవేళన్. 130

క. చందనమును జంద్రికయును, నిందలపా లయ్యె యామి ♦ నీతలి వృష్టిం
జెందెఁ గృశించె దినంబులు, నిందయ్యె నసహ్యతుహిన ♦ వేళం బ్రజకున్. 153

వ. అట్టిశీతాకాలంబునఁ గంఠదఘ్నజలంబులందు నిలిచి భగీరథుండు నిశ్చలాంతఃకరణుండై తపంబుఁ జేసె. ఇట్లు తపోనిష్ఠుండైనరాజశ్రేష్ఠునకు బహువర్షసహస్రంబులు గడచె నంత బ్రహ్మదేవుండు సుప్రీతుండై సురగణంబులతోఁ గూడి భగీరథునిసమీపంబునకు వచ్చి యమ్మహాత్మున కిట్లనియె. 154

గీ. ఓభగీరథభూపాల ♦ యోమహాత్మ, నీతపంబునఁ బ్రీతుండ ♦ నైతివరము
వేఁడుమనవుఁడు భారతీ♦విభున కిట్లు, లనియెఁ బ్రాంజలియగుచునా♦యవనివిభుఁడు

సీ. ఈశ, వాణీశ, నా ♦ యెడఁ బ్రసన్నుఁడవేని, తెలియఁ దపంబు సి ♦ ద్ధించెనేని
చక్రి నావలన నా ♦ సగరభూపతిసుతుల్, తోయ మందఱును బొం ♦ దుదురుగాక
సగరనందనులభ ♦ స్మము గాంగ జలసిక్త, మగునేని స్వర్గస్థు ♦ లగుదు రభవ
తగ నాకుఁ బుత్రసం ♦ తానం బొసంగుము, నీకృపచేత ని ♦ క్ష్వాకుకులము

గీ. సంతతి నవిచ్ఛిన్నమై వృద్ధిఁ ♦ బొందవలయుం, నిది పరంబగువర మని ♦ నృపుఁడు వేఁడ
నట్లయగుఁగాక యనివరం ♦ బతని కిచ్చి, పలికెఁ గృపఁ జూచి నృపునితో ♦ పద్మభవుఁడు.

వ. ఈగంగ హిమవంతునిజ్యేష్ఠపుత్రిక యిమ్మహాదేవిని ధరించుటకు హరుని నియోగింపుము గంగాపతనంబు భూమి సహింపంజాలదుగావున గంగాధారణంబు సేయ మహేశ్వరుండు దక్క నొక్కరుండు సమర్థుండు లేఁడని భగీరథునకు నుపదేశించి విరించి మరుద్గణంబులతో నిజస్థానంబున కరిగె నంత నమ్మహీకాంతుఁడు భూతలంబున నంగుష్ఠాగ్రంబు మోపి పరమేశ్వరుం బురాణపురుషు, భర్గు, భవానీమనోహరుం గరుణాసముద్రు, భక్తచింతామణి, ననంతు, ననంతకోటిసూర్యప్రభాధాము, నాదిదేవు, మహాదేవు, నుపాసింపుచుండె నంతం బురాంతకుఁడు సంవత్సరాంతంబునం దనకు సాక్షాత్కరించిన. భగీరథుండు భయభక్తిసంభ్రమంబులు డెందంబున సందడింపఁ బులకితగాత్రుండును, ఆనందబాష్పధారాసంపాతస్థగితనేత్రుండును నై యనేకసాష్టాంగనమస్కారంబులు చేసి లేచి లలాటంబున నంజలిపుటంబు ఘటించి యిట్లు నుతించె. 157

మ. కరిచర్మాంబర, కాలకంధర, కన ♦ త్కల్యాణభూభృద్ధను
ర్ధర, కారుణ్యసముద్ర, కంజభవసు ♦ త్రామాదిసంసేవ్యసుం
దరపాదాంబుజ, కామితప్రద, కళా ♦ నాథాగ్రకోటీర, [illegible]
[illegible]ర్బరబాహాహార, కావవే కలితక ♦ ర్పూరాస్మృతాద్భుతప్రభాపీ[illegible] 158

క. ఏణాంకమకుట, భువన, త్రాణధురంధర, కురంగ ♦ ధర, గిరితనయా
ప్రాణేశ్వర, లక్ష్మీశ్వర, బాణా, బాణాదివరద, ♦ పాలింపుమజా. 159

గీ. ఈశు నవ్యయు నమలుని ♦ రీశు ననఘు, నాదిమధ్యాంతరహితు బ్రహ్మాదిజనకు
నిత్యు నిష్కళు నిరపేక్షు ♦ నిగమవేద్యు, నిన్ను సేవింతు ననిశంబు ♦ నీలకంఠ. 160

తోటకము. లలితేందుకళాసుక ♦ లాపధరున్
బలశాసనముఖ్యసు ♦ పర్వనుతున్
ఫలదాయకు శంకరు ♦ భక్తనిధిం
గొలుతున్ జగదీశ్వరు ♦ గోపహాయున్. 161

ఉ. హరి విశిఖంబుగాఁగ భుజ ♦ గాధిపుఁ డుజ్జ్వలమౌర్విగా మరు
ద్గిరిపతి విల్లుగా నిగమ ♦ గీతభుజాబలసంపద న్నిశా
చరనగరత్రియంబుఁ బెలు ♦ చం బరిమార్చి జగత్త్రితయంబు సు
స్థిరముగఁ జేసి కాచినవి ♦ శేషకృపానిధి, నిన్నుఁ గొల్చెదన్. 162

మాలినీవృత్తము. సకలభువనరక్షా ♦ శక్తకారుణ్యదీక్షా
సుకృతిసులభరూపా ♦ సూర్యకోటిప్రతాపా
వికృతరహితమూర్తీ ♦ విశ్వవిఖ్యాతకీర్తీ
ప్రకటితగుణభర్తా ♦ భక్తి నిన్గొల్తు భర్గా. 163

ఉ. పునరపి దేవా 164

మాలిని. కలుషితనిజచిత్తున్ ♦ గర్వశైలాధిరూఢున్
ఖలుని జడుని మోహా ♦ గ్రస్తుఁ దృష్ణాభిభూతున్
మలినచరితు నీచు ♦ న్నన్ను రక్షింపు మర్థిం
గొలిచెదనిను దేవా, ♦ గోచరాన్యప్రభావా. 165

గీ. హరిణధర చూడ నీకు దా♦స్యంబు చేసి, మునులు భవపాశబంధని ♦ ర్ముక్తులైరి
భోగమోక్షప్రదాతవు ♦ నీగుణాను, భావ మెంతని వర్ణింతు ♦ భావజారి. 166

పంచచామరము. లలాటలోచనుం గురంగ ♦ లాంఛనార్ధశేఖరు
న్నిలింపరాజవంద్యపాద ♦ నీరజున్ మహేశ్వరున్
హాలాహలాంకకంధరున్ ♦ మహర్షిమానసాలయున్
జలంధరాదిఘోరదైత్య ♦ శాసనున్ భజించెదన్. 167

గీ. సర్వపాలక జగదీశ ♦ సామగేయ, కమలసంభవవినుత భ ♦ క్తప్రసన్న
లలితనీలాభ్రకంధర ♦ లక్ష్యరూప, ప్రణవగమ్య మహాదేవ ♦ భర్గశరణు. 168

చ. జలధరముక్తసాంద్రనవ ♦ శంబరధారలు దాఁకి కేసరం
బులు విడియున్న తామరస ♦ ము ల్విడనాడి సుగంధికేసరో
జ్జ్వలనుకదంబగుచ్ఛముల ♦ షట్పదపంక్తులు వ్రాలె నెవ్వరుం
గలిగినవారిఁ జేరక జ ♦ గంబున బీదలపొంత నిల్తురే. 131

గీ. నిబిడఘనగర్జితంబుల ♦ నిద్రమాని, సంపతద్వారిధారలఁ ♦ జెంపు వడసి
బహువిధాకారవాదగుం♦ఫనము లెసఁగ, భేకములు గూయఁదొడఁగె సం♦ప్రీతి గదుర.

క. వికచాబ్జనకుటజకదం, బకసేవాలబ్ధసాంద్ర ♦ పరిమళములు కై
తకధూళిధూర్వహంబులు, ప్రకటసుఖస్పర్శ వనజ ♦ పవనము లొలసెన్. 133

క. ప్రావృట్ప్రదోషనీల, గ్రీవసమూర్ధ్వనాట్య ♦ కేళ్యుచితనభః
శ్రీవరధృతఘనమురజా, రావములో యనఁగ మొరసె ♦ రహిఁ గర్జితముల్. 134

చ. శరములలోన నెన్నఁదగు ♦ సారసముల్ పతతాంబుధారలన్
బరువడిఁ బీడఁ గుందుటయుఁ ♦ బాంధులగుండెలు చెండి పైవ భా
సురమతి కాళలంబునఁ బ్ర ♦ సూనశరుం డొనరించి నట్టిబం
గరుశరపత్రికంబులనఁ ♦ గాఁ దగెఁ గేదఁగిరేకు లత్తఱిన్. 135

గీ. అంబుదక్షిప్తవారిధా ♦ రాభిహతుల, దివి నిలువలేక తారక ♦ లవనియందు
వ్రాలెఁగాఁబోలు నని యెంచఁ ♦ బెల్లురేఁగి, కడసివాములుగా వడ ♦ గళ్లు రాలె.

సీ. చిల్వరాపాన్పుపై ♦ శ్రీపతి నిదురించె, కడఁకమై నదులు సా ♦ గరుని జేరె
సస్యవనంబుల ♦ జగతి సొంపు వహించె, సద్వికాసము నొందె ♦ జాతిలతలు
హంసయూధము మాన ♦ సావాసమున కేగెఁ, జాతకంబుల పిపా ♦ సలు శమించె
ప్రక్షీణవశఁ బూనెఁ ♦ బంకజాకరములు, కలకంఠములకు మూ ♦ కత్వ మొదవె

గీ. తపనఘృణులు ఘనాంతరి♦తంబులయ్యె, వివిధపరితాపములఁ గుందె ♦ విరహిజనము
ద్విరదముల కాధి శాంతించెఁ ♦ దొరవరులకు, నంకిలి ప్రసక్తమయ్యె న ♦ య్యవసరమున

గీ. విహగలయమున మాలతీ ♦ వికసనమున, వనరుహానిమీలనంబున ♦ వాసరాంత
మెఱుఁగఁబడుచుండెఁ గాలమే ♦ మఱిక సాంధ్య,విధులు గావించువారిక ♦ వేళయందు

గీ. అఘనాగమవేళ న ♦ య్యవనిభర్త, యచలమును బోలె వారిధా ♦ రాభిషిక్తుఁ
డగుచు మునులకు సద్వ్రతం ♦ బావహిల్ల, నధికదారుణమగు తపం ♦ బాచరించె.

వ. అంత. 140

క. శాం(తములిగ తాంబు)ధరా, శాంతము నృపవిహిత ♦ సమరయానము లక్ష్మీ
కాంతప్రబోధనము ఘన, వంతము శరదాగమంబు ♦ వచ్చెన్ సిరులన్. 141

గీ. విమల మేలుకొన్న ♦ నీరజాక్షునకుఁ ద, త్సమయభృత్యుఁ డాస్య ♦ దర్పణార్థ
మిడిన ముకుర మనఁగ ♦ నుడురాజబింబమ్ము, సుప్రసన్నమగుచుఁ ♦ జూడ నొప్పె.

క. ఉదకములు కుంభసంభవు, నుదయమునఁ బ్రసన్నతాసమున్నతిఁ గాంచెన్
సదమలబోధంబున జన, హృదయంబులు నిర్మలత వ ♦ హించినభంగిన్. 143

క. ఇనకిరణంబులు లఘుతర, ఘనముక్తాయనము లగుచు ♦ గ్రమ్మెన్ దిశలన్
వనజములు చీడ విడి విక, సనలక్ష్మీగృహము లయ్యె ♦ శారదవేళన్. 144

క. శరవణములు వికసించెం, బరిమళభరితంబు లయ్యెఁ ♦ బద్మవనంబుల్
కురిసెన్ ధేనువు లమృతము, నరులు ప్రమోదింప రాజ ♦ సుఖులు పండెన్. 145

క. పరువపల్లవవ మణఁగెన్, పరసులు రాణించెఁ బూచె ♦ సప్తచ్ఛదముల్
కరులు మదించెం దారలు, సురచిరరుచి పూనెఁ దొగలు ♦ శోభిలె మిగులన్. 146

ఉ. సుందరతారకాభరణ ♦ శోభితమై కమనీయచంద్రికా
చందనలిప్తమై విరళ ♦ చారుసితాభ్రదుకూలశాలి యై
యొందవబింబరమ్యముఖ ♦ మై గగనంబు జనంబుచూడ్కికిన్
విందొనరించె భోగిన్నపు ♦ విగ్రహమట్ల నుదారసంపదన్. 147

వ. ఇవ్విధంబున శరత్కాలంబు వికచకమలకమనీయహాసవిలాసంబై విజృంభించె
నంత. 148

క. శ్యామాకుచదుర్గమను, ద్దామాశ్రియపురుషుప్రప ♦ తరమై నిబిడ
క్షోణీతలాకీర్ణశిఖరిషు, హేమంతము దోఁచె బహుళ ♦ హిమజనకంబై. 149

చ. పరువుదలిర్ప బాష్పదీపి ♦ తాగరుధూపసుగంధిమందిరాం
తరముల హంసతూలికల ♦ నంబులపైఁ దరుణీకుచాగ్రని
ర్భరపరిరంభసంగతిసు ♦ ఖంగమదస్థగితోజ్జ్వలద్భుజాం
తరులయి కామతంత్రపర ♦ తం బవళించిరి ధన్యులత్తఱిన్. 150

ఉ. మిన్నక సర్వజీవులకు ♦ మిక్కిలి శైత్యముఁ జూపి నొంచి యా
పన్నులఁ జేసె గాలి యిది ♦ పద్ధతి గాదని తత్కుమారుఁ డు
ద్యన్నయశాలి వహ్ని జన ♦ తాప్రియవృత్తి వహించె నున్నవా
రన్నిటఁ దండికింకరెను గు ♦ ణాధికులై పొగడొందు నందనుల్. 151

గీ. శీతభీతు లగుచు ♦ జేరినమనుజాల, కభయ మొసఁగఁ జాల ♦ దయ్యె నపుడు
భాస్కరాతపమును ♦ పావకజ్వాలలు, నలినముఖులసుస్త ♦ నములుదక్క. 152

వ. అని యనేకప్రకారంబులం గైవారంబు గావించుభగీరథునిం గరుణాశీతలకటాక్షంబుల వీక్షించి విరూపాక్షుండు పలికె నీయెడఁ బ్రసన్నుండ నైతి నీయభిమతంబు గావించెద శిరంబున గంగను ధరించెద నని యాదరించి వరం బిచ్చె. భగీరథకృతం బయినశివస్తోత్రంబు పఠించువారు సకలమనోరథలాభంబును సమస్తపుణ్యఫలంబునుం బొందుదు రంత నప్పుడు సర్వలోకనమస్కృత యగుగంగామహాదేవి హిమవత్పుత్రిక మహారూపంబును దుస్సహవేగంబునుం బూని యాకాశంబున నుండి శివుని శిరంబునం బడి మస్తకంబుతోఁ బినాకహస్తునిం గొని పాతాళంబునకు నరుగం దలంచిన శంకరుం డాగర్వంబు సహింపక కోపించి తిరోభావంబు నొందించె నట్లు రుద్రజటామండలగహ్వరంబు ప్రవేశించి గంగ బహుయత్నంబు గావించియు నిర్గమింప నేరక సమ్మోహితయై యమ్మహాదేవి బహుసంవత్సరంబులు పరిభ్రమించె. భగీరథుండును గంగం గానక మహాతపంబుఁ జేసి పరమేశ్వరునిం బ్రార్థించిన. 169

ఆ.వె. భక్తవత్సలుఁడు ♦ పరమకృపాశాలి, శంభుఁ డంత నుగ్ర ♦ సన్నుఁ డగుచు
గర్వశాంతిఁ జేసి ♦ గంగను విడిచెను, జడలవలన బిందు ♦ సరమునందు. 170

వ. ఇట్లు శివునిజటాజూటంబువలన గంగ నిర్గమించునెడ సప్తప్రవాహంబులు జనించె నందు హ్లాదినియుఁ బావనియు నళినియు ననుమూడుగంగాప్రవాహంబులు పూర్వదిశకుం జనియె. సుచక్షువు, సీతయు, సింధువు, ననుమూఁడునదులు పడమటిదెసకు నరిగె. సప్తమియగుగంగ భగీరథు ననుసరించె నంత. 171

సీ. రాజర్షి యగుభగీ ♦ రథుఁడు రథారూఢుఁ, డై యేగె ముందట ♦ నతిముదమున
నారాజువెనువెంట ♦ నరిగె గంగానది, తండ్రివెంబడి జను ♦ తనయమాడ్కి
గగనంబువలన శం ♦ కరుమస్తకముఁ జేరి, శివునియాదలనుండి ♦ భువికి డిగ్గి
ప్రవహించెఁ దీవ్రశ ♦ బ్దపురస్సరంబుగా, గంగాజలంబు వే ♦ గంబుగదుర

గీ. బహువిధాకారసంపత ♦ త్పతితకలిత, మత్స్యకచ్ఛపఫణిశింశు ♦ మారతతుల
చేత నచ్చట(దివివోలె) ♦ చిత్రభంగి, నవని గనుపట్టె మిగుల న ♦ య్యవసరమున.

వ. ఆయ్యవసరంబున నద్భుతతమగంగాపతనదిదృక్షాసమాగతదేవగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషవియచ్చరవిమలమణిమయాభరణతేజఃపుంజరంజితం బై గగనంబుఁ యుగపదభ్యుదితశతతపనమండలంబువోలె స్వచ్ఛందచరంబులు చంచలదుర్వారశింశుమారమీనోరగమాలికాభివ్యాప్తంబై విక్షిప్తవిద్యుల్లతాపరివృతంబునుంబోలె రాణింప నిజవిశాలజజ్జీవనకృతమజ్జనప్రజాపరాతిత్యసత్యతాపత్రయ యుఁజన సార్థంబునుంబోలె సంస్పృష్టవిష్ణుపదంబులై పవిత్రతరతరంగంబులు నెగడ దివ్యాంగనయునుంబోలె

చక్రిస్తనియు హంసమేఘమాలయు నావర్తనాభియుం గమనీయకంకణోర్మికాల
కృతియునై నేత్రోత్సవంబు సంపాదింపుచు నిటలనయనజటాకటాహపరిభ్రమణ
సమయసమాహృతతదవతంసశిశిరకరసుధారసధారానిష్యందసందోహంబులుంబోలె
మహామధురంబులై నిర్యదచ్ఛఫేనచ్ఛలంబునం గార్తికమాసరాకామధ్యగతచంద్రి
సాంద్రచంద్రికల నపహసించుచందంబున విమలాంబుపూరంబులు విజృంభింప వా
తోద్ధూతశీతలశీకరపరంపరలు నిజావలోకనసంభ్రమభ్రమదంబరచరతరుణీపరిశ్రమా
పనోదకంబులై చెలంగఁ గుపితకపిలమునికుపితవపుర్ఖలసగరనృపసుతసురపదారో
హణసుభగసోపానరంగత్తరంగకేళీసుఖాంగీకారభంగీతరంగితాంతరంగరాజహంసమాలి
కామధురస్వరంబులు మునిజనస్తుతిపఠనరవంబులతోడ నేకీభవింప సముచ్ఛలజ్జలచ్ఛ
టాపటలంబు విలులదుత్తుంగవీచీసంఘాతసంజాతవాతోద్ధూతగిరిశిఖరధాతుధూళి
పాళికల నపనయింప సగరరాజకుమారవర్గదుర్గతిదశాపరిశమనమహోద్యోగనిరాఘా
టధాటీసమాటీకనప్రభూతస్రోతోవేగవిపాటితకుధరకూటపతనప్రభవగభీరగుభగుభ
నాదార్భటులు పర్వతగుహాంతరంబులఁ బ్రతిధ్వానంబు లీన శుద్ధస్ఫటికఘుటికాని
కాయచ్ఛాయాదాయాదతోయబుద్బుదంబులు సద్యోవికచహృద్యకైరవసభాశంక
నంకురింపంజేయ ఘోరతరాంహస్సంహతివిజయభేరీభయదభాంకారీకృతవికృతఢాక
ల్లోలకల్లోలసంఘసంఘర్షణప్రాదుర్భవదుర్భరదీర్ఘఘర్ఘరఘుమంఘుమనిర్ఘోషంబులు చె
లంగ నిశాతయాతనాహేతుమహాపాతకభీతప్రాణిపరిత్రాణప్రాదుర్భూతపరమేశ్వ
రపరిశుద్ధమూర్తియుం బోలె. మూర్తిమద్భగీరథపృథివీధవధవళమహాకీర్తియుంబో
లె భరతఖండమహీమండనాయమానమనోహరిముక్తాహారలతికయుంబోలె ముక్తిల
క్ష్మీజయపతాకయుం బోలె గంగాతరంగిణి వెలసి విలసిల్లి విస్తరిల్లి వినోదించి వి
హరించి పెరుగుపరచి విజృంభించి విక్రమించి 'వివిధగతివిశేషభూషితవిలాసంబులు
గాఁపుచు గిరులు భేదింపుచుఁ దరులు గూలించుచు విపినంబులు ముంచి పరివేష్టింపు
చు నొక్కచోట సత్వరంబును నొక్కయెడఁ గుటిలంబును నొక్కవంక నాయతం
బును నొక్కచక్కి వినదంబును నొక్కతెరి సముద్ధూతంబును నొక్కతావున మం
దంబుగా నరుగుచు నొక్కచో నున్నజలంబుతో జలంబు గలసి పునరభ్యాగతంబు
గా మాటిమాటికిం దేటలగు నీటివెల్లులు వింటికి నెగసి పుడమిం బడుచుండ భగీరథ
రథానువర్తినియై ప్రవహించె నిట్లు గంగాజలంబు లంబరంబుననుండి ఖండపరశుని
శిరంబున దుమికి కుప్పించి యచ్చోటనుండి విచ్చలవిడిగాఁ బుడమిం బడి సొంపు
సంపాదించి శైలంబులు లంఘించి కానలు గడచి బహుదేశంబు లతిక్రమించి ప్రా
కారంబు లొరసి గ్రామంబులు వలగొని యారామంబులు పొరసి నడుచుచున్నతఱి

నమ్మహాదేవి ననుసరించి కొందఱు బృందారకులు విమానారూఢులై కొందఱుసుపర్వులు గంధర్వంబులెక్కి కొందఱు యాగభుజులు గజాశ్రయులై కొందఱుసురలు పారిప్లవగతులై కొలిచి చనిరి. మఱియు ఋషులు గంధర్వులు యక్షులు కిన్నరలు దైత్యదానవరాక్షసోరగగరుడచారణఖేచరులును భగీరథునిరథంబు ననువర్తించి గంగవెనువెంటం జనిరి. దేవర్షిగంధర్వాదులును భూలోకవాసులును మహాదేవాంగపతితం బగుగంగాజలంబు పరమపవిత్రం బనిస్పృశించిరి. శాపవశంబునం బుణ్యలోకపరిభ్రష్టు లగువారు గంగోదకంబులం దోఁగి విగతకల్మషులై వెండియు నిజస్థానంబుల కరిగిరి. సకలలోకనివాసులును కృతాభిషేకులై సంతోషించిరి. ఇట్లు సర్వభువనపావనియు సరిచ్ఛిరోమణియు నిఖిలదురితక్షయకారిణియు నైనగంగ భగీరథప్రయత్నంబునం గదలి యమ్మహానుభావుం డెచ్చోటికిం జనియె నచ్చోటికిం దానునుం బోవుచుఁ దద్రథానువర్తినియై ప్రయోగంబుననుసరించువ్యాకరణవిద్యయుంబోలె వేదార్థంబు ననుసరించుస్మృతి తెఱంగున నమరి గాయత్రియుం బోలె ప్రశస్తవర్ణయై కుబేరపురివోలె శంఖముకరకచ్ఛపాదివిరాజమానయై దేవసభవోలె బహువిబుధాశ్రితయై యుత్తమధేనువుపోలె బహుక్షీరవాహినియై భాగ్యవతియుం బోలెఁ గంకణోర్మికాలంకృతయై పుణ్యంబులకు మూలంబును భవంబునకు భేషజంబును ముక్తికిఁ దెరువును మునులకుఁ బ్రాప్యును శుభంబులకు నాధారంబును జ్ఞానంబునకు ధామంబును నగుచుం బ్రకాశించె నంత. 173

చ. శమితసమస్తకల్మషుఁడు ♦ జహ్నుమహాముని వేదచోదిత
క్రమమున దీక్షఁ గైకొని మ ♦ ఖం బొనరింపుచునున్న గంగ గ
ర్వమునఁ గడంగి తత్సవన ♦ వాటికఁ బెల్లుగ వెల్లి ముంచె న
య్యమితతపోబలాఢ్యుఁడు త ♦ ద్వాగ్రహవృత్తి నెఱింగి కోపియై. 174

ఉ. తజ్జలపూర మంతయును ♦ ద్రాగె నతం డది చూచి మేదినీ
భృజ్జిముఖర్బుధాదు లగు ♦ వేల్పులు మానులు విస్మితాత్ములై
వజ్జలఁ జేరి కోరి బహు ♦ భంగుల నమ్మునిఁ బూజసేసి భా
స్వజ్జయ నీకుమారిగ వె ♦ సన్ సృజియింపుము గంగ నిత్తఱిన్. 175

క. అని వినయంబున సురలును, మునులును బ్రార్థింప జహ్ను ♦ ముని ముదితుండై
తన చెవులవలనఁ గ్రమ్మఱ, ననిమిషగంగను సృజించె ♦ నందఱు వొగడన్. 176

ఆ.వె. దానఁ జేసి జహ్ను ♦ తనయనా జాహ్నవి, యనఁగఁ బేరుగాంచె ♦ నమరగంగ
యమ్మహానదీరంతి ♦ క్రమ్మఱ నరిగె భ, గీరథక్షితీశు ♦ (తేరి)వెంట. 177

క. ఈగతిఁ జనితని జాహ్నవి, సాగరముం జేరి యటక ♦ పాతాలమునకున్
వేగమునఁ దుఱఁగ నరిగెన్, సాగరసంతరణకర్మ ♦ సంసిద్ధికినై. 178

చ. ఘనుఁ డధికప్రయత్నమున ♦ గంగను దోడ్కొని యాభగీరథుం
డును గపిలాక్షిపావకప ♦ (టుస్ఫు)టకీలల భస్మరాసులై
తునిసినతాతలం గని సు ♦ దుఃఖితుఁ డయ్యె సమస్తదోషనా
శన సురవాహినీసలిల ♦ సంప్లుత మయ్యెఁ దదీయభస్మమున్. 179

క. జగదేకనుత భగీరథ, జగతీశానీతదేవ ♦ సరిదాప్లుతులై
విగతాఖిలపాతకులై, సగరసుతుల్ చనిరి దివిజ ♦ సదనంబునకున్. 180

ఉ. అంతట భారతీరమణుఁ ♦ డచ్చటికిం జనుదెంచి మేదినీ
కాంతునితోడ నిట్లను జ ♦ గద్ధితపౌరుష నీపితామహుల్
సంతతపుణ్యలోకసుఖ ♦ సంపదఁ గాంచిరి మానిరాజకు
ద్రాంతతపోబలస్థితులు ♦ తారితులైరి సమస్తసాగరుల్. 181

క. క్రతుభుజులభంగి స్వర్గ, స్థితులైరి మునీంద్రశాప ♦ జితులు సగరరా
ట్సుతు లరువదివేవురు నీ, కతమున నిక్ష్వాకువంశ ♦ కమలవనరవీ. 182

గీ. విమలచారిత్ర వినుము లో ♦ కమున నెంత, కాల మొప్పఁగ నుండు సా ♦ గరజలంబు
స్వర్గమున నంతకాలంబు ♦ సగరతనయు, లుండెదరు వేలుపులమాడ్కి ♦ నిందువేడ్క.

వ. మహాత్మా యీగంగ నీకుం బుత్రిక యగు నీవలనం గలుగు నామంబున భాగీరథి యన లోకంబున నుండు స్వర్గమర్త్యపాతాళలోకంబులను మూఁడుపథంబులం బూనుటఁ జేసి త్రిపథగ యనం దగు నీగంగయందు నీపితామహులకు నందఱకిం దర్పణంబు సేయుము నీప్రతిజ్ఞఁ జెల్లింపుము మహాతపస్కులును మహర్షిసములును మహాకీర్తిమంతులును మత్సమానులును నైనసగరాంశుమద్దిలీపులు నీపూర్వులు గంగానయనంబునందు మహాయత్నంబు సేసియు మనోరథసిద్ధిఁ బడయరైరి. అట్టిప్రతిజ్ఞ నీకు సిద్ధించె. ఇతరదుర్లభంబును శాశ్వతంబును నైనకీర్తిం బొందితివి. ధర్మనివాసంబ వైతివి కలకాలంబు గంగాస్నానంబు సేయుము పితామహులకు జలకర్మ లాచరింపుము నీకు లగ్గగుం బోయివచ్చెద నని బ్రహ్మదేవుండు దేవలోకంబునకుం జనియె. అంత భగీరథుండు యథాక్రమంబుగా సాగరులకు నుదకంబు లిచ్చి కృతకృత్యుండు విజ్వరుఁడును నై సకలలోకశ్లాఘనీయపుణ్యశ్లోకుండు తనపురంబున కరిగి రాజ్యంబు శాసింపుచుండె. అమ్మహారాజు నాశ్రయించి సమృద్ధార్థులై జనులు సుఖించిరి. ధనకరంబు యశస్కరంబు నాయుష్కరంబుఁ బవిత్రీకరంబు

స్వర్గకరంబును నగునీగంగావతారమహోపాఖ్యానంబు విప్రక్షత్త్రియవైశ్యులు శూ ద్రులు వినుపించువారికి వినువారికి సకలపాపంబులు నశించు మనోరథంబులు ఫలించు. నాయుఃకీర్తి సంపదలు వర్ధిల్లు దేవతలుం బితృదేవతలును ప్రీతిం జెంది యుష్టార్థంబు లిత్తురు. ఈగంగావిస్తారంబు తొల్లి శ్రీరామునకు విశ్వామిత్రుండు చెప్పినచొప్పున మీకు వివరించితి నని సూతుండు పలికినం బరమవిస్మితులునుం బ్రహృష్టాంతరంగులు నగుచు శౌనకాదిమునీశ్వరులు పరమాద్భుతకరం బగుగంగావతరణంబు సెప్పితివి. కృతార్థుల మైతిమి. గంగాకథానుధారసపానంబుకలనం దనివి దీరకయున్నవారము మఱియు నమ్మహాదేవిమాహాత్మ్యంబు వివరించి మమ్ము సుతృప్తులం జేయు మని ప్రార్థించిన. 184

ఆశ్వాసాంతపద్యములు.

శా. వేదాంతప్రతిపాద్యవైభవ జగ ♦ ద్విఖ్యాతచారిత్ర గౌ
రీవక్త్రైరవకైరవాప్త కరుణా ♦ ర్ద్రీభూతచేతోబ్జ స
ర్వాదిత్యాభిమతార్థదాయక యనం ♦ ఖ్యాదిత్యసంకాశ రా
గాదిత్యాగిమునీంద్రగమ్యపద పూ ♦ ర్వాదిత్యగర్వాంతకా. 185

క. వేదండచర్మధర గిరి, కోదండ విముక్తమదన ♦ గురుసాయకధా
టీదండితపుర బుధజన, తాదండప్రణతిలోక ♦ తమనఃకమలా. 186

మాలిని. భుజగరచితహారా ♦ భూతికారుణ్యపూరా
వృజినఘనసమీరా ♦ వేదవీథీవిహారా
రజతసితశరీరా ♦ రమ్యదివ్యావతారా
విజితమార(కుమారా) ♦ వేదమంత్రార్థసారా. 187

గద్య—ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుగు
లక్ష్మణకవిరాజపుత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ
లక్ష్మణకవినామధేయప్రణీతం బైనజాహ్నవీ
మాహాత్మ్యం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ.

శ్రీమత్పరదేవతాయైనమః.

# జాహ్నవీమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీమత్కామయమంత్రి, క్షేమస్థైర్యాయురధిక ♦ కీర్తిప్రసిద్ధ సు
త్రామార్చిత వెంటురిపుర ♦ ధామా సోమేశ సంత ♦ తకృపావేశా.

వ. దేవా యవధరింపుము. శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. 2

క. గంగాగుణవైభవము భు, జంగకులాధీశ్వరుండు ♦ శశిశేఖరుఁడున్
సాంగంబుగ వక్కాణిం, పం గుశలులు గారు కాఁడు ♦ పద్మభవుండున్. 3

వ. అట్లుగావున మాదృశజనులకుఁ దద్గుణలవంబును వచింపనశక్యంబై యుండు నైనను నాయెఱింగినతెఱంగున గొంతవివరింతు. దత్తావధానులరై యాకర్ణింపుఁడు. ఈయర్థంబున నొక్కయితిహాసంబు కలదు. అది విన్న మీరడిగినయర్థంబు తేటపడుఁ దొల్లి కార్తవీర్యుఁడు చక్రవర్తి మీరు నన్నడిగినవిధంబున మహాయోగియగు దత్తాత్రేయు నడిగిన సమ్మహారాజున కమ్మహాత్ముం డిట్లనియె. 4

గీ. యజ్ఞములు దానములు సదా ♦ ధ్యాపనంబు, వ్రతములుపకారములుసుప ♦ వాసములును
సాటిగాలేవు జాహ్నవీ ♦ స్నానమునకు, నని మునులు చెప్పుదురుభూవ ♦ రాగ్రగణ్య.

వ. ఈవిషయంబున నితిహాసంబు కలదు వినుమని యిట్లనియె. 6

గీ. ప్రథమయుగమునఁ దొల్లి సం ♦ పదలకెల్ల, భవనమై యొప్పు నైషధ ♦ పట్టణమున
హేమకుండలుఁ డనువైశ్యుఁ ♦ డిద్ధబుద్ధి, భూరిధనధాన్యశాలియై ♦ పొదలుచుండు.

సీ. వాఁడు స్వధర్మంబు ♦ వదలక తృణకాష్ఠ, ఫలమూలలవణశం ♦ దులలవంగ
మలయజాగురుకుంకు ♦ మంబులు ధాతులో, హాదులు గోమహి ♦ షాశ్వకుంజ
రోష్ట్రమేషాదులు ♦ నొగి సంగ్రహించి త, త్క్రయవిక్రయంబులఁ ♦ గలుగులాభ
మాదిగా బహువిధో ♦ పాయంబుల సువర్ణ, మెనిమిదికోట్లు సం ♦ పెనయఁగూర్చె

గీ. నంత గడ్డంబు నెరసిన ♦ నతఁడు దేహ, మస్థిరం బని తలఁచిధ ♦ ర్మార్జనైక
బుద్ధిఁ జెఱువులు దేవళం ♦ బులును బావు, లన్నసత్రంబులును నిల్పె ♦ నన్నియెడల.

గీ. ఇట్లు షష్ఠాంశమగుధనం ♦ బెల్ల దాన, ధర్మములకు విభాగించి ♦ ధరణిసురుల
నఖిలవిద్యావిశారదు ♦ లైనవారి, కర్థితో నిచ్చె ధర్మమి ♦ ట్లతఁ డొనర్చె. 9

వ. ఇట్లు సకలధర్మంబు లుపార్జించి మిగిలినధనం బంతయు శ్రీకుండలవికుండలులను నామంబులం గడువిదితులైనపుత్రులకు నిచ్చి విరక్తుండై. 10

క. వనమున కరిగి మహాతప, మొనరించి కృతార్థుఁ డగుచు ♦ నొకపుణ్యమహా
ధునిచెంత హరిని దలఁచుచుఁ, దనువు విడిచి యతఁడు విష్ణు ♦ ధామముఁ జేరెన్.

వ. అంత నతనికుమారులు శ్రీకుండలవికుండలు లనువారు ధనయౌవనమదోన్మత్తులై సురాపానాదిదుర్వ్యసనంబులం దవిలి నటవిటగాయక వారకాంతాదిగోష్ఠియం దనురక్తి వహించి తల్లిమాట యించుకంతయు విననొల్లక ప్రల్లదులై యెల్లధనంబు వెల్లిజల్లి బంధుజనంబులు నిందింప నాతతాయులై చిత్రవిభ్రాంతిం దిరుగుచుండం గొంతకాలంబునకు ధనంబంతయు నశించి లేమి వాటిల్లిన. 12

క. తినఁ గూడుఁ గట్ట బట్టయుఁ, గనలేక కృశించి కుంది ♦ కడు నప్పు లొసం
గినవారికి వెగ్గలి పుర, మున నుండన్ వెరచి వారు ♦ వోయి రడవికిన్. 13

చ. అడవికిఁ బోయి ధన్వవిశి ♦ ఖాదులు పూని కిరాతయుక్తులై
కడుకడి వేఁటకుం జని మృ ♦ గంబుల లెక్కకు నెక్కుపక్షులన్
గెడపి తదీయమాంసములో ♦ గిన్ భుజియించుచుఁ గాలవీగతిన్
గడపుచు నీచవర్తనము ♦ గైకొని వారు చరించి రుద్ధతిన్. 14

సీ. ఒకనాఁడు గహనమ ♦ ధ్యవ్యాఘ్రదురాసద, భూధరగహ్వరం ♦ బులకు వేఁట
కరిగినయెడఁ గోప ♦ భరితమైయొకపులి, శ్రీకుండలుని నొక్క ♦ భీకరోర
గంబు వికుండలుఁ ♦ గరచిన మృతిఁబొంది, తక్కాననలోపల ♦ దిక్కులేక
యున్న్యెడ యమదూత ♦ లవ్వైశ్యపుత్రుల, నతిదీర్ఘపాశసం ♦ యుతులఁ జేసి

గీ. పారి యమునిసన్నిధికిఁ గొని ♦ పోయి దురిత, శీలురగువారిఁ జూపినఁ ♦ జిత్రగుప్తు
మొగము గనుఁగొని పలికె య ♦ ముండు నరక, మునకువీరలనొక్కని ♦ జనుపుఁడనుచు

గీ. ఒకని నిందునికడకు ♦ నొయ్యనగొనిపొండ, టంచు యముఁడు పనుప ♦ నట్లు వారు
చేరి నారకమున ♦ శ్రీకుండలుని ద్రోచి, యావికుండలునకు ♦ ననియెదూత. 16

క. రమ్ము వికుండల సురలో, కమ్మున కీవిపుడు పుణ్య ♦ కర్మార్జితభో
గమ్మనుభవింప నరుఁడు ము, దమ్మున యమదూతతో న ♦ తం డిట్లనియెన్. 17

వ. అయ్యా మదీయచిత్తంబు విస్మయాయత్తం బయ్యె నతండును నేను నన్నదమ్ములము నొకతల్లికడుపునం బుట్టినవారము. ఏకర్మంబయిన నేకవాక్యతం బొరసి చేసి

యెన్నండును జలఁబాయక యున్నవార మట్లగుటం జేసి మాకు మరణం బొక్క-
చోటునఁ బ్రాపించె. ఇట కిద్దఱము వచ్చితిమి మాయన్నను నరకంబునకుఁ ద్రో-
చి నన్నేటికి నాకలోకంబునకుం గొనిపోయెదు. అతనికంటె నేనేమిపుణ్యం-
బాచరించితి నన్ను మన్నించి యున్నరూపు తేటపడం జేయుమనిన వికుండలునకు
దండధరునిదూత యిట్లనియె. 18

సీ. తల్లిదండ్రులు నన్ను ♦ దమ్ములు నాలుబి, డ్డలు నాఁగ జగములఁ ♦ గలుగువారు
పూర్వకర్మోచిత ♦ భోగసంప్రాప్తులై, మమతఁ గూడుదు ♦ రొక్క-మందిరమున
నేకవృక్షమున న ♦ నేకప్రకారశ, కుంతగణంబులు ♦ గూడియున్న
పగిది భార్యాసుత ♦ ప్రభృతులు కూడుదు, రొకచోట నొకవేళ ♦ నొకరి నొకరుఁ

గీ. బాసిపోదురు నిజకర్మ ♦ పరతఁ జేసి, యవని నెవ్వార లేకర్మ ♦ మాచరింతు
రట్టికర్మఫలంబు వా ♦ రనుభవింపఁ, బోదు రది మాన్ప నేరికిఁ ♦ బొసఁగ దనఘ.

ఆ.వె. కాన నతఁడు పాప ♦ కర్మవశంబున, భయదనరకకూప ♦ పతితుఁ డయ్యె
సాధుశీల పుణ్య ♦ శాలివి గావున, నాకలోకసుఖము ♦ నీకుఁ గలిగె. 20

చ. అనిన వికుండలుం డనియె ♦ నయ్యమదూతకు నోమహాత్మ నా
జననము ఘోరపాతకము ♦ సల్పినఁ గన్గొఁ బరాకుచేతనై
నను సుకృతంబు సేయ నొక ♦ నాఁడు నొకింతయు నీవు నాయొన
ర్చినశుభకర్మ మెయ్యెదియొ ♦ చెప్పుము నావుఁడుఁ బల్కె దూతయున్: 21

సీ. సకలభూతసమూహ ♦ (సుకృత)దుష్కృతములు, వినుమయ్య నాయెఱుం ♦ గనివి లేవు
మునునీవు హరిమిత్ర ♦ తనయుఁడు త్తముఁడుధ, ర్మాత్ముఁ డొప్పునుమిత్రు ♦ డనఁగ నొకఁడు
వానితో సాంగత్య ♦ వశమున యమునతోఁ, గలసినగంగకు ♦ నెలమి నేగి
మాఘమాసమున న ♦ మ్మహితతీర్థనిమజ్జ, నంబుఁ జేసితివిదిన ♦ ద్వయంబు

ఆ.వె. గంగయందుఁ జేయఁ ♦ గల్గినయొకమజ్జ, నమునఁ గల్మషమ్ము ♦ సమసె నొక్క-
నాటిమజ్జనమున ♦ నాకంబు చేకూరె, నమరలోకసౌఖ్య ♦ మనుభవింపు. 22

క. నీయన్నపాతకములకు, నాయతనం బగుటి రౌర ♦ వాదికనరక
స్థాయి యయి పెద్దకాలము, పాయనికష్టంబుఁ జెందుఁ ♦ బావనచరితా. 23

క. అని చెప్పిన నంతకభృ, త్యునివచనము లాలకించి ♦ దుఃఖము పొదం
బును మనమునఁ జెనఁగొన ని, ట్లనియె వికుండలుఁడు సువిన ♦ యము దలకొత్తన్.

వ. మహాత్మా సర్వజ్ఞుండ వగునీవలన ధర్మాధర్మప్రకారంబు వినఁగోరెద నన్ను సౌ-
ఖ్యంబున సాదరించి యెఱింగింపుము పెద్దలగువారు సప్తపదంబులు కూడి నడచిన

వాని సాధునింగాఁ జూతు రని ప్రార్థించిన నయ్యమదూత నీవు గతకల్మషుండవు గావున నీహృదయంబున ధర్మాకర్ణనకుతూహలంబు సంభవించె నీవడిగినయర్థంబు వివరించెద నేకాగ్రమనస్కుండవై యాకర్ణింపు మని యిట్లనియె. 25

ఆ.వె. మానసంబుచేత ♦ మాటలచేతఁ గ, ర్మంబుచేత నెపుడు ప్రాణిహింస
సేయఁబూనువాఁడు ♦ చేరు దుర్గతులకుఁ, దగ నహింస పరమ ♦ ధర్మ మనఘ. 26

క. ఖ్యాతి నహింస్యాత్సర్వా, భూతాని యటంచు వేద ♦ ములు బోధించున్
భూతహితార్థము శుభచరి, తా తెలియ నహింస పరమ ♦ ధర్మం బనియున్. 27

సీ. మశకకీటకదంశ ♦ మత్కుణప్రభృతిదు, ర్బలజంతుకులములఁ ♦ బరమకరుణ
రక్షించుసుకృతులు ♦ వీక్షింపరు దురంత, నరకముల్ తమపాట్ల ♦ కొఱకుఁ గవిసి
జలచరస్థలచరం ♦ బుల వధియించువా, రలు కాలసూత్రసం ♦ ప్రాప్తులై ని
జాంగమాంసాశను ♦ లగుదు రక్తంబు ద్రా, గుచు మొఱ్ఱవెట్టుదు ♦ ఘోరనరక
గీ. నిలయములఁ బెద్దగాలంబు ♦ నిలిచి యడలి, స్థావరత్వము నొంది య ♦ త్యంతమూఢ
భావకలితతిర్యగ్యోని ♦ బహుశతముల, బొనసి జన్మించి కష్టంబు ♦ లనుభవించి. 28

వ. పదపడి జాత్యంధులును పంగువులును మూగలు దరిద్రులును నై పొడముదు రట్లు గావున. 29

క. పర మెఱిఁగి నరుఁ డహింసా, నిరతుఁడు గావలయు వినుము ♦ నిఖిలనదుల్ సా
గరుఁ జేరుభంగి ధర్మము, లురుపుణ్య మహింసయందు ♦ నొప్పఁగనుండున్. 30

వ. మఱియు జితేంద్రియులును నిజవర్ణాశ్రమధర్మనిష్ఠులును బ్రహ్మలోకంబుఁ బొందుదురు. ఇష్టాపూర్తరతులును పంచయజ్ఞంబు లనుష్ఠించువారలును భూతదయాపరులును నిరయంబుఁ జూడరు. వే(దవా)దులు నగ్నిపూజకులు స్వర్గంబున వసింతురు. రణమృతు లగుశూరులు సూర్యమండలము భేదించి పుణ్యలోకంబునకుం బోదురు. దీనవనితావిప్రరక్షణార్థంబు ప్రాణంబు విడిచినవారును బాలవృద్ధబంధుదరిద్రులం బోషించినవారును దివ్యలోకంబుఁ గాంతురు. పంకంబున మునిఁగినగోవును రోగపీడితుఁడైనబ్రాహ్మణుని సముద్ధరించినపుణ్యులకు నశ్వమేధయజ్ఞఫలంబు సిద్ధించు నీరును బూరియు నిడి కొట్టక తిట్టక యుపేక్షింపక గోవుల సేవించిన మహాత్ములు గోలోకవాసు లగుదురు. సకలప్రాణులకు నుదకదానంబుఁ గావించినయుత్తములకుఁ బ్రాణదానఫలంబు లభించు వాపీకూపతటాకంబులు నిర్మించినధర్మాత్ము లందు జలం బెంత(కాలంబు)నిలుచు నెన్నిజంతువులు ద్రాగునన్ని వేలయేండ్లు దివంబున సుఖింతురు. నిర్జలభూములయందుఁ బానీయశాలలు నిలిపినభాగ్యవంతు

లక్ష్మియలోకంబుల నధివసింతురు. అశ్వత్థకపిత్థబిల్వనింబామలకతింత్రిణీమాతవన ప్రతిష్ఠాపకులు యమలోకదర్శనంబు లేక నాకంబునం గ్రీడింతురు మఱియును. 31

గీ. గుబురుకొనునట్టినీడలఁ ♦ గొరలి తెరవు, చెంత నొప్పారుఫలతరు ♦ శ్రేణులొసఁగు
సుకృతిగరిమంబునకుఁ జూడ ♦ జోడుగావు, సద్గుణాకర హయమేధ ♦ శతములయిన.

క. పక్షుల కాశ్రియ మగుఫల, వృక్షంబులు నరకుపాప ♦ వృత్తుల ధర్మా
ధ్యక్షుభటుల్ నరకానల, నిక్షిప్తులఁ జేతు రధిక ♦ నిర్దయవృత్తిన్. 33

క. ఒకరావియు నొకవేపును, నొకమఱ్ఱియు వెలగ బిల్వ ♦ ముసిరికయును బా
యక మూఁడుమూఁడుతింత్రిణు, లొకపదియును మావిమ్రాను ♦ లొకతొమ్మిదియున్.

క. నిలిపినవారును నరకం, బులు చూడక దేవలోక ♦ మున వసియింతురు
తులసీవన మఖిలవనం, బులలో నెక్కుడగుఁ బరమ ♦ పురుషార్థకమై. 35

క. తులసీకానన మెవ్వని, నిలయంబున నుండు వాని ♦ నిలయము తీర్థం
బిల నయ్యింటికి యమదూ, తలు చన రచ్చోటు సుకృత ♦ ధామం బగుటన్. 36

సీ. తులసీదళామోద ♦ మొలమి నాఘ్రాణించు, మనుజోత్తములు గయ ♦ ల్కొంతునెక్కి
పోదురు వైకుంఠ ♦ పురికి ద్వాదశియందు, జలజోద్భవాదులు ♦ తులసిపూజ
సేతురు గావున ♦ శ్రీహరిహరులఁ ద, ద్దళముల నర్చించు ♦ ధన్యజనులు
వైకుంఠ కైలాస ♦ వాసులై లక్షయు, గంబులు విహరింతు ♦ రంబుజాక్షుఁ

గీ. డాదియగుపర్వసురలు గం ♦ గాదినదుల, తోడ నామ్నాయములతోడఁ ♦ దులసియందు
నధివసింతురు చూతస ♦ హస్రపోష, ణమునఁ దులసీతరుస్థాప ♦ నంబు సమము. 37

క. శంకరపూజారతులును, శంకరశుభనామమంత్ర ♦ జాపకులును ని
శ్శంకంబుగ వసియింతురు, శంకరలోకమున సురలు ♦ సన్నుతి సేయన్. 38

ఆ.వె. కపటలోభమోహ ♦ కామహాస్యంబుల, నొండె నధికరత ♦ నొండె శివుని
దలఁచువారు మఱచి ♦ తప్పియు యమలోక, మునకుఁ బోరు నిక్క ♦ మనఘచరిత.

చ. స్ఫటికశిలాసువర్ణమయ ♦ పార్థివలింగము లాచరించి ధూ
ర్జటికి మహోపచారముల ♦ శాంభవమంత్రము లుచ్చరింపుచుం
బటుతరభక్తి శోభిల స ♦ పర్య యొనర్చినవాఁడు గూఢపా
తకటకనిపీటి నెప్పుడును ♦ గాపురముండు నఖండసంపదన్. 40

క. శివభక్తికన్న ధర్మము, భువి నొక్కటి లేదు శంభు ♦ పూజారతులన్
సవినయముగఁ బూజించిన, శివపూజాఫలము గల్గు ♦ సిద్ధము సుమతీ. 41

గీ. అలసివచ్చినయతిథికి ♦ నన్న మిడక, కఠినత వహించి గృహమేధి ♦ గడపివేసి
యతఁడు చేసినపాపంబు ♦ లతని జేరు, నతిథి కిడకున్నఁ బరలోక ♦ హాని సుమ్ము.

చ. అతిథులు వచ్చి యెవ్వనిగృ ♦ హంబున నంతతమున్ భుజింతు ర
య్యతులితపుణ్యశీలునివ ♦ మస్తపితృప్రకరంబు వైభవో
న్నతిఁ బితృలోకమందు గృహి ♦ నాకిరలోకమునన్ వసించు ద
నర్పితభయముల్ నశించు గృహి ♦ కిన్ సతతాతిథిపూజనంబునన్. 53

క. అతిథిజనపూజకం బెన్, నతితములు ధర్మములు లేవు ♦ వసుమతిలో దు
ష్కృతిభేషజ మాతఁడు గృహి, కతిథియు చూడఁ ♦ బరమబంధుం డనఘా 54

సీ. అతిథిసత్కారంబు ♦ లాదరించినపుణ్య, చరితుండు యమునిద ♦ ర్శనము లేక
యమితదివ్యాబ్దంబు ♦ లమరపదంబున, నుండి పిమ్మట మహీ ♦ మండలేశ్వ
రుండయి జన్మించి ♦ యాధి ధర్మము సేయు, సర్వభూతిప్రాప్తిఁ ♦ జయము లన్న
గతము లై వర్తించుఁ ♦ గావున నన్నప్ర, దాతయు ప్రాణప్ర ♦ దాత సుమ్ము

గీ. వినుము కేశధ్వజుండను ♦ జనవిభుండు, నాకపదమున నుండి భూ ♦ లోకమునకుఁ
జనఁగఁ గనుఁగొని యరినిలో ♦ శమనదేవుఁ, డర్థిఁ జెప్పినవాక్యంబు ♦ లనఘచరిత. 55

క. అన్నము పెట్టుము భూవర, యన్నము పెట్టుము నరేంద్ర ♦ యన్నం బిడుమీ
యన్న భువి నున్నయప్పుడు, నన్న మసురలోకవాంఛ ♦ నలిపెదవేనిన్. 56

గీ. అని హితంబుఁ గోరి ♦ యఖిలభూతదయాప, రుండు ధర్మరాజు ♦ రూఢిఁ జెప్పి
యొప్పగించెఁ గాన ♦ నన్నదానముతోడ, సకలదానములును ♦ సమతు గావు. 57

క. గాయత్రీమంత్రజపముఁ, బాయక ప్రతివాసరంబు ♦ భక్తి దలిర్పం
జేయుమహాత్ముం డఘములఁ, బాయంగా నడచి బ్రహ్మ ♦ పదమున నిలుచున్. 58

శా. గాయత్రీజప మాదరింప శుభసం ♦ కల్పంబు సిద్ధించు తా
పాయాదిప్రభవోగ్రపాప మడఁగుం ♦ గైవల్యమున్ వచ్చు దీ
ర్ఘాయుష్యంబు లభించు రోగములు మం ♦ చై పోవు నేమంత్రముల్
గాయత్రీపరమాయుతాంశ సమముల్ ♦ గా లేవు ధీరోత్తమా. 59

క. మేలుగ సాయంప్రాతః, కాలంబులహోమవిధులఁ గావించుచు నే
వేళన్ వేదము నుడువున, యాలాత్ముం డుండు బ్రహ్మ ♦ లోకమునందున్. 60

వ. పరధనపరదారపరాన్నంబులు వర్జనీయంబులు గావున పరాన్నంబు భుజియింపం ద
గునెవ్వానిగృహంబున ననవరతంబు నెవ్వాఁడు భుజించు నతనిపాతకంబు లాభోక్త
నంటు నట్లుగాన పరలోకార్థులకుఁ బరులయింట నన్నంబు గుడువ నర్హంబు గాదు.

తద్ద్రవ్యంబుం గొని భుజియించుట మేలు. మాసమాసంబులకొండె నాలుగునెలలకొండె ప్రాయశ్చిత్తంబు గావించుకొనువారికి మనోవాక్కాయకృతదోషంబులు నశించు. 61

క. ప్రాతస్స్నానము నిత్యం, బాతతమతి నాచరించు ◆ నమనుజుఁడు దు
ష్కృతకృతము స్వప్నజ, పాతకములు దొలఁగు దివిజ ◆ పదము లభించున్. 62

వ. మఱియుఁ దిలదానంబు సేయువారు గోలోకం బధిగమింతురు. గోభూహిరణ్యప్రదాతలు దివ్యలోకంబులందు విహరింతురు. వ్యతీపాతసంక్రాంతిగ్రహణంబు లాదిగాఁ గల్గుపుణ్యతిథులందు నన్నదానకృత్యంబు లాచరించినమహానుభావులు నరకగాములుగాక సకలపుణ్యలోకసుఖం బనుభవింతురు. 63

గీ. అనృతవాదియుఁ గ్రోధియు ◆ నమితభాషి, మానరహితుఁడనూయాభి ◆ మానపరుఁడు
నిర్దయుండును యమలోక ◆ నిలయు లగుదురు, వారు చేసినపుణ్యంబు ◆ వ్యర్థమండ్రు

క. పూని కృతఘ్నుఁడు చేసిన, దానంబులు నిష్ఫలములు ◆ తథ్యము తీర్థ
స్నానపవిత్రులు కలలో, నైనం గనుఁగొనఁగనొల్ల ◆ రంతకుపురమున్. 65

క. సుగుణాధారజితేంద్రియు, లగువారును సదయచిత్తు ◆ లగువారలు శౌ
ప్యాగ నుపవాసవ్రతులును, నగవులకైనను యముఁ గ ◆ నఁ జన రెపుడున్. 66

గీ. వసుధ నెవ్వఁడు తీర్థసే ◆ వన మొనర్చి, దర్వ్యలోభంబుచేఁ బ్రతి ◆ గ్రహములందు
నతఁడు చేసినయట్టిపు ◆ ణ్యంబులెల్ల, నిష్ఫలము లని చెప్పిరి ◆ నిఖిలమునులు. 67

ఆ.వె. బ్రహ్మహంతయైన ◆ భక్తితో నొకసారి, గంగఁ దీర్థమాడఁ ◆ గలుష మెడలి
జమునివీటిత్రోవఁ ◆ జనక యోగులకైన, నందరానిగతికి ◆ నరుగు ననఘ. 68

గీ. మద్యపానముఁ జేసిన ◆ మానవుఁడు, చేరి గురుపత్నితోఁ గల ◆ సినయతండుఁ
గనుగుదనమునఁ బైడి మ్రు ◆ చ్చిలినయతఁడు, గంగయం దాడి మోక్షంబుఁ ◆ గాంతు
రనఘ. 69

గీ. అఖిలపాపాత్ములకు నెల్ల ◆ నరకగమ్యుఁ, డరసిచూడఁ గృతఘ్నుండ ◆ ధరణిమీఁద
వఱలినంజాతు దినవ్రత ◆ వ్యాధములును, గంగయం దాడి వాఁడును ◆ గాంచుముక్తి. 70

వ. మఱియుఁ గుంభీపాకంబు, రౌరవంబు, మహారౌరవంబుఁ, గాలసూత్రంబు, నసిపత్రవనంబును, వసాకూపంబును మొదలుగాఁ గల్గుఘోరనరకంబులు విలోకింపక గంగాస్నానంబుఁ జేసినవారు తమకు నభిమతంబు లగుసూర్యలోకంబుల నధివసించి ముక్తు లగుదురు. కృచ్ఛ్రచాంద్రాయణాదితపంబులును భూదానగోదానసాలగ్రామదానంబులును జ్యోతిష్టోమాదిక్రతువులును నహింసాదిధర్మంబులును సకలపుణ్యక

వెండియు మాతృస్తన్యపానం బొనరింపక వైకుంఠవాసి యగు. సాలగ్రామంబు
న్న చోటికిం గ్రోశమాత్రంబున శరీరంబు విడిచినవారికి హరిపురంబునం గాపురంబు
గా దొరకు. పండ్రెండుసాలగ్రామంబుల నొక్కపీఠంబున నొక్కనాఁడు పూ
జించినమహానుభావుండు పండ్రెండుకోట్లశివలింగంబుల సువర్ణపుష్పంబుల నర్చించిన
ఫలంబు వడయు. గంగాస్నానంబు గావింప సమర్థుండు గానివానికి సాలగ్రామ
తీర్థంబు సేవింపఁదగు. సాలగ్రామ దానంబు గంగాతీరంబునం జేసిన దానిఫలం
బు బ్రహ్మాదులు వచింపం జాలరు గావున తన్మాల్యభక్తియు విక్రయమును నరకంబు
నకుం బోదు రట్లగుట తద్విక్రయంబు సేయరాదని చెప్పి వెండియు నిట్లనియె. 90

ఆ.వె. ఇచ్చ గల్గుసన్న ♦ నేకాదశీతిథి, యందు నుపవసించు ♦ నట్టివాఁడు
నరకగామిగాక ♦ నాకఁ జేరు నని సను, వర్తు వలుకఁ నెంచు ♦ వైశ్యతిలక. 91

క. పాలుపొంద రాజసూయం, బులు నూఱును వాజిమేధ ♦ ములు నూఱైనం
దులగా నొకయేకాదశి, నలరుచు నిట్టున్నఁ గలుగు ♦ నాఘము నడఁచున్. 92

క. హరిదినమున కేనగ్నము, సరిగా దేతీర్థములును ♦ సరిగావు గుణా
కర, యెందును పోషణజా, గరముల నగుపుణ్య మలవి ♦ గాదురచింపన్. 93

సీ. తల్లిదండ్రులను వది ♦ తరములవారును, దండ్రివంకను వది ♦ తరము లాలి
చేసఁబడితరము ల ♦ ద్దిం దరించెద రా, నొరి నేకాదశి ♦ నుపవసించు,
పుణ్యశీలుఁడు దేవ ♦ పూజితుఁడై విష్ణుధామంబునకు జేగి ♦ తగలకుండు
బాల్యవయోవృద్ధ ♦ భావంబులను నెప్డు, నైన నేకాదశి ♦ యందు నొక్క
గీ. సారి యుపవాస మొనరించు ♦ జనుఁడు పాప, మాచరించియు నిశ్చల ♦ హరిపదంబుఁ
జేరు నేకాదశేంద్రియా ♦ ర్జితమహాఘ, తతులఁ దొలఁగు నేకాదశీ ♦ వ్రతముకతన.

వ. మఱియు నొక్కవిశేషం బాకర్ణింపుము జాహ్నవీసేవయు నింద్రియనిగ్రహంబును
శివకేశవభక్తియు గోభూసువర్ణాదిదానంబులును సకలభూతదయయును స్వధర్మ
పరిపాలనంబును ననునివి నరకనివర్తకంబులును పుణ్యలోకకారణంబులును నని గర్గా
దిమహామునులు పలుకుదు రట్లు గావున. 95

ఉ. వేలములన్ సుగంధములు ♦ వెంబలు శల్లము చేసి కూర తాం
బూలము దాళవృంతము ల ♦ పూపములన్ గొడుగుల్ ఫలంబులున్
బాలును బియ్యమున్ శౌకు ♦ పాలును నెవ్వలుఁ గల్మికొద్ది నే
వేళల దానమిచ్చుట ఘ ♦ టింగను ధర్మము మర్త్యకోటికిన్. 96

క. గంగను సతతముఁ దలఁచుట, గంగాతీరమున వసతి ◆ గావించుటయున్
గంగాస్నానము సేఁతలు, గంగను దర్శించుటయును మోక్ష ◆ కరధర్మములగు. 97

క. భువి నిడక దివిని దొరకదు, శివునంతటివానికైన ◆ సిద్ధము శైత్య
పరిరక్షా వినుమటు గావున, భువి జనులకు దానధర్మ ◆ ములు సేయఁదగున్. 98

క. నానావిధదానములును, నానావిధధర్మములును ◆ నరులకు స్వర్గ
స్థానప్రదములు గంగా, స్నానము స్వర్గాపవర్గ ◆ సత్ఫలదమగున్. 99

గీ. యజ్ఞదానతపోనిష్ఠ ◆ లాదియైన, సకలశాస్త్రోక్తధర్మముల్ ◆ శక్తి కొలఁది
గంగ కంకితఁ జేయ ◆ నక్షయఫలసిద్ధి, దములగు ననుచుఁ జెప్పిరి ◆ తత్త్వవిదులు.

ఉ. చాలఁ బుణ్య దానధర్మములు ◆ చేసినవారలు పుణ్యలోకప్ర
శస్తసుఖముల్ భుజించి పిదప ◆ తన్ భువియందు మహాకులీనులై
వెలసి సమస్తభోగములు ◆ విశ్రుతకీర్తి చిరాయురున్నతుల్
గలిగి సుధర్మనిష్ఠు లయి ◆ క్రమ్మఱఁ గాంతురు పుణ్యలోకమున్. 101

గీ. ధర్మవిముఖుండు నరకగ◆ర్తమునఁ గూలుఁ, గాన బాల్యంబు మొదలుగ ◆ మానవుండు
పాపకర్మంబు వర్జించి ◆ పరమధర్మ, కర్మములు సేయఁగవలయు న ◆ తీతనిలయ.

వ. ఇవ్విధంబున నీను ధర్మాధర్మంబులు సంగ్రహప్రకారంబున వివరించితి నింక నీమనంబున సంస్థితి యగుగ చేసెద యయ్యో నని వికుంఠుఁడు ధర్మదూత కిట్లనియె.

క. నీవాగమృతము పానము, గావించి కృతార్థభావ ◆ గరిముఁడనైతిం
దావక సంగతి నాకిఁక, సేవకునకు రీతిఁ గొంకకఁ బ్రణతిఁ ◆ జేసెద నీకున్. 104

క. నీధర్మోక్తుల నంచిత, బోధా పుణ్యాంబు నగుచుఁ ◆ జొలిచితి గంగా
పాథోవీచులచేతన్ ◆ సాధుత్వము బూనినట్టి ◆ చరితుని భంగిన్. 105

క. ప్రియభాషిత్వము సుపకృతి, దయయును మాధురియు ధర్మ◆తత్త్వజ్ఞతయున్
నయమార్గబోధకత్వము, దయనిరజన నీకు గలవు ◆ హేమపవిత్రా. 106

వ. ఇంక నొక్కటి విన్నవింతు మాయన్నప్రీతుండలుండు నరకంబువలన వెడలుమపాయం బానతిచ్చి నన్ను మన్నింపు మని ప్రార్థించిన ధర్మకింకరుండు కృపాయత్తచిత్తుండై దివ్యబోధంబునం జూచి యిట్లనియె. వైశ్యోత్తమా మున్ను నీవష్టమజన్మంబునం గావించినపుణ్యంబు నీయన్నకిచ్చెదవేని యతనికి స్వర్గంబు లభించునది యెఱింగించెద. ఎనిమిదవజన్మంబున నీవు బ్రాహ్మణుండవై యుండి యొక్కనాఁడు మధ్యాహ్నసమయంబున నీయింటికి నతిథులై బ్రహ్మధ్యాననిష్ఠులును సమలోష్టాశ్మకాంచనులును శీతోష్ణసుఖదుఃఖసహిష్ణువులును నైనయతీశ్వరులు వచ్చిన

ఖండలముఖత్రిదశ ♦ కాండనుతకేళీ
తాండవ భవాంబునిధి ♦ తారక మహేశా. 116

క. క్రీడాకిరాత నవశశి, చూడాలంకార నముచి ♦ సూదనరత్న
క్రీడాకరకంధరగం, గాఢిండీరాచ్ఛకాయ ♦ కాలజదమనా. 117

మాలిని. ప్రమథగణసమేతా ♦ పాపజీమూతవాతా
నమదమరసమూహా ♦ నామవిధ్వస్తమోహా
సుమధురవరభాషా ♦ సుస్థిరాత్మీయతోషా
విమలగుణకలాపా ♦ వేదవేద్యస్వరూపా. 118

గద్య — ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ
లక్ష్మణకవినామధేయప్రణీతం బైన జాహ్నవీ
మాహాత్మ్యం బనుమహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ.

శ్రీమత్సరదేవతాయైనమః.

# జాహ్నవీమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీవత్సమానిగోత్ర, శ్రీవర్ధన కామమంత్రి ♦ శేఖర సతత
శ్రీవైభవసంధాయక, శ్రీవెంటురిపురనివేశ ♦ శ్రీసోమేశా. 1

వ. దేవా! యవధరింపుము. శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. నట్లు జాహ్నవీమహిమశ్రవణకుతూహలాయత్తచిత్తుం డగుకార్తవీర్యార్జునునకు దత్తాత్రేయుం డిట్లనియె. 2

క. అంబువు లెల్లను విష్ణుమ, యంబు లని తలంచు వేద ♦ మటుగావున నే
యంబులనైనను దోఁగి ది, వంబున వసియించు దుష్ట ♦ వర్తి యునధిపా. 3

వ. వాపీకూపంబుల నవగాహం బొనరించిన ద్వాదశగుణఫలంబును నేటియందు దాని కంటెఁ జతుర్గుణంబును దేవఖాతంబుల దశగుణంబును బుణ్యనదులయందు శతగుణంబును సంగమంబులం దచ్చతుర్గుణంబును జాహ్నవీస్నానంబున సహస్రగుణిత ఫలంబును సమకూరు పెండియు. 4

గీ. మాఘమున జాహ్నవికి నేగి ♦ మజ్జనంబు, సలిపినమహానుభావుండు ♦ స్వర్గలోక
మనుభవించు నిరంతరుఁ ♦ డగుచు నవ్య, యుగసహస్రంబులధ్యాత్మ ♦ యోగనిపుణ.

క. గంగానది వింధ్యకుఁబ్రా, క్సంగమమున మానవులకు ♦ దశగుణఫల మి
చ్చుం గాశి నుదగ్వాహిని, సంగతిగా నొసఁగునూవె ♦ శతగుణఫలమున్. 6

ఆ.వె. అదటికంటె గంగ ♦ యమునతోఁ గలసిన, యట్టిదేశమున స ♦ హస్రగుణిత
ఫలము నిచ్చుఁ దొలఁగు ♦ బ్రహ్మహత్యాదిక, ల్మషచయంబు తజ్జ ♦ లంబు సోఁక. 7

క. ఇక్కడ నక్కడ ననఁదగ, దెక్కువతక్కువలు గల్గ ♦ వెక్కడనైనం
జెక్కుఫల మిచ్చు జాహ్నవి, నిక్కము సెప్పితి నృపాల ♦ నీతివిశాలా. 8

ఆ.వె. మకరమాఘవేళ ♦ మానవుం డర్థితో, గంగ యమునతోడఁ ♦ గలయునచట
మునిఁగి ప్రకృతిబంధ ♦ ముక్తుఁడై యచ్యుత, మందిరమున నుండు ♦ మహితుఁ డతఁడు. 9

సీ. తజ్జలస్పర్శమాత్రమునఁ గల్గుఫలంబుఁ, జిత్రగుప్తుండును జెప్పలేఁడు
మున్నూఱువత్సరంబులు నిరాహారతఁ, దపము సల్పినయోగితతికిఁ గలుగు
ఫలము సిద్ధించు మమర్త్యులకు నచ్చట మూఁడు, దినములఁ జేయుమజ్జనమువలన
కనకభారసహస్రకము వేదవిదులకు, నుపరాగవేళల నొసఁగుఫలము

గీ. దొరకుగంగయుయమునయు దొరయుచోట, మాఘమాసమునందొక మాటుగ్రుంకి
నన్నదులందు మునిఁగిన యట్టిఫలము, లోకులకు నబ్బు నేకాభిషేకవిధిని. 10

గీ. మాఘదినముల నచ్చోటి మజ్జనమున, సకలకల్మషముక్తుఁడై జనుఁడు వెలుఁగు
వసుమతీశ్వర పాపశ్రేణి వహ్నికరణి, కంచుకవిముక్త భుజగభుజంగంబుమాడ్కి. 11

క. దురితధ్వంసచికీర్షం, బరమేష్ఠి సృజించె భువనపాలకుఁ డగుటన్
ధరణిఁ బ్రియాగంబనఁగా, నిరవద్యాంజనము ముక్తినిధి కది యధిపా. 12

సీ. జలజాసనాదినిర్జరులు నింద్రాదిది, క్పతులు భానుప్రముఖగ్రహము లింది
రాదిశక్తులు సనకాదియోగులు రంభ, మొదలైనయప్సరస్సుదతు లఖిల
యక్షగంధర్వవిద్యాధరప్రభృతిదే, వతలు గోమాతృకల్ పితృగణములు
గంగకు వచ్చి మాఘమునఁ దజ్జలముల, నవగాహ మొనరింతు రధికభక్తి

గీ. మూఁడుదివసంబు లచ్చట నాడునట్టి, ప్రాణులకు నశ్వమేధసహస్రఫలము
గలుగు నని చెప్పి వెండియుఁ గార్తవీర్య, నరపతికి నిట్లనియె నత్రినందనుండు.

వ. కాంచనమాలిని యనునొక్క యచ్చరను సృష్టించి యొక బ్రహ్మరాక్షసునకు మాఘమాసవాసరత్రయకృతగంగాస్నానఫలం బొసంగి యతని శతక్రతులోకారూఢునిం జేసె ననుటయు నారాక్షసుం డెవ్వాఁ డతనికి నెబ్భంగి నాదివ్యాంగనారత్నంబు తత్ఫలం బిచ్చె నంతయును సవిస్తరంబుగా తెలిపింపు మనినం గృతవీర్యనందనునకు నత్రినందనుం డిట్లనియె. 14

సీ. తొలుకారుమెఱుఁగుదీఁగలవోలె నొద్దంపు, మేలంవన్నియ లీను మేనుదీవ
కళల నిండారుచంగలువనెచ్చెలిఁబోఁడఁ, దులమూఁగఁజాలుముద్దులమొగంబు
లలి నల్లగల్వరేకులకన్న గొప్పలై, చెన్ను మిగిలిన వాలుఁగన్నుఁగవయు
మణికందుకములతో మచ్చరించుచు మిక్కి-, లి గునిసియాడెడు గబ్బిగుబ్బదోయి

గీ. తనర శృంగారవిభవనిధాన మనఁగఁ, బొసఁగఁ జరియించు నపరంజిబొమ్మ యనఁగ
నమరి కాంచనమాలిని యనఁగ నొక్క-, దివిజకామిని గలదు ధాత్రీతలేంద్ర. 15

గీ. రజతగిరిమీఁద శంభునిరాణిసరస, సేవ గావించు దేవతాస్త్రీలలోన
మాట నేర్పరి యాయింతి మకరమాఘ, యోగమున మజ్జనాపేక్ష నొక్కనాఁడు.

ఉ. గందపుఁబూతకై వడి చొ◆కారముగా వలిపంబు గట్టి పై
గందముఁ బూసి సింగులవ◆కచ్చులు కొప్పునఁ జేర్చి జాళువా
యందెలు మ్రోయఁ దీవపాలు◆పై తగుబులుకులు గుల్కఁ జేఁతచే
తలఁ దనకాంతవీణియఁ గ◆దల్చుచు నల్లన సారె మీటుచున్. 17

క. చనుదెంచి ముందటం గాం, చనమాలిని గాంచి జహ్ను◆జాజలమజ్జ
జ్జనకరతలగతఘనవా, హనవిష్టపభోగముం బ్రి◆యాగము నెమ్మిన్. 18

ఆ.వె. కాంచి భక్తిఁ బ్రణతి◆గావించి పూర్వాహ్ణ, మునఁ దదీయవారి◆మునిఁగి మరలి
గగనమేఘమాలి◆కఁ దటిల్లతవోలె, నింతి గగనవీథి◆నేగునపుడు. 19

వ. దివాకరకరనికరదురవగాహమహాతుహినధారాసారసమృద్ధితశిఖరహిమవన్నగపార్శ్వ
పాదపభవనసమావిష్టుండై వికృతముఖంబును గోరకవెంట్రుకలును మిడిగుడ్లును
కోరదంష్ట్రలును పల్లమీసంబులును గుజుచచేతులును నంటుపిక్కలును వలుదబొ
డ్డును చేటపాదంబులును పొడుగుపిక్కలును నంగంబులందుఁ బొడమూపుబీదనరం
బులును కారునలుపుటొడలునుం గలయొకబ్రహ్మరాక్షసుండు గగనమార్గంబున వ
చ్చునచ్చెరువుచ్చకంటిం గాంచి సమంచితప్రియభాషణంబుల నిట్లనియె. 20

సీ. తులకించుతడిచీర◆తొడలపైఁ గదుమాత్తు, జోకగా లోజిగి◆చాకళింప
పసిఁడికుండలఁబోలు◆పాలిండ్లభరమున, నసదు లేగౌ నసి◆యాడుచుండ
తోడవ్వగా నలరుకే◆ల్జడయందు గిఱికొని, యుదుటుతీర్థపుబిందు◆లుట్టిపడఁగ
నడుగుదమ్ములకాంతి◆విడివడి పగడంపుఁ, జిగురుటాకుల మేలు◆చిందు సేయ

గీ. చెలిమి నెక్కడనుండి నీ◆విటకు వచ్చి, తెచట నీయునికి యెచ్చోటి◆కేగెదిపుడు
నామ మెయ్యది నిజముగా◆నాకుఁ దెలుపు, భీతసారంగశాబక◆స్ఫీతనయన. 21

క. సురుచిరతరకనకలతా, గురురుచిసంపదల గుత్తు◆గొనులీలాసుం
దర మగనీమే నెక్కడ, హరహర నీయొంటితాక◆యది యెట్లు చెలీ. 22

క. కన్నులు చల్లంగా నిను, గన్నప్పటినుండి యొడలి◆కాఁక లడంగెం
జెన్నగు నీదుశరీరము, తిన్నగ నమృతమని తలఁచి◆తి నళినాక్షీ. 23

గీ. ఉవిద నీతడిచీరబిం◆దువులు తలను, సోఁకినంతనె దయావృత్తై◆నూనె మదిని
ప్రాణుల భుజించునాకుఁ గ్రౌర్యంబు మాని, ప్రియముగదిరెడు నీరూపు◆రేఖ మాడ

క. తల్లివలె డాయఁ బుట్టిన, చెల్లెలివలె నిన్నుఁ జూచి◆చిత్తము కడు రం
జిల్లె నీమధురోక్తులు, తల్లీ విన వేడుకయ్యెఁ◆దద్దయు నాకున్. 25

వ. అనినం గాంచనమాలి రక్కసున కిట్లనియె. 26

క. వినుము సుమేరుఁ డనంగాఁ, దనరినగంధర్వరాజు♦తనయను గాత్యా
యని గొల్తు రజతగిరిపైఁ, ననుఁ జెలిఁగాఁ జూచుఁ గుహర♦నందని కరుణన్. 27

గీ. అమ్మహాదేవి మన్నింప♦సమ్మదమున, నచట నుండుదు నిపుడు ప్ర♦యాగగంగ
స్నాన మొనరించి పోయెద♦సకలసురలు, నర్థిఁ గాంచనమాలిని♦యందు రన్న.

క. స్పృహగలిగిన చెల్లెడలన్, విహరింతున్ రాక్షసేంద్ర♦వినుమని పలుకన్
మహితకృపాప్రేమంబులు, రహి మనమున నగ్గలింప♦రాక్షసుఁ డనియెన్. 29

క. ఈసౌభాగ్యం బీనే, ర్పసంపద యీమహత్వ♦మేచందమునన్
భాసిల్లె నెట్టిపుణ్యము, చేసితివో మున్నుఁ దెలియఁ♦జెప్పుమ తరుణీ. 30

వ. అని యడుగుటయుఁ గాంచనమాలిని యారాత్రించరుం జూచి నాపూర్వజన్మంబు మహాపాపభాజనంబు దాని తెఱంగు వివరింపం దీరదు. తడవయ్యెడు గౌరీసేవ గావింపం గైలాసంబునకుం బోవలయు నైనను నన్నడిగెదవు గావునం దద్వృత్తాంతం బంతయు సంక్షేపప్రకారంబునం జెప్పెద నది వినిననీకు మనస్తాపంబు తీఱు వినుమ ని యిట్లనియె. 31

సీ. పుడమిపూఁబోఁడికిఁ♦దొడవైన కళింగాధి, పతిపుర మొప్పు న♦ప్పట్టణమున
తణపుఁబణతులలోఁ♦బ్రౌఢయై వాచాల, యనువేడ్క నొకయింతి♦యమరు దాని
కూఁతురనై యేను♦గౌరవవిలాసిని యను, పేరఁ బొల్తు మ♦జ్జనని నేక
పుత్రిని గావునఁ♦బ్రేమాతిశయమున, (సరసినన్) బెంచుచు♦సరసనృత్య

గీ. గానసాహిత్యవిద్యలు♦గఱపి దేహ, పోషణము చేసి బహువిధ♦భాషలందు
నిపుణగాఁ జేసి తల్లి మ♦న్నించి పెనుపఁ, గాంతిఁ బెరిగితి నమృతాంశు♦కళికకరణి

వ. ఆసమయంబున. 33

ఉ. చాలునవప్పుముద్దుపలుకుల్ లును♦చేరలఁ గొల్వఁగఁ జాలుకన్నులున్
మొలకమెఱుంగుఁజన్నులును♦సుక్ బువ్వదండలు హాల్పఁ గందుమే
నలికముఁ జూచుఁ క్రొన్నెఱులు♦నందపుమోమును గల్గినన్పుగాం
డ్రెలిమి వహింప బాల్యమున♦నెంతయుఁ బొల్చితి నూత్నసంపదన్. 34

వ. అంత మాతల్లి జాణంగువిప్రపుత్రుల వైశ్యకుమారులం దోడ్కొని తెచ్చి నన్ను మరగించి వలపుబేరంబుకుండ నల్లనఁ బడయం బురికొలిపె ననంతరంబ. 35

సీ. తామరమొగ్గల♦తో మచ్చరింపుచు, వికిర్ చన్నుంగవ♦నిక్కఁ జూపె
నీలోత్పలములపై♦నిలిచినచేటుల, పాలుపునఁ గురులందు♦నలుపు మించె

సానబట్టినమాన శరునితూపులువోలె, వాలుగన్నుల వింత వాఁడి నిగడె
తరపివెన్నెలనీటఁ దడిపినయద్దంబు, గతి మొగంబునఁ గ్రొత్త కాంతి వొడమె

ఆ.వె. కాను సన్నమయ్యెఁ గమలోదరంబుల, పగిది జిగి వహించెఁ బదయుగంబు
నవక మెక్కు వయసు నామేనఁ దొడిగిన, తొడవువోలె నప్పుడు కడుఁ దనర్చె. 36

వ. ఇవ్విధంబున మవ్వంబయి నివ్వటిల్లుజవ్వనంబున. 37

సీ. సౌందర్యసౌభాగ్య చాతుర్యవిభ్రమ, సంపదలందు నా సాటియైన
వారకాంతలు సర్వ వసుధపై లేరంచు, నట్లుగా సకలవి ద్యాప్రవీణ
నై విటచిత్తంబు లలమి యాకర్షించి, నవరత్నఖచితశా తామనోజ్ఞ
భూషణబహువర్ణ భూరిదుకూలాది, దివ్యాంబరంబులు దివ్యవస్తు

గీ. తతు లుపార్జించి దాసీ దాసజనులు, గలిగి వెండియుఁ బైడియు నిలయములను
దడఁబడు చునుండ భోగులఁ దపిలిభోగ, మనుభవింపుచు నుండితి దనుజనాథ.

వ. మఱియును 39

గీ. సరసభాషలనెలవు సుందరతసీమ, పల్లవులనోముపంట దర్పకునిబీము
సురతకౌశలములగని సుఖనిధి యని, ప్రోడపడఁతులు నను మెచ్చఁ బొలిచితప్పుడు.

వ. ఇట్లు పంచవింశతివర్షంబులు నిండుజవ్వనంబు నాకు నివ్వటిల్లునప్పు డొకనాఁ డొకవిటశ్రేష్ఠురాకఁ గోరి పెద్దయుంబ్రొద్దు చనునంతకు నేకాకినినై హంసతూలికాతల్పంబునం బవ్వళించి యుండి వానిరామికి నుమ్మలికంబుఁ జెంది నేనెవ్వతెను? వాఁడెవ్వఁడు? వానిరాక కెదురుచూచుచు నింతవంతం బడ వగవ నేటికి? నిద్రవిడిచి మిడుక నేల? యేల వలచితి? నేనింతకాలం బిట్లుపడసి యేమి సాధించితి? మహాదురితభాజనం బగునీజన్మంబు నాకు నేల కలిగె? ఎక్కడితల్లి యెక్కడిచెలులు? ఈధనంబుల నేమిపని యయ్యెడు నయ్యయో? యీవెత్తఁ జెప్పుటకేగిన నేమి? మాంసవిక్రయంబు జీవికగా నున్నకటికవానికన్న నీచంబు నావర్తనంబు. యమ(నిదుర్వారక్రోధంబునకగ్గ)మైతి నాచేసినదురితం బెంతకాలంబు నరకంబుల నుండినం దరుగునె? పడఁతికుచపడఁతికంటెఁ బాపిని యున్నదే యని విచారించునవసరంబున నామిండగీఁడు వచ్చి నన్నుఁ బిలిచిన. 41

క. పలుకకయె త్రోచి పుచ్చినఁ, బిలిచిపిలిచి నోరునొచ్చి పెలుకురఁగనివాఁ
డేలమి చెడిపోయె నంతట, నెలకొనియె విరక్తి నాకు నెమ్మదిలోనన్. 42

క. వైరాగ్యము వొడమిన సం, సారం బంతయును విగత సారం బని చిం
తారతినై యున్నయెడ, న్నీరజమిత్రుండు దోఁచె నిశచరతిలకా. 43

సీ. అంత నప్పురమున♦నఖిలశాస్త్రార్థజ్ఞుఁ, రాజపురోహితుఁ♦బూజనీయు
దర్శించి సురభిగం♦ధపుష్పనూత్నాంబర, విమలభూషణములు♦వేడ్క నొసఁగి
సాష్టాంగనతి సల్పి♦ప్రాంజలియై సమం, చితవినయంబునఁ♦జెంత నిలువ
ధీరుఁ డాయన కృపా♦దృష్టిఁ జూచి కరంబు, గారవింపుచు పద్మ♦గంధి నీవు
గీ. మాకడకు వచ్చుపని యేమి♦మాకుఁ దెలుపు, మనినవినికేలుగవఫాల♦మునఘటించి
యతనివదనంబువీక్షించి♦యాదరంబు, గదుర నేనిట్లు పలికితిఁ♦గడఁకతోడ. 44

ఆ.వె. సకలఘోరదురిత♦జన్మభూములుసుమీ, పడతికులముచునట్లి♦పడఁతు లగని
యందులోనఁ బుట్టు♦వారిఁగ నాచర్య, యధికపాపమూల♦మనఘశీల. 45

సీ. దానంబుసేయఁ దీ♦ర్థంబాడ ధర్మంబుఁ, జింతింప సుకృతిఁ♦సేయ నేరి
కనవరతంబుఁ బ♦రార్థాపహరణంబుఁ, (బరనింద నంబు)ను♦పరజనస్థ
దోషగవేషణో♦ద్యోగంబుఁ జేయుచు, నన్యపీడనము ధ♦నార్జనమును
పురుషార్థములు గాఁగఁ♦జరియించితి ననత్య, వర్తనంబున నిన్ని♦వాసరములు
గీ. తలఁచి యుప్పు దూలము తలఁ♦దాఁకినట్లు, లధిక తాపంబు నెమ్మది♦నంకురింప
నరసి సుఖమంతయును గల♦యందు నైన, సగిది నస్థిరమై గానఁ♦బడియె నాకు. 46

క. కావున నీజగమంతయు, నోవిప్రకులేంద్ర యసత్య♦యోజ్యమని సం
భావించి కళవళింపుచు, దేవరసన్నిధికి వచ్చి♦తిన్ మోక్షేచ్ఛన్. 47

క. కడలేనిభవపయోనిధి, యడుగునఁ బడి మునిఁగియున్న♦యాదను నన్నుం
గడుకూర్మి నుద్ధరింపుము, జడధీజడరతనిజాత్మ♦నిత్యమహాత్మా. 48

క. పొలుపమరఁ బుణ్యలోకము, గలుగునుపాయంబు నాత్మ♦గతి నరసి కృపా
నిలయా యానతి యిమ్మని, పలికి ప్రణామంబు సల్పి♦ప్రార్థించుటయున్. 49

వ. అన్నరపాలపురోహితశ్రేష్ఠుండు నన్నుం గనుఁగొని సాదరంబుగా నిట్లనియె. 50

క. చీరలు సొమ్ములు దండలు, భూరిసుగంధములు ధనము♦భోగములును సిం
గారమును గలిగి యారక, వైరాగ్యము పుట్టె నాఁగ♦వచ్చునె తరుణీ. 51

క. ఈజడబుద్ధులు దగునే, వేశ్యకు నిన్నాసపడెదు♦విభవముతోడన్
నీవుండి యహేతుకముగ, నీవైరాగ్యంబుఁ జెంద♦నేటికి నబలా. 52

ఆ.వె. ఇట్టి తలఁపు లుడిగి♦యింటికిఁ జని సుఖం, బుండు మని పురోహి♦తుండువలుక
విని మనంబులోన♦వెలసినవైరాగ్య, మగ్గలింపఁ బల్కి♦తతనితోడ. 53

వ. త్వగసృఙ్మాంసమేదోమజ్జాస్థిస్నాయునిబద్ధం బయినయీశరీరంబునం గలుగుసుఖం
బెంత. దీనికి సాయుజ్యంబును పరమస్వల్పంబు కలిగి భోగింపవలదా యని పలి కి

దవేని విన్నవించెద నున్నరూపుఁ జిత్తగింపుము. గంధవర్స్ఫటికవర్ణభూష
ణాంబరధారణం బెల్ల నస్మనిశ్చయుఁ గానియాత్మసుఖార్థంబు గాదు. పడపుఁ
గుడుపుగాఁ బరగుపడంతుల కిది మర్యాద. అదియునుం గాక నాకు భోగాపేక్ష
లేదు. విషయసుఖకాంతారనిదాఘకాలం బగుచుగ వచ్చుచున్నయది. ఇఁక బు
ణ్యాచింతనంబు పురుషార్థంబు గాని తుచ్ఛభోగానుభవంబు కార్యంబు గాదని యె
ట్లనిన. 54

ఉ. చన్నులు నిక్కదప్పెఁ గచ◆సంతతిపై నెరనూపెఁ జెక్కులం
జెన్ను దొలంగె మోముజిగి◆చిన్నదనంబు వహించె మోమునం
బ్రన్నదనంబు జారె రతి◆పైఁ బెనుమక్కువ సుక్కె మిండలన్
మిన్నక మాటనేర్పుల భ్రమించు నసుం గని నవ్వరే జనుల్. 55

క. తనలేమియుఁ బరవేశ్యల, ధనవృద్ధియుఁ జూచి ముదిమిఁ◆దాల్చినవారాం
గన కన్నమూయు నెంతగఁ, వనరున్ విధిఁ దిట్టుఁ బరువ◆వాక్కులనెప్పుడున్. 56

వ. మహాత్మా! బహుదోషాకరం బగుముదిమిచే నదుకుంబడి యిందుములషాడై పాప్మని
ఋతచ్చరణసన్నిధిం బ్రపన్నయైయున్న నన్నుం బోధింప మీకుం దగునే యనుట
యుం నమ్మహానుభావుండు నాతో నిట్లనియె. 57

గీ. నీరజాతాక్షి నీమాట◆నిజము ముదిమి, సకలదుఃఖంబులకుఁ జూడ◆జన్మభూమి
నీదు డెందంబున విరక్తి◆నివ్వటిలుట, ముక్తిమార్గంబుఁ గాంచుట◆మోహనాంగి.

క. నీపశ్చాత్తాపముఁ గని, యోపడఁతీ విస్మయంబు◆నొందితి నిఁక నీ
పాపోద్యోగము విడువుము, చూపించెద నీకు మోక్ష◆సుఖకరపథమున్. 59

క. అని విప్రుఁడు చిరకాలము, మనమునఁ జింతించి యుచిత◆మం బగుగంగా
ధునిజలమున నభిషేకం, బొనరింపుము మకరమాఘ◆యోగమునందున్. 60

వ. గంగాయమునాసంగమంబు ప్రాజాపత్యతీర్థం బనంబరగు దానియందు మజ్జనంబు
సలిపినవారికి సకలపాతకక్షయం బగు నశ్వమేధాదియజ్ఞానుష్ఠానప్రభృతిపుణ్యంబు
లను ప్రాజాపత్యతీర్థంబునకు సాటిగావని సనకాదిమహామునులు లోకహితంబుఁ
గోరి బోధించి తెలుపుదు రట్లు గావున గంగాయమునాసంగమతీర్థంబునకుం బోయి
యచ్చట నఘమర్షణంబు సేయుము దాన నీకు నాజన్మకృతదోషనివృత్తి యగు నూ
ర్ధ్వలోకంబులు లభించు నని భూసురపుంగవుండు వక్కాణించి యవ్వేణ్యాతీర్థంబునం
దొల్లి శచీవల్లభుండు కృతాభిషేకుండై గౌతమునిశాపసంప్రాప్తం బయినదేహకలు
షంబుఁ దొలంగించుకొని దేవరాజ్యంబునకు యోగ్యుం డయ్యె నని నవిని యేనిట్లంటి.

గీ. కొత్తగా గరిగట్టిన ♦ కసువు పెరుకుని, వాఁడితూపనఁ గసుపట్టి ♦ కరలు దాని
గౌతమునిభార్య వీక్షించి ♦ కౌశికుఁడు, (మనసు జల్లనఁ గోర్కి ♦ మిసుమిడింప). 71

వ. ఈక్షించి యక్కలికి చక్కదనంబునకు మిక్కుటంబుగా నక్కజం బంది ముక్కంటి
యుం నీచక్కరబొమ్మం గనుంగొన్నఁ జక్కరవిలుకానిబారికిం జిక్కఁడే యని తల
యూచి మీనకేతనబాణగోచరుండై యాచకోరాక్షిరూపంబు బహుప్రకారంబులం
గొనియాడుచు నప్పుడంతివలనం బొడమినవలపు బలువుకొని యంతరంగంబు నగ్గలించి
నం జెగ్గిలుచు నంతర్గతంబున. 72

ఉ. సారసుఁ డేల చెప్పె నొల ♦ నాఁగవిలాస మఠందు చెప్పఁగాఁ
గూరిమి నేల వింటి విని ♦ కోరిక సేయక దీనిఁ జూడ వాం
ఛారతి నేల వచ్చితిని ♦ చయ్యన నేటికిఁ జూచితిన్ మరుం
డారయఁ జూచినంతన శ ♦ రార్చుల నన్నిటు లేచ నేటికిన్. 73

క. ఇమ్మగువమగఁడు కడుఁగో, పమ్మున రుద్రుఁడు దనదు ♦ పాదమ్మున నే
త్రిమ్మఁదగఁజూపెవ్యాఘ్రము, ఖమ్మనఁ జెయ్యుదుటయింతిఁ ♦ గవయుట యూడన్

సీ. ఏమన్ని ముని శపి ♦ యించునో యిచ్చోట, నిశ్చలితకై యున్న ♦ నన్నుఁ జూచి
నేటుకు వెరవక ♦ చెలువఁ బట్టితి నేని, యేమని పల్కునో ♦ యిచ్చ లేక
యుండి పని గాదని ♦ యే సూరకుండినఁ, బచ్చవిల్తునిచేత ♦ బ్రదుకఁగలనె
యెన్ని చందంబుల ♦ నింతినిఁ జెందక, సారసిబోఁడంగ ♦ సర్వమగునె

ఆ.వె. రాత్రియిల్లుఁ జొచ్చి ♦ రమణిఁ గాఁగిటఁ జేర్ప, నెవ్వఁడనునొ చిత్త ♦ మెట్టులగునొ
చేర రాకవేళఁ ♦ జేరదు రాకవేళ, జేరనొల్ల రతనిఁ ♦ జిగురుబోండ్లు. 75

క. అని వెచ్చనిట్టూర్పులు, గొనకొని నిగుడించుమదిని ♦ గోమలియెడ భీ
తిని మరలిపోవఁ జూచుచు, ఘనతరవిరహాగ్నిశిఖల ♦ గాఁగం దిరుగున్. 76

క. ఇత్తెరఁగున సురనాయకుఁ, డత్తొయ్యలిపొందు వడయ ♦ కలఁజపడ లో
హాత్తినవగఁ దోఁగెనొ యన, నత్తఱి సూర్యుండు పశ్చి ♦ మాంబుధిఁ గ్రుంకెన్.

గీ. ఇంద్రునివిరహాగ్నిశిఖధూమ ♦ మెల్ల దెసలఁ, గ్రమ్మెఁ జెల్లుగ ననఁగఁ జీ ♦ కట్లు బెరసె
మిక్కుటంబుగ దివిఁ బొల్చెఁ ♦ జుక్కగములు, మిగులఁ గొలకునవికసిన ♦ తొగలమాడ్కి

వ. ఆసమయంబున సంయమిశ్రేష్ఠులు నిష్ఠాపరత్వంబున నగ్నిహోత్రగృహంబులకుం జని
హోమకృత్యంబులు దీర్చిరి. అంత నంతకంతకు నేత్రోన్మీలననిమీలనంబులు సమా
నంబులుగా గాఢంబై యంధకారంబు బంధురంబై పర్వ నట్టియెడ వేదాధ్యయనం
బు మాని మునులు విశ్రమించిరి. అహల్యతోడం గూడి గౌతముండునుం దనపర్ణ

గీ. కోకవిరహాపహారాశి ♦ సంభవుండు, ఘోరనిద్రావశాంబుజ ♦ బోధకుండు
కైతవవికాసవిత్రస్త ♦ సత్కరుండు భాను, డంత పూర్వాద్రిశిఖరాధి ♦ రూఢుఁ డయ్యె

వ. ఇట్లు సూర్యోదయం బగుటయుఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి గౌతముం డు శిష్యపరివృతుండై వచ్చిన నయ్యిందువదన యిందంబున నందడిగొను భయంబునం దనకభిముఖంబుగా నేతెంచినం దానిలక్షణంబు లుపలక్షించి సంశయింపుచు దివ్య జ్ఞానదృష్టిం జూచి పురందరుండు మందయానతోడ మన్మథకేళిఁ దవిలి ఫలంపుట తెలిసి విలయకాలకృశానునిపగిది క్రోధానలకీలాకలాపంబులు కన్నులం గొనసాగ నా గతిఁ గనుంగొని కులంబును శీలంబును గుణంబును వర్జించి వజ్రాయుధునితో వ్యభి చరించితివి గావున శిలవై యుండు మని యహల్యకు శాపం బిచ్చి కుండికాతోయం బులు చేతం బూని బలారాతి నుద్దేశించి నన్నుఁ జీరికిం గొనక గర్వాంధుండవై భయంబు విడిచి నాయిల్లుఁ జొచ్చి యిట్లు మహోగ్రదోషకృత్యంబొనరించినదు రాత్మునిశరీరంబు బహుభగంబులచేత సంకీర్ణం బగుం గావుత మని ధారుణంబుగా శపించుటయుఁ దత్క్షణంబ శక్రునిదేహం బాక్రమించునట్లు భగరూపంబున దుర్గంధభూయిష్ఠ వ్రణసహస్రం బావిర్భవించె నయ్యవసరంబున. 93

గీ. చీము నెత్తురు గార మ ♦ క్షికలు ముసురు, కొనుచు ముసరంగ దుర్గంధ ♦ మగ్గలముగ
మహిమ నొప్పారు నింద్రుఁడు ♦ మంచకాని, యమ్మునీంద్రునిశాపంబు ♦ వ్యర్థ మగునె

గీ. ఇట్టితన మేను గనుఁగొని ♦ యింద్రుఁ డధిక, లజ్జితమున ముఖకమ ♦ లంబు వంచు
కొని మనంబునఁ జేసిన ♦ ఘోరపాప, ఫలముఁ బొందక మానునె ♦ బ్రహ్మకైన. 95

సీ. మున్నుఁ జేసినపుణ్య ♦ ము నశించు నాయువు, దరుగు మహాసంప ♦ దలుదొలంగు
గావునఁ బరదార ♦ గమనసుఖాపేక్షఁ, బూనరు మతిమంతు ♦ లైనవార
లింతయుఁ దెలిసియు ♦ నే మీఱుఁ గానక, తిరిగి యూరక యింతఁ ♦ దెచ్చుకొంటి
నమ్మునీశ్వరుశాప ♦ మరయ సామాన్యమే, యనుభవింపక పోదు ♦ హరునకైనఁ

గీ. గాన సమకాలవర్తికి నిట్టి ♦ మేనితోడ, నేమనుదుఁ బోదుఁ గటకటా ♦ యీదురంత
కర్మ మిత్తఱిఁ జెడగొండ ♦ కరణిఁ బెరిగి, గోడుగుడుపుచు నిటు చుట్టు ♦ కొనియె నన్ను

క. అని వగచి యుదగ్ర్ముఖుఁడై, చని హిమవత్పృథరశిఖర ♦ సన్నిధి శతరో
జనవిస్తీర్ణం బగు నొక, వనజాకర మొప్పఁ జొచ్చి ♦ వాసవుఁడు వెసన్. 97

ఆ.వె. దానినడుమ నున్న ♦ తపనీయకమలనా, ళంబుఁ జెంచి దాన ♦ లలితతంతు
తతులలోన సూక్ష్మ ♦ తరరూపమునఁ జొచ్చి, యణఁగియుండె నింద్రుఁ ♦ డంబుజాక్షి.

వ. అంత నక్కడ రాజులేని నాకస్థానంబు గావున సురలోకంబు శోకవ్యాకులం బయ్యె

నయ్యెడ నెల్లదేవతలును నెల్లచోట్ల నన్వేషించి యెందునుం గానలేక శచీదేవిని బురస్కరించుకొని బృహస్పతికడకుం జని నమస్కరించి సురరాజు నేమిచేత నైన తమ యలజడి సాకల్యంబుగా నెఱింగించి పురందరుండు వచ్చునుపాయం బుపదేశించి యేచందంబున నైన నీభయంబుం దొలంగించి దేవరాజ్యంబు సముద్ధరింపవలయు నని పెక్కుభంగులం బ్రార్థించిన నయ్యమరగురుం డిట్లనియె. 99

క. నన్నిట్లాడకుఁ డింతకు, మున్నుగ నేనతనిదోష ముక్తుని జేయం
బన్నుగఁ జింతించితి నా, పన్నతఁ జెందకుఁడు రండు బలరిపుకడకున్. 100

సీ. అని యూఱడించి దేవావళిఁ దోడ్కొని, యాసరోవరమున హాటకాబ్జ
నాళంబునందుఁ గానక యుండ నణఁగిన, సంక్రందనుని బిల్చి సన్నుతింప
విని శచీరమణుండు వెలువడి లజ్జావ, నతముఖుండై బృహస్పతికి మ్రొక్కి
ప్రాంజలియై యిట్లు పలికెఁ జేయఁగరాని, కార్యంబుఁ జేసిన కతన నాకు

గీ. నిట్టిదుర్దశ వాటిల్లె నేమి సేతు, కర్మఫల మెవ్వరికి నైనఁ గడప వశమె
సిగ్గుపడి మీముఖాబ్జ వీక్షింప నోడి, సన్నుతాచార యిచ్చట నున్నవాఁడ. 101

ఆ.వె. అన్య మెఱుఁగ మీపదాబ్జంబె గతి నాకు, నీగభీరదురిత సాగరంబు
నెట్లు గడతు నానతిమ్ము బృందారకా, చార్య యప్రమేయ సాధుచర్య. 102

వ. అనుటయు సురపతికి బృహస్పతి యిట్లనియె. 103

గీ. ఇంత మరటిల్లఁగా నేల యీభయంబు, దొలఁగఁ జేయు విధానంబు గలదు వినుము
యమునతో గంగగలసిన యచటి కేగి, మజ్జనం బాచరించి నిర్మలుఁడ వగుము.

సీ. అని తెల్పి యప్పుడు సితాసితనిమ్నగా, సంగంబునకు సురాచార్యుఁ డతనిఁ
గొనిపోయి తజ్జలంబున మజ్జనము మూఁడు, దినములు సేయింప దివిజవిభుని
తనువున మునిశాపమున నైనభగములు, తత్తీర్థమహిమ నేత్రంబు లగుచు
వికచపద్మవనంబు విధమున శోభిల్లె, విబుధు లప్పుడు పుష్పవృష్టి గురిసి

గీ. రమరవాద్యనినాదంబు లంబరమునఁ, దుములముగఁ బర్వె నప్సరోరమణు లాడి
రెలమి గంధర్వసంగీతములు చెలంగె, నిట్లు నిర్మలమూర్తియై యింద్రుఁ డంత.

మ. అమరాచార్యుఁడు మంత్రముల్ చదువఁగా నైరావతారూఢుఁడై
యమరుల్ దిక్పతులున్ మునీంద్రులును నెయ్యంబొప్ప సేవింప హ
ర్షముతోడం దనప్రోలి కేగి సురరాజ్యం బేలుచు న్నిత్యసౌ
ఖ్యము నందిల్ల శచీసమేతుఁడయి లేఖస్వామి యుండెన్ గడున్. 106

వ. అని గంగామాహాత్మ్యంబు వివరించి యామహీసురపుంగవుండు. 107

క. ఈయితిహాసశ్రేష్ఠముఁ, బాయక వినువారి కెల్ల ♦ బహుసంపద్దీ
ర్ఘాయువులు గలుగు విను పర, జాయాగమనాదిదురిత ♦ సంహార మగున్. 108

వ. అని చెప్పి. 109

గీ. నీవును బ్రయాగమును నేగి ♦ నిష్ఠతోడ, నందు మజ్జన మొనరించి ♦ యఖిలదోష
పంకనిర్ముక్తవై స్వర్గ ♦ పదసుఖంబు, లనుభవింపుమటంచు బ్రా ♦ హ్మణుఁడు దెలుప

గీ. అమ్మహాత్మునిదివ్యప ♦ దాంబుజములు, శిరము సోఁకంగఁ బ్రణమిల్లి ♦ సెలవు వడసి
వచ్చి ధనధాన్యసద్వస్తు ♦ వాహనములు, బంధుజనదాసదాసికా ♦ ప్రితతి విడిచి. 111

వ. సుఖానుసంధానంబు వర్జించి, వైరాగ్యంబు పదిలపరచి, యెవ్వరితోడం జెప్పక కదలి అరణ్యమధ్యంబునం జనుచుఁ బ్రవాసభయంబుఁ జెందక యొంటికత్తెనై తీర్థసేవాయత్తచిత్తంబున నిట్లు చనిచని పరమతాపససంఘసంసేవితం బగుగంగాయమునాసంగమంబు దర్శించితి. మకరమాఘంబునందుఁ జేయంబడినత్రివాసరస్నానంబున నశేషదోషంబులు నశించె. సప్తవింశతిదినస్నానఫలంబున స్వర్గసుఖంబు లభించె నిట్లు గంగాప్రభావంబున సౌభాగ్యంబును, జాతిస్మరత్వంబునుం గలుగుటంజేసి ప్రయాగమహిమంబుఁ జింతించి ప్రతిమాఘంబును నప్పుణ్యతీర్థంబునకు వచ్చి మజ్జనం బాచరింతు. నిది నాచరితం బీజాహ్నవీగుణాతిశయంబు పురందరాదులు వర్ణింతు రని కాంచనమాలి తనతొల్లింటితెరంగు చెప్పి యారక్కసున కిట్లనియె. 112

క. నీవేమి యఘముఁ జేసితి, వీవికృతపురూపు నీకు ♦ నేటికిఁ గలిగెన్
నీవింక నేలనిలిచితి, నీవిధ మంతయును దెలుపు ♦ నిజముగ నాకున్. 113

వ. అని యడిగిన నమ్మృగాక్షికి బ్రహ్మరాక్షసుం డిట్లని చెప్పందొడంగె. 114

గీ. పూర్వభవమునఁ గాశికా ♦ పురివసించు, బ్రహ్మకులసంభవుండ దౌ ♦ ర్భాగ్యయుతుఁడ
ద్రవ్యలోభంబుకతమునఁ ♦ దగవుఁ దప్పి, తివిరి యేదానమైనఁ బ్ర ♦ తిగ్రహింతు. 115

ఉ. మాలనిచేతనైన విను ♦ మానిని దానము లొలిఁ గొందు దు
ష్షీలతచే దురన్నము భు ♦ జింతు నబద్ధము లాడుచుందు నే
వేళల నేటిగట్టుకడ ♦ వ్రేలుచుఁ జేతులు చాచుఁ గాసుకై
జాలిమి రెండుమూడువిడు ♦ తల్ గుడుతుం బుఱిఁ బైతృకాన్నముల్. 1/6

గీ. తల్లిదండ్రులమృతతిథి ♦ తప్పనడుతుఁ, గాని యుడుగాల బల్కుతూ ♦ రైనఁ దెచ్చి
కడఁగి యొరులకు మునుఁగుడుఁ ♦ గానియొట్టి, దినమునందైన గఁగలోఁ ♦ దీర్థమాడ.

వ. ఇత్తెరంగున దురాచారుండనై పెక్కువర్షంబులు గడపినపిమ్మట నొక్కయరణ్యంబున దైవవశంబునం బంచత్వంబునొంది గంగాతీరవాసంబు కారణంబుగా యమలో

కంబునకుం దొలంగితి. నమ్మహాక్షేత్రంబున నట్లు గావించినమహాపాతకంబు పరిపాకంబు నొందుట రెండుజన్మంబుల గ్రద్దనై, ముమ్మాఱు పులికడుపునం బొడమి రెండుజన్మంబుల సర్పంబనై యంత గూబనై జనించి, తరువాత శునకగర్భంబున నుద్భవించి, దశమజన్మంబునఁ బ్రహ్మరాక్షసుండనై యిట్టివికృతరూపంబున నిచ్చట వసియించి డెబ్బదియేనువేలేండ్లనుండి పాపఫలం బనుభవింపుచుఁ గడలేక యున్నవాఁడ. నిదిగాక వెండియుం పాపంబులు సేయుచుండుదు. నాచేతం జచ్చినజంతువుల లెక్కింప నలవి గాదు. నాయున్నచోటికి మూఁడుయోజనంబులు మేర జనసంచారంబు లేకయున్నయది. నీదరిసెనంబువలన నాహృదయంబు ప్రసన్నతం బొందె. నిట్టినాదోషంబుఁ దొలంగఁజేసి యూర్ధ్వలోకంబు లభించుతెరవు వివరించి నన్నుద్ధరింపు మని మ్రొక్కిన. 118

చ. ఘనకరుణార్ద్రచిత్తమునఁ ♦ గాంచనమాలిని బ్రహ్మరాక్షసుం
గనుఁగొని తండ్రి నీకిటులు ♦ కష్టము వచ్చెనె నిన్నుఁ జూచి నా
మనసు ప్రసన్నతం బొరసె ♦ మానుగ నీదురితం బశేషమున్
జనువిధ మాచరింతు విను ♦ చక్కఁగ దానితెఱంగుఁ జెప్పెదన్. 119

గీ. కడఁగి మాఘంబునఁ బ్రియాగ♦గంగయందు, నేనుఁ జేసినస్నానంబు♦లెన్నికలవు
(నెలమి)తగ నందులో మూఁటి♦ఫలము నీకు, నర్థితో నిచ్చి పాతకం♦బణఁగఁజేతు.

క. తడికావిచీరకొంగున, బిడిచినతోయకణముల వేల్పు ♦ బిత్తరి ఫలమ
ప్పుడు ధారవోసి శఠునికిఁ, దడయక దేవత్వ మొంటెఁ ♦ దగ రక్కసుఁడున్. 121

వ. ఇట్లు వికృతరూపంబు విడిచి దివ్యతనువు దాల్చి ప్రియంబును ముదంబునుం జెనంగొనుచుండ నతండు వేదండగమనకు దండప్రణామంబు సలిపి యిట్లనియె. 122

క. గంగాస్నానమహత్త్వము, నం గలుషవిముక్తుఁ జేసి ♦ నను మాతృశ్రీ
సంగతునిఁ జేసితివి యిం, కం గామ్యం బెద్ది నాకు ♦ కారుణ్యనిధీ. 123

వ. అనిన నప్పుణ్యమూర్తికిఁ బరమోపకారి యిట్లనియె. 124

సీ. ధర్మంబు సేయుము♦తాలిమి పూనుము, హింస మానుము భూత♦హితము సేయు
మనవరతంబు ధ♦ర్మాత్ముల సేవింపు, పరుల నిందించుట♦పరిహరింపు
తనువు నిత్యం బని♦తలఁపకు కామప్ర, సక్తి వర్జింపుము♦సంతతంబు
నిశ్చలవైరాగ్య♦నిష్ఠ వర్తింపుము, బ్రహ్మానుసంధాన♦పరతఁ గాంచు
మక్షయస్థానసౌఖ్యంబు♦లనుభవింపు, మనినఁ గాంచనమాలిని♦కతఁడు మ్రొక్కి
గౌరిసన్నిధి నాచంద్ర♦తారకముగ, సిరులఁ గ్రీడింపు మనుచు నా♦శీర్వదించె. 125

వ. దివ్యవిమానారూఢుండై యప్సరసంధ్రిని వీడ్కొని సురలోకంబున కరిగె. నివ్విధంబున నారకులందఱు ముక్తిఁ బొందుట గనుంగొని. 126

క. ఆవనములోనఁ దిరిగెడు, దేవరుమాలికలు పార్వ◆తీశక్తి యగుచ,
బ్బావని కిట్లని మహి, దేవ్రుఁడు నీకారణమున◆ దివికింజనియెన్. 127

గీ. అడవిలోపల నణఁగుచు◆నెడలుచున్న, కన్నియల మమ్ముఁ గృపఁజూచి◆కావవలదె
అనుచు వారికిఁ దత్స్థల◆బట్టులొసఁగి, వారితో వెండికొండకు◆వనిత చనియె. 128

క. అని చెప్పి కార్తవీర్యా, ర్జునపృథివీపతికి నత్రి◆ మునిముఁడు తగ ని
ట్లనియె వనురక్తి నీకథ, వినువారికి స్వర్గభోగ◆ విభవము గలుగున్. 129

వ. అని చెప్పి తత్పాత్రేయుండు పెండియు నిట్లనియె. తొల్లి రోమశుండను దేవర్షిం గాంచి ప్రణమిల్లి వేదనిధి యను విప్రుండు సకలధర్మబంధనోపాయం బెయ్యది యని యడుగుటయు నమ్మహాయోగి గంగాసంసేవనం బని చెప్పె. బదరికాశ్రమంబు సర్వాభీష్టదాయకంబు, సర్వదుఃఖశాంతిఁ గావించి రుద్రస్థానంబు నిచ్చు. యమున సూర్యలోకంబు నిచ్చు. సరస్వతి బ్రహ్మలోకం బొసంగు. సరయువు, గండకయు, సింధువును, జంద్రభాగయుఁ, గౌశికియుఁ, దామ్రపర్ణియు, గౌతమియు, భీమరథియుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియుఁ, గావేరియు, సముద్రగాములగు నితరపుణ్యనదులును స్వర్గభోగంబులు సమకూర్చు. నైమిశారణ్యంబు సారూప్యంబుఁ జేయు. పుష్కరంబు బ్రహ్మసామీప్యంబు సిద్ధింపఁజేయుఁ గురుక్షేత్రంబు స్వర్గాదిలోకంబు లందించు, దేవప్రాదంబు దేవత్వంబు సంపాదించుఁ బ్రభాసంబు రుద్రత్వంబు సంపాదించు. సోమకూటమహాకాలనీలకంఠార్బుదప్రముఖతీర్థంబులు రుద్రలోకప్రదంబులు, సర్వనదులును సర్వకామంబులు సంఘటించు. భాగీరథి యీ చెప్పినసకలఫలంబులు సమకూర్చి పునరావృత్తిరహితం బగుమోక్షపదంబు సంఘటించుఁ బ్రాయశ్చిత్తంబులు లేని పాపంబులకు గంగాస్నానంబు ప్రాయశ్చిత్తం బగు. గంగాసేవకు లగువారికి మాతృగర్భనివాసక్లేశంబు కలలోనైనం బొందదు. వాతాంబుపర్ణాశనులును, యోగసాధకులును, అశ్వమేధాదిక్రతువులాచరించువారును, తులాపురుషాదిదానకర్తలును, గంగాస్నాతలు పడయుగతికిం బోఁజాలరు. జాహ్నవీభజనపరాయణు లగువారికి సకలపురుషార్థంబులు కరస్థంబులై యుండు నని చెప్పె యొక్క యితిహాసంబు గలదు వినుమని రోమశుండు వేదనిధి కిట్లనియె. 130

సీ. అనఘుఁ డవంతిదే♦శాధీశ్వరుఁడు రాజు, వీరసేనుఁ డనంగ♦వెలయుఁ దొల్లి
సత్యసంధుఁడు శౌర్య♦శాలి గుణాఢ్యుఁడా, తండు భక్తిని సర్వ♦దాతయగుచుఁ
కనకయూపస్తంభ♦కాంచనమయయజ్ఞ, శాలలు నిర్మించి♦యోలి రాజ
సూయముఁ గావించి♦షోడశహయమేధ, ములుచేసి కొండల♦పోడవు ధాన్య
రాసులును ధనరాసులు♦వాసికెక్క, వేలుతొలుచూలు మొదవుల♦విప్రసత్త
ములకుదక్షిణగా నిచ్చి♦సెలమి సకల, జనులు తనదానవిభవంబు♦సన్నుతింప. 131

గీ. తండ్రి బిడ్డలఁ బోషించువి♦ధముగఁ బ్రజలఁ, బోషించుచు బాధలఁ♦బొరయకుండ
ధరణి యేలుచునుండె మో♦దమున నతఁడు, సౌరరాజ్యంబుఁ గామ♦సంభావికరణి.

గీ. అతనిపురమున భద్రుఁ♦డనఁగ నొకఁడు, విప్రుఁ డాచారపద్ధతి♦విడిచి తల్లి
దండ్రులఁ బరిత్యజించిన♦ధర్మదూరుఁ, డై మెలంగుచు నొకనాఁ♦డన్నవాంఛ.

చ. వలనుగఁ దీర్థయాత్రి చను♦వారలఁ గూడి ప్రయాగగంగకున్
బోలుపుగ నేగి మాఘమున♦మూఁడుదినంబులు గ్రుంకి పాపముల్
వాయుట సద్విజత్వమునఁ♦బొల్చి పురంబున కేఁగుదెంచి దో
ర్బలనిధి వీరసేనుఁడును♦భద్రకుఁడున్ మృతిఁ బొందిరప్పుడున్. 134

గీ. ఇట్లు మృతులై విమానంబు♦లెక్కి దివ్య, భూషణసుగంధమందార♦పుష్పమాల్య
శోభితాంబరధరులును♦సురవధూస, హవ్రిసహితులు నై పోయి♦రమరపురికి. 135

వ. ఇట్లు స్వర్గంబునకుం బోయి యింద్రునిసన్నిధి నయ్యిద్దఱుం గొలిచియుండం జూచి వచ్చితి నది గావున రాజసూయాశ్వమేధంబులును మాఘస్నానంబును సమంబు.

గీ. రాజసూయాశ్వమేధస♦త్క్రియలు లాచ, రించిన నతండు దివిజపు♦రీసుఖంబు
లర్థి భుజియించినట్లుగం♦గావగాహ, కర్త శాశ్వతపదమునఁ♦గదలకుండు. 137

వ. అని చెప్పి లోమశుండు మఱియు నిట్లనియె. 138

సీ. గంధర్వుఁ డొకఁడు♦గర్వియై రుచిరాఖ్యుఁ, డసురుని తపమునే♦యంగ నతని
కపకార మొనరింప♦నతిలోపియై కాక, వగు మని శపియింప♦నత్తపస్వి
కతఁడు చేమోడ్చి శా♦పాంతక్రమం బెల్ల, విని గంగ నేఁగి మ♦జ్జనము సలిపి
నిజరూపము ధరించి♦నిబిడమోదంబునఁ, జనియె నింతికి వాఁడు♦వినుము మఱియు
విప్రుఁ డొకఁడుగంగ సే♦వించిమరలి, తనువువింధ్యాద్రినొకపి♦శాచమునకుఁ
గరుణఁ దను దెచ్చునట్టిగం♦గాజలంబు, లొసఁగి యాతని సురపురి♦కునిచెఁ దొల్లి.

క. కావున గంగాస్నానము, గావింపఁగ రమ్యవిప్ర♦గరిమ నానా
జీవని యాతనిఁ దోడొని, యానేలుపుతపని గంగ♦కరిగె నతండ్రా. 140

వ. ఇట్లు ప్రయాగంబునకుం జనుదెంచి తీరంబున నుండి యక్కడిపుణ్యస్థలంబులు చూ
పుచు రోమశమహాముని వేదనిధి కిట్లనియె. 141

మ. అజుఁ డీవేదిక యందు ముందు నియతుం డై చేసె యజ్ఞంబు స
ద్గజతుండప్రతిమాజ్యధార నెపుడున్ ధాత్రీసురుల్ వేల్వఁగాఁ
ద్రిజగత్పూజ్యత నీత్రికుండములలోఁ ద్రేతాగ్నులొప్పారఁగా
నజరేంద్రాదులు యజ్ఞభాగభుజులై యానందముం జెందఁగన్. 142

చ. కరమున శూల మొప్ప నళికస్థలనేత్రమయూఖముల్ దిగం
తరముల నిండ శేఖరసుధాకరఖండరుచుల్ నఖస్థల
స్ఫురణ మొనర్ప సీతనగపుత్రికతో నభవుండు దృష్టిగో
చరుఁడయి నిల్చె మున్నిచట జంభవిరోధికి భూసురోత్తమా. 143

గీ. ఇది సితాసితతోయసమేతవేణి, దీనిజలపాన మొనరించు మానవోత్త
ములకు బహుయజ్ఞములచేతఁ గలుగునింద్ర, లోకసౌఖ్యంబుఁ గల్గువివేకనిలయ.

క. పూని సితాసితతీర్థ, స్నానమునం గల్గుబ్రహ్మసాయుజ్యం బే
మానవులకైన నాత్మ, జ్ఞానవిహీనులకు నైన సత్యంబు సుమీ. 145

ఉ. ఆదిని యజ్ఞముల్ సలిపి హాటకగర్భుఁడు విశ్వమిద్యెడం
బ్రోది రచించె దీనిజల పూరములన్ హరి తీర్థమాడి ల
క్ష్మీదయితుండయెన్ వరించె శశిశేఖరుఁ డిన్నది నాఁడుమాసముల్
క్రీడనరంగఁ దోఁగి గెలిచెం బురదైత్యుల నొక్కటూపునన్. 146

క. గీర్వాణలోకహీనత, నూర్వశి యీయేటఁ గ్రుంకి యుజ్జ్వలరుచులన్
బర్వి తనమేను దనరఁ సు, పర్వపదంబునకు నేగె బ్రాహ్మణతిలకా. 147

క. మహిఁ బుత్రకాముఁడై యల, నహుషుం డీతీర్థజలమునం దోఁగి మహా
మహుఁ డన వెలయుయయాతిన్, మహితాత్ముని బుత్త్రుఁ బడసె మహనీయగుణా.

క. ఇలఁ జంద్రుఁడు గురుపత్నిని, గలసినదోషంబు దొలఁగ గంగాతటినీ
జలధౌతశరీరుండై, మలినతఁ బెడఁబాసి పూర్ణమండలుఁ డయ్యెన్. 149

క. వృత్రాసురుని రణంబున, సుత్రాముఁడు దునిమి చిత్తశుద్ధికి నదిలోఁ
గాత్రంబు ముంచి పరమప, విత్రుండై దేవరాజ్యవిభవముఁ గాంచెన్. 150

సీ. ఇమ్మహాపుణ్యనది నాశ్రయించి శుక్రుఁ, డర్థసిద్ధియు సకలమాయాబలంబు
గ్రహపదంబును బ్రభుతయును గాంచె మున్ను, జహ్నుమునికన్యకాసుప్రసాదమహిమ

గీ. నరుఁడు నారాయణుండును ♦ పరమనియతి, పంచవర్గంబు లశనంబు ♦ పరిహరించి
దీనితీరంబున వసించి ♦ దృఢబలంబు, వడసి రొప్పిరిజగములు ♦ ప్రస్తుతింప. 152

సీ. తొల్లి కశ్యపుఁ డిందు ♦ ధూర్జటిఁగూర్చి త, పంబు చేసి యభీష్ట ♦ ఫలము గాంచె
నిందు మార్కండేయుఁ ♦ డిందుశేఖరుఁగూర్చి, కాలమృత్యుభయంబు ♦ గడచి నిలిచె
పరశురాముఁడు కోప ♦ పరతఁ జేసిన రాజ, హననదోషముఁ బాప ♦ కొనియె నిందు
నలుఁ డిందు నొకవేళ ♦ నిలిచి తేజస్వియై, కలి గెల్చి సామ్రాజ్య ♦ కలితుఁ డయ్యె
నృగమహీపతి యిచ్చోట ♦ నీట మునిఁగి, విప్రశాపోద్ధకీటత్వ ♦ వికృతిఁ బాసె
నిమ్మహానదిమాహాత్మ్య ♦ మెన్నఁదరమె, ధాతకైనను మరి వాని ♦ తాతకైన. 153

వ. మరియు సనకాదియోగీంద్రులును జాహ్నవీతీర్థస్నానఫలంబునం జేసి యోగసిద్ధి వడసిరి. భరద్వాజుం డిందు వర్తించి త్రేతత్రిరూపంబు నొందె. వసురుద్రాదిత్యులును విశ్వమరుదశ్వినీదేవతలును, చిత్రరథాదిగంధర్వులును, శేషాదినాగేంద్రులును సూర్యాదిగ్రహరాజులును, మనువులుం బితృదేవతలును ఋక్పతులును, యక్షరాక్షసగరుడకిన్నరసాధ్యచారణవిద్యాధరులును, చక్రవర్తులును, రాజర్షులును, కామధేనుప్రముఖగోమాతృకలును, రంభాద్యప్సరస్స్త్రీలును మరియునుం దక్కినవారును భాగీరథీతీర్థభజనంబునం దమతమమనోరథంబులు సాధించి కృతార్థులైరి. తిలమాత్రంబైన గంగాజలంబు పానంబుచేసినవాఁడు జీవన్ముక్తుం డగుచు నెండియు జననీగర్భప్రవేశంబు సేయఁడు. జాహ్నవీతోయంబుల నెవ్వాఁడు పితృతర్పణంబు గావించు నతనిగోత్రంబువారు యమునిం గానక నాకలోకంబున నమృతంబుఁ గ్రోలుచు సుఖింతురు. తొల్లి గంగాతీరంబున నొక్కపురంబున నొక్కధనికుని యింటం గల్గుధనంబంతయు నపహరించి మిన్నేటిపాటిరేవులు సొచ్చి యామ్రుచ్చులు నడుచుచున్నతరి నప్పాపకర్ముల నుద్ధరింపవచ్చుచందంబున నమందవేగంబు వాటిల్ల నయ్యేటినీటివెల్లువలు పెల్లుగా నుప్పొంగి ప్రవహించె. నందు మునింగి దొంగలు మృతులై విమానంబు లెక్కి దివ్యమాల్యాంబరభూషణాలంకృతులును, దివ్యస్త్రీగణపరివృతులును నై స్వర్గంబునకుఁ జని: గావున జాహ్నవీతీరంబునఁ గళేబరంబులు విడిచిన సకలజంతువులకు నపవర్గంబు సిద్ధించు గంగాస్నానంబును, గంగాస్మరణంబును గంగాదర్శనంబునుం బుణ్యాత్ములకుఁ గాని లభింపవు. జాహ్నవీనింద గావించినవారికి రౌరవాదినరకక్లేశంబు శాశ్వతంబై వర్తించు. గంగామృత్తికచేత లలాటంబునం దిలకంబు ధరించినవాఁడు, లలాటలోచనుండై కైలాసంబున వసించు. సూర్యచంద్రోపరాగంబుల విషువంబుల సంక్రమణంబుల వ్యతీపాతంబున దర్శపూర్ణమాసులయందు నర్ధోదయమహోదయంబుల మాఘవైశాఖకార్తిక

మాసంబుల దినత్రయంబునం బుష్కరయోగంబున జన్మనక్షత్రంబున మఱియును గల్గుపుణ్యకాలంబుల జాహ్నవీస్నానంబు చేసినవారిఫలంబు లెక్కింప ముక్కంటికైనను నలవిగాదు. గంగాజలంబుల ననాదరంబునవైనం గృతస్నానులగువారు నక్షత్రరూపంబు దాల్చి దివంబున వెల్గుదురింక ముముక్షులకు మోక్షంబును ధనార్థులకు ధనంబునుం బుత్రార్థులకుం బుత్రప్రాప్తియు మఱియుం గామ్యార్థులకుఁగామితార్థంబులును సాధకులకు సిద్ధియు సంభవించు నని చెప్పిన విని పరమానందకందళితరోమాంచకంచుకితాంగుఁడై వేదనిధి రోమశునిచే ననుజ్ఞాతుండై గంగయందు నభిషేకంబుఁ జేసి కృతకృత్యుండై రోమశమహామునికి దండప్రణామంబు చేసిన నతండు బహుప్రకారంబుల నాశీర్వదించి మేరుపర్వతంబునకుం జనియె. వేదనిధియును నిజనివాసంబున కరిగి సుఖం బుండె నని జాహ్నవీమాహాత్మ్యంబు సవిస్తరంబుగా వివరించి దత్తాత్రేయుండు. 154

ఉ. ఈకధ పాపసంఘముల ♦ నెల్ల నశింపఁగఁ జేయుఁ దేవతా
లోకసుఖం బొసంగు ముని ♦ లోఁ గలకోర్కె ఘటించు సమ్మదో
ద్రేకము నావహించు గ్రహ ♦ తీవ్రభయామయరోగతాపమున్
బ్రాకటయుక్తిఁ బాపుఁ గను ♦ భక్తిఁ బఠించిన నాలకించినన్. 155

సీ. ఇది మహోపాఖ్యాన♦మిది వేదసమ్మతం, బిది ముక్తిదాయక♦మిది రహస్య
మిది పురుషార్థంబు♦లిచ్చు నీసత్కథ, గంగ తెఱంగునఁ♦గలుష మడఁచుఁ
గామధేనువురీతిఁ♦గామితార్థ మొసంగు, సకలభోగంబులు♦సంఘటించు
దుస్స్వప్నదోషంబుఁ♦దొలఁగించు రణరంగ, జయమును సంధించు♦భయముఁ బాపు
నర్థి నిది వినువారికే♦హాంగణములు, కరికపోలగళద్దాన♦గంధలోభ
సంభ్రమద్భ్రమరాంగనా♦సరసగాన, పూరితములై ప్రకాశించు♦భూవరేంద్ర.

క. అని చెప్పుటయు నృపాలుఁడుం, విని ప్రాంజలియై మునీంద్రు♦వినయంబున వీ
డ్కొని గంగకుఁ జని మజ్జన, మొనరించెఁ గృతార్థుఁ డగుచు♦నున్నతి వెలయన్. 157

వ. జాహ్నవీస్నానపరిభావంబునం గార్తవీర్యుండు చక్రవర్తిశ్రేష్ఠుండై యేకచ్ఛత్రంబుగా నెల్లజగంబు నేలుచుండె. దత్తాత్రేయుండునుయథేచ్ఛం జనియె నని చెప్పి మఱియు సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 158

గీ. బ్రహ్మలోకంబునందుండి♦ప్రతిదినంబు, నారదుఁడు వచ్చు భక్తి భా♦గీరథికిని
వచ్చి "గంగే నమస్తేథ♦వాని"యనుచు, మ్రొక్కిక్రమ్మఱ నేఁగున♦మ్మునివరుండు,

వ. ఇట్లు ప్రతిదినంబు నారదునిరాకపోకలును నొక్కనాఁడైన గంగయందవగాహంబు

సేయమియును జూచి తత్తీరంబున సంతతంబు స్నానసంధ్యాజపహోమార్చన
పూజనస్మరణతపోమహోత్సవపరాయణు లగుచు వసియించినమహామునులు తమ
యంతర్గతంబున. 160

క. ఇది యేమి గంగలోనా, రదుఁ డెన్నఁడుఁ గ్రుంకఁ డాద♦రమునఁ గదురఁగ నె
య్యేది దలఁచెనొ మనమెఱుఁగము, విదితంబుగ దీని దెలియ♦వినఁగావలయున్. 161

వ. అని చింతించి వారందఱు సమూహంబై నిలిచి కరకమలంబులు మొగిచి సర్వజ్ఞశిఖా
మణి త్రిలోకపావని జగన్మాత సర్వసాక్షిణి యీగంగాభవాని మనసంశయంబుఁ
దీర్పందగుఁ గాని యితరులచేత నీతత్త్వంబు దెలియ నలవి గాదని పలుకుచున్న సమ
యంబున నెప్పటిచందంబున సర్వశాస్త్రవిశారదుం డగు నారదుండు చనుదెంచి
సముచితప్రకారంబున గంగామహాదేవిని దర్శించి ప్రణమిల్లి లేచి వారలున్నప్పుడు 162

సీ. దివ్యరూపముఁ దాల్చి♦ దేదీప్యమానయై, దివ్యగంధాంబర♦దివ్యమాల్య
దివ్యభూషణరత్న♦ఢ్యాంగియై కృపా, శీతలదృష్టియై♦ చెలువుమెరయ
సలిలమధ్యంబున♦సాక్షాత్కరించి య, మ్మునిపతుల్ దనుఁ జూచి♦ మ్రొక్కి పొగడ
గంగాభవాని కం♦కణఝణత్కారంబు, లమర హస్తం బెత్తి♦ యతని బిలిచి
తీర్థమాడెదరిం దెల్ల♦దివ్యమునులు, నీవొకండవు గ్రుంకవు♦ నెమ్మి ననిన
నంబ నీదర్శనంబున♦ నమరు ముక్తి, తీర్థమాడిన లాభంబు♦ దెలియఁజాల. 163

వ. అని పలికె. 164

సీ. కృపయును మేధయుఁ♦గీర్తియు సిద్ధియు, శ్రద్ధయు బుద్ధియు♦ క్షమయు నీవ
సంధ్యయు రాత్రియు♦ శశియందుఁ గల్గు కాం, తియుఁ బావకునియందు♦ తేజమీవ
రవియందుఁ బ్రభయును♦ సరస్వతి గాయత్రి, సావిత్రి స్వాహయు♦ స్వధయు నీవ
లక్ష్మియు గౌరియు♦ లజ్జయుఁ దుష్టియు, శాంతియు ధృతి♦(యుఁ దాంతి నీవ)
నీవ యాన్వీక్షికీదండ♦నీతులనఁగ, యజ్ఞవిద్యయు నాత్మవి♦ద్యయును నీవ
మరి త్రయీవార్తలును మహా♦మతియు నీవ, సర్వమును నీవ సురమాన్య♦ జహ్నుకన్య.

సీ. అఖిలలోకేశ్వరి♦కాదిశక్తికి జగ, జ్జననికి మాయకు♦ శంభుపత్ని
కామ్నాయవేద్యకు♦ నపవర్గధాత్రికి, పరమకల్యాణికి♦ పావనికిని
జలజోద్భవస్థాన♦సౌధాధిరోహణ, శ్రేణికి శుభవిత్త♦సేవధికిని
భరతఖండక్షమా♦భరణముక్తాహార, వల్లికి భవదుఃఖ♦వారిధితరికి
కపిలమునిపతిదృగనల♦ క్షపితసగర, తనయసురపదసౌఖ్యసం♦ధాయినికిని
కామితార్థకవితరణ♦కల్పలతకు, నీకుఁ బ్రణతి భగీరథ♦నృపకుమారి. 166

క. ఏలా వ్రతోపవాసము, లేలా వేదాంతచర్చ ♦ లేలా మఖముల్
హేలి న్నినుఁ జూచినమనుజు, జాలికి హిమశైలపుత్రి ♦ యఖిలజనేత్రీ. 167

క. నీనామస్మృతి చేసిన, మానవులకు సప్తకోటి ♦ మంత్రజపాను
ష్ఠానఫలాధిక పుణ్యము, మానుగ సిద్ధించు భువన ♦ మండనమూర్తీ. 168

వ. ఇవ్విధంబున ననేకప్రకారంబుల జాహ్నవీదేవి నభినుతించి, గానవిశారదుండు నారదుండు సత్యలోకంబున కరిగె. నమ్మహాదేవియు నంతర్ధానంబు చేసె. నిట్లు పరివర్తించిన గంగానారద సంవాదవాక్యంబులు విని తీరవాసు లగు నమ్మహామునులు నివృత్తసంశయులును, బరిహృష్టాంతరంగులును నై యద్ద్విజమునిపుంగవుని ననేకభంగులం బ్రశంసించి దర్శనమాత్రంబున నఖిలజంతువులకు స్వర్గాపవర్గంబులు నిరర్గళంబుగా సంఘటించుటకు దీక్ష పూని జగంబులు రక్షింపుచున్న భాగీరథికి నమస్కరించి కృతకృత్యులై సుఖంబుండిరి. అది గావున జాహ్నవీదర్శనమాత్రంబున నైశ్వర్యంబు సంభవించు. నిది పరమార్థం బని చెప్పి సూతుం డిట్లనియె. 169

శా. ఈహాపూర్ణఫలప్రదానచణమై ♦ యింపొందు నీ జాహ్నవీ
మాహాత్మ్యంబుఁ బఠించిన న్వినినఁ జేర్ ♦ మన్ వ్రాసినన్ సంతతో
త్సాహం బొప్పఁగఁ బూజ చేసినను భ ♦ క్తశ్రేణికిన్ సంభృత
స్నేహుండై శివుఁ డిచ్చు నిత్యవిభవ ♦ క్షేమాయురౌన్నత్యముల్. 170

వ. అని యీప్రకారంబున వేదవ్యాసప్రియశిష్యుండు, రోమహర్షణపుత్రుండు సకలపురాణార్థవ్యాఖ్యానవైఖరీసమేతుండు నగు సూతుండు జాహ్నవీమాహాత్మ్యంబు చెప్పిన విని శౌనకాదిమహామునులు సంతుష్టస్వాంతులై భాగీరథికి నమస్కరించి యక్కథకునిం బెక్కుచందంబులం గొనియాడి యతండునుం దారునుం గంగకుం జని స్నానంబు గావించి కృతకృత్యులైరి. సూతుండు మీకు నభ్యుదయపరంపరాభివృద్ధి యగు నని వారి నాశీర్వదించి యథేచ్ఛం జనియె. నమ్మునులును నిజనివాసంబుల కేతెంచి సుఖంబుండిరి. ఈ జాహ్నవీమాహాత్మ్యంబు విన్నవారికిం బఠించినవారికిఁ బరమేశ్వరుండు భవానీవల్లభుండు సకలశుభంబులుం గృపసేయు. 171

ఉ. నీకరుణాకటాక్షమున ♦ నెమ్మి దనర్చు వచోవిభూతిచే
నీకృతి సంభవించె మది ♦ కెంతయు నింపుగ నిచ్చగించి దో
షాకరమంచు నెంచక ద ♦ యామతితోడఁ బరిగ్రహింపు వి
ద్యాకుశలార్థముఖ్యఫల ♦ దాయక వెంటురిసోమనాయకా. 172

శా. గౌరీచిత్తసరోమరాళ ఫణిశా ♦ గ్రైవేయ శర్వాగణీ
హారక్షీరపటీశవర్ణ మునిచి ♦ త్తాంభోజమార్తాండ జం
భారాతిప్రముఖామరోజ్వలకిరీ ♦ టాగ్రస్థరత్నప్రభాం
కూరాలింగితపాదపద్మ సుమనః ♦ కోదండగర్వాపహా. 173

క. కరుణారసవనజాలయ, తరుణాబ్జవతంస కోటి ♦ తరణిప్రభ వా
క్తరుణీస్మరణీయగుణా, ధరణావెంటూరినగర ♦ పాలననిపుణా. 174

కలహంసవృత్తం. సరసకేళిరత ♦ జహ్నుకుమారీ
సురుచిరోక్తిగణ ♦ శోభితమాళీ
నరపతిప్రణుత ♦ నందురికామే
శ్వరమనోజలజ ♦ సంతతవాసా. 175

గద్య—ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ
లక్ష్మణకవినామధేయప్రణీతం బైనజాహ్నవీ
మాహాత్మ్యం బనుమహాప్రబంధంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము.
శ్రీసాంబశివార్పణమస్తు.

| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B 123 |
| పుస్తకం పేరు | జాహ్నవీమాహాత్మ్యము. |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 115 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, B,104 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |